AMMA NUDI
Telugu Monthly

Vol. 1
Issue 1
Rs. 20
March 2015
Tenali, AP

తెలుగుజాతి పత్రిక

1993-2013 నడుస్తున్న చరిత్ర

# అమ్మనుడి

మార్చి 2015

## తెలుగు నుడి పటం




ఆంధ్ర, తెలంగాణలలో తెలుగువారెందరున్నారో ఇంకా అంతమంది తక్కిన రాష్ట్రాల్లో వున్నారు. తెలుగువారి సంఖ్య మొదటిస్థానంలో కాని, రెండవస్థానంలో కాని - ఉన్న ప్రాంతాన్ని జిల్లాలవారీగా గుర్తిస్తూ ఈ చిత్రపటాన్ని రూపొందించాము. కొలతలు వర్తించవు. ఒక అవగాహన కోసమే ఈ పటం.

1. గంజాం
2. ఫూల్‌బని
3. గణపతి
4. శ్రీకాకుళం
5. విజయనగరం
6. రాయగడ
7. కలహండి
8. నవరంగపూర్
9. కోరాపుట్టి
10. మల్కనగిరి
11. విశాఖపట్టణం
12. దంతెవాడ
13. బస్తర్
14. కాంకేర్
15. గచ్చిరోలి
16. చంద్రాపూర్
17. యావత్మల్
18. నాందేడ్
19. ఆదిలాబాదు
20. నిజామాబాద్
21. కరీంనగర్
22. వరంగల్
23. ఖమ్మం
24. తూ.గోదావరి
25. ప. గోదావరి
26. కృష్ణ
27. గుంటూరు
28. నల్లగొండ
29. మెదక్
30. బీదర్
31. గుల్‌బర్గా
32. రంగారెడ్డి
33. హైదరాబాదు
34. మహబూబ్‌నగర్
35. రాయచూరు
36. కొప్పళ
37. బళ్లారి
38. కర్నూలు
39. ప్రకాశం
40. నెల్లూరు
41. కడప
42. అనంతపురం
43. చిత్రదుర్గం
44. తుముకూరు
45. బెంగళూరు గ్రామ
46. బెంగళూరు నగర
47. కోలార్
48. చిత్తూరు
49. తిరువళ్లూరు
50. చెన్నై
51. కాంచీపురం
52. వేలూరు
53. తిరువణ్ణామలై
54. కృష్ణగిరి
55. ధర్మపురం
56. సేలం
57. నామకల్లు
58. ఈరోడు
59. కోయంబత్తూరు
60. దిండుగల్లు
61. తేని
62. మదుర
63. విరుదునగర్
64. తూతుకుడి *
65. తిరునల్వేలి *

* ఈ జిల్లాలలో ఉత్తరభాగం మాత్రమే తీసుకొన్నాము.

* వింధ్యకు దక్షిణంగా వున్న రాష్ట్రాలను మాత్రమే ఎంచుకొని, జిల్లాను కొలమానంగా తీసుకొన్నాము. ఒక్కొక్క భాషకు ఒక్కొక్క రంగును కేటాయించాము. ప్రధానభాషను పూర్తి రంగులోను, రెండవ భాషను గీతలలోను చూపించాము.

పలు నెలవులు - పలుకు ఒక్కటే



తెలుగు భాష కోసం, జాతి కోసం ఉద్యమించే అమ్మనుడి మాసపత్రికకు శుభాకాంక్షలు...
ఆంధ్రప్రదేశ్ రాజధాని ప్రాంతంలో అతిపెద్ద గ్రామీణ విద్యాసంస్థల సముదాయం "శ్రీరామా రూరల్"
Mr. KVS.CHOWDARY, IAS
Sub-Collector, MadhyaPradesh
ACHIVED
10th RANK IN
ALL INDIA CIVILS
GOVT. OF INDIA REGIONAL MATHS OLYMPIAD-2009
1 FIRST RANK
K.JAYAVARDHAN REDDY
GOVT. OF INDIA REGIONAL MATHS OLYMPIAD-2009
State 9th Rank
K.NANDINI
NATIONAL SMART OLYMPIAD - 2014
State 2nd Rank
M.SAI VARMA
6th State Rank
P.JAITHRA
INTER
979 978 976 968 962
SSC - 2010 STATE 6th RANK
T.DURGA ANITHA
585/600
SSC - 2011 STATE 7th RANK
K.NANDINI
587/600
SSC - 2012 4 Students Scored 10 GPA
SSC - 2013 2 Students Scored 10 GPA
SSC - 2014 9 Students Scored 10 GPA
K.Bala Koti Reddy
Selected for
GSLV AWARD-2014
1949 నుండి లక్ష్యం ఏదైనా...
విజయం మా వెంటే...
పరిసర గ్రామాల విద్యార్థినీ, విద్యార్థులకు
బస్సు సౌకర్యం కలదు
విద్యార్థినీ, విద్యార్థులకు
ప్రత్యేక హాస్టలు వసతి కలదు
Sri Rama 66 Years
శ్రీరామా రూరల్
విద్యాసంస్థలు
చిలుమూరు, కొల్లూరు (మం), గుంటూరు జిల్లా.
సంప్రదించండి :
9949771169, 9949771167, 8008404098
అడ్మిషన్లు కొరకు
• శ్రీరామా రూరల్ అకాడమి
• శ్రీరామా రూరల్ హైస్కూల్ (తె.మీ.)
• శ్రీరామా రూరల్ హైస్కూల్ (ఇం.మీ.)
• శ్రీరామా రూరల్ పయనీర్ ఇం.మీ. స్కూల్
• కె.వి.యస్.ఆర్.టి. జూనియర్ కాలేజి
• ఆచార్య యన్.జి. రంగా బి.ఇడి.. కాలేజి
www.sriramaruralacademy.com
youtube/sriramadocumentary
tulasiprasad48@gmail.com
srirama rural academy

# మొన్నటిదాకా 'నడుస్తున్న చరిత్ర'

# అదే ఇప్పుడు 'అమ్మనుడి'



**1993** డిసెంబరులో ఒక చిన్న పత్రికగా సామాజిక, రాజకీయాంశాలతో మొదలైన 'నడుస్తున్న చరిత్ర' క్రమంగా ఎదిగి తెలుగు భాషోద్యమ పత్రికగా రూపుదిద్దుకొంది. తెలుగు భాషోద్యమ సమాఖ్య నిర్మాణంలోను, ఎదుగుదలలోను వెన్నుదన్నుగా నిలిచి ఒక భాషోద్యమ పత్రికగా పేరు గడించింది.

నడుస్తున్నచరిత్ర ప్రోత్సాహంతో ఎందరో రచయితలు తయారైనారు. కాలవాహిని అలలవాలున జారిపోయేదిగా కాక, ఏటికెదురీది నిలిచి గెలిచిన పత్రికగా నడుస్తున్నచరిత్ర పేరు గడించింది. ఎక్కడ ఎవరు ఏ సభలో మాట్లాడినా, పత్రిక పేరు ప్రస్తావించక తప్పని విధంగా ఉద్యమంతో పత్రిక మమేకం అయింది. ప్రభుత్వాన్నయినా, పెద్దలనయినా తెలుగు జనశ్రేయస్సు కోసం నిలదీసిన చరిత్ర, తెలుగుకు ప్రాచీనభాష హోదాకోసం జరిగిన పోరాటానికి దారిచూపి అండగా నిలిచిన చరిత్ర 'నడుస్తున్న చరిత్ర'దే. తెలుగుపై ఇతర భాషల మితిమించిన ఆధిపత్యాన్ని ప్రశ్నించి తెలుగును కాపాడుకొని పెంపుదల చేసుకోవడానికి ప్రయోజనకరమైన రచనలను ప్రోత్సహించి ప్రచురించిన ఘనత 'నడుస్తున్న చరిత్ర'దే.

అటువంటి పత్రికకు ఆర్థిక వనరులు అడుగంటడంతో 2013 అక్టోబరు సంచికతో ప్రచురణను ఆపివేయ వలసివచ్చింది. నా అనారోగ్యంతో ఒక ఏడాదికి పైగా విశ్రాంతిగా గడుపవలసి వచ్చింది. ఇప్పుడు ఆరోగ్యాన్ని పుంజుకొని, మళ్లీ నా భాషోద్యమ యాత్రను కొనసాగిస్తున్నాను.

ఇప్పుడు నడుస్తున్న చరిత్ర స్థానంలో **'అమ్మనుడి'** పేర పత్రికను మీ ముందుకు తెస్తున్నాను. నడుస్తున్నచరిత్ర పత్రిక ఏ ఆశయాలకు నిలబడిందో, దానికి తగ్గ పేరునే ఎంచుకోవాలనిపించింది. సహచరుల, చదువరుల తలంపులను కూడ తెలుసుకొని, **'అమ్మనుడి'** పేరును నమోదు చేయించి, ఇప్పుడు తొలిసంచికను మీ ముందుకు తెస్తున్నాను.

**'అమ్మనుడి'** పత్రికకు నడుస్తున్న చరిత్ర చదువరులే తొలి చదువరులు, ప్రోత్సాహకులు. స్పష్టమైన లక్ష్యాలతో ఇప్పుడు పత్రిక మీముందుకు వచ్చింది. దీని నిర్వహణ కోసం **'తెలుగుజాతి'** ట్రస్టును మిత్రులతో కలిసి స్థాపించాను. ఆ ట్రస్టు తరఫున ఈ పత్రిక వెలువడుతున్నది. ఆ వివరాలు తర్వాతి పుటలో ఇచ్చాము. చూడండి.

ఈ పత్రిక ముఖచిత్రం తెలుగుజాతి సాంస్కృతిక చిత్రపటం. 18 కోట్లకు పైబడిన తెలుగుప్రజలు కేవలం ఆంధ్ర తెలంగాణాల్లోనే గాక మరి అనేక రాష్ట్రాల్లో వేలాది ఏళ్లుగా పాదుకొని వున్నారనే వాస్తవాన్ని నడుస్తున్నచరిత్ర వెలుగులోకి తెచ్చిన సంగతి మీకు తెలిసిందే! ఇప్పుడీ సంగతి అందరి గుర్తింపుకు వచ్చింది. 'అమ్మనుడి' ఈ కృషిని కొనసాగిస్తుంది. ఇందుకు మీ అందరి ప్రోత్సాహం, సహకారం కొనసాగించాలని కోరుతున్నాను. 'అమ్మనుడి'కి మీ ఆశీస్సులు కోరుతున్నాను.

మీ

**సామల రమేష్‌బాబు**

సంపాదకుడు

# తెలుగుజాతి (ట్రస్టు)

## నడుస్తున్న చరిత్ర పాఠకులకు, తెలుగు భాషోద్యమకారులకు, పెద్దలకు, మిత్రులకు విన్నపం

'నడుస్తున్న చరిత్ర' పత్రిక 20 ఏళ్లుగా నిరాటంకంగా ప్రచురింపబడుతూ, 15 ఏళ్లపాటు తెలుగు భాషోద్యమ నిర్మాణానికై చేసిన కృషి మీకు తెలుసు. తెలుగువారి చరిత్రలో శాశ్వతంగా నిలిచిపోయే పత్రికల్లో ప్రముఖమైనదిగా 'నడుస్తున్న చరిత్ర' కీర్తిని సంపాదించింది.

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే గాక, పొరుగు రాష్ట్రాల్లోనూ తెలుగువారి శ్రేయస్సుకు తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరుగుతున్నది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేగాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు ఈ దిశగా పనిచేస్తున్నారు. ఇందుకు తగ్గవిధంగా ఇంకా సమగ్రంగా, బలంగా ఒక పత్రికను, దానితోపాటు తరచుగా కొన్ని పుస్తకాలను ప్రచురించవలసిన అవసరం ఏర్పడింది. ఈ అవసరాన్ని తీర్చడానికే ఇప్పుడు 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును నిర్మాణం చేయ తలపెట్టి, ఆ సంస్థను రిజిస్ట్రేషన్ చేయించాము. (92/2014).

తమ భాషాసంస్కృతులను కాపాడుకొంటూ, పెంపొందించుకొంటూ తెలుగువారు అన్ని రంగాల్లో ముందడుగు వేసేందుకు తోడ్పడటమే ఈ ట్రస్టు లక్ష్యం. తెలుగు మాతృభాషగా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది. దేశమంతటా – ముఖ్యంగా తెలంగాణ, కోస్తాంధ్ర, రాయలసీమల్లోనే గాక, తమిళనాడు, కర్నాటక, కేరళ, మహారాష్ట్ర, ఛత్తీస్‌ఘడ్, ఒరిస్సాలలో కూడ తెలుగు ప్రజలు తొలినుండి అత్యధికంగా నివసిస్తున్నారని తక్కిన రాష్ట్రాలలో కూడా అక్కడక్కడ స్థిరపడి వున్నారని మనకు తెలుసు. భారతదేశంలోనేగాక శ్రీలంక, ఇండోనేషియా, మలేసియా, సింగపూర్, బర్మా, మారిషస్‌లలో కూడా శతాబ్దాలుగా తెలుగువారు నివసిస్తున్నారు. ఇప్పుడు అమెరికా, బ్రిటన్, జర్మనీ తదితర దేశాల్లోనూ వేలాదిమంది మన యువత ఉద్యోగాల్లో ఉన్నారు. మన దేశంలోను, ఇతర దేశాల్లోనూ కలిపి తెలుగు భాషాజాతీయులు 18 కోట్లకు పైనే ఉన్నారంటే అతిశయోక్తి కాదు.

'నడుస్తున్న చరిత్ర' పత్రిక ప్రచురణ 2013 అక్టోబర్‌తో నిలిచింది. దానిని మరింత సమగ్రంగా తెలుగుజాతి పత్రికగా తీర్చిదిద్దాలనే ఆశయంతో **'అమ్మనుడి'** అనే పేరుతో పత్రిక ప్రచురణను మొదలుపెట్టాము. **'అమ్మనుడి'** వివరాలను ఈ పత్రికలోనే చూడవచ్చును. కొన్ని ప్రత్యేకమైన పుస్తకాల్ని కూడా ప్రచురించాలని తెలుగుజాతి ట్రస్టు సంకల్పించింది. తొలుతగా స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'** విడుదల చేశాము. తెలుగుజాతి ఆత్మగౌరవాన్ని ప్రతిభావ్యుత్పత్తులను చాటేందుకు కొన్ని ఇతర కార్యక్రమాల్ని కూడా చేపడుతుంది. ఇందుకోసం ఈ ట్రస్టును బలమైన పునాదులతో, వనరులతో ఏర్పరచాలని నిర్ణయించాము. దీనినొక శాశ్వతసంస్థగా రూపొందిస్తున్నాము. అందుకు మీ అందరి చేయూత కావాలి. 'నడుస్తున్న చరిత్ర' పాఠకులుగా, భాషోద్యమం పట్ల శ్రద్ధాసక్తులు కలిగివున్న తాము 'తెలుగుజాతి' ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.

**ట్రస్టుకు ఈ క్రింది విధంగా విరాళాలనిచ్చి ప్రోత్సహించగోరుతున్నాము.**

| | | | |
|---|---|---|---|
| **ప్రోత్సాహకులు** | **రు. 10,000** | **పోషకులు** | **రు. 25,000** |
| **విశిష్ట పోషకులు** | **రు. 50,000** | **రాజ పోషకులు** | **రు. 1,00,000/-లు** |

వీరికి ప్రతినెలా పత్రికను ఉచితంగా పంపుతాము. ట్రస్టు ప్రచురించే పుస్తకాలను రాయితీధరకు పంపిస్తాము.
వీరి ఫొటోతో క్లుప్తంగా పరిచయాన్ని **'అమ్మనుడి'** పత్రికలో ప్రచురిస్తాము.

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి. యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.
అకౌంట్ నెం. 914020020387880 I.F.C.Code : UTIB0000068




కార్యాలయాలు : **తెలుగుజాతి** (ట్రస్టు), 1-898-522/7, సిస్ బిల్డింగ్, చిక్కడపల్లి, హైదరాబాదు-500 020
**తెలుగుజాతి** (ట్రస్టు), 8-386, జీవక భవన్, అంగలకుదురు పోస్టు, తెనాలి మండలం,
గుంటూరు జిల్లా-522211. ఫోన్: 9440448244

# కృతజ్ఞతలు



**'నడుస్తున్న చరిత్ర'**ను

ఏళ్ల తరబడి పోషించి,

తెలుగు భాషోద్యమ నిర్మాణానికి

చేయూతనందించిన గొప్ప వ్యక్తి, పారిశ్రామికవేత్త,

పార్లమెంటు (లోక్‌సభ) సభ్యులు

## శ్రీ ఎస్.పి.వై.రెడ్డి గారికి

## హృదయపూర్వక కృతజ్ఞతలు

ఆ మహానుభావుని ఆర్థిక సహకారమే 15 ఏళ్లపాటు నాచేత **'నడుస్తున్న చరిత్ర'** పత్రికను నడిపించింది.

ఎల్లప్పుడూ వారి ప్రోత్సాహాన్ని, సహకారాన్ని కోరుతూ....

– సామల రమేష్‌బాబు

వారివి పలు నెలవులు. అయినా పలుకు ఒక్కటే. ఆ పలుకే తెలుగు. అదే వారి **'అమ్మనుడి'**. తెలుగు అమ్మనుడిగా వున్న జనులు ఎక్కడున్నా వారందరూ తెలుగుజాతి వారే. వారందరి కోసం వెలువడుతున్న పత్రిక అమ్మనుడి. తొలిసంచిక ఇది. ఇరవయ్యేళ్ల 'నడుస్తున్నచరిత్ర' వారసత్వంతో వెలువడుతున్న ఈ **'అమ్మనుడి'** మీ అందరిది.




## లోపలి పుటలలో....



**ఈ పత్రికలో రచయితలు వ్యక్తం చేసే అభిప్రాయాలు వారి స్వంతం. వారితో పత్రిక యాజమాన్యం, సంపాదకుడు ఏకీభవించవలసిన అవసరం లేదు.**


**రచనలు, ఉత్తరప్రత్యుత్తరాలకు**

డాక్టర్ సామల రమేష్‌బాబు, సంపాదకుడు, **అమ్మనుడి**,
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం,
విజయవాడ-520004. e-mail : ammanudi@gmail.com
దూరవాణి: కార్యాలయం : *0866-2439466* సంపాదకుడు : *9848016136*

తెలుగుజాతి పత్రిక
**అమ్మనుడి**
మాసపత్రిక
● నుడి ● నాడు ● నెనరు

సంపాదకుడు **డా॥ సామల రమేష్‌బాబు**

శాలివాహన శకం 1937 జయనామ సంవత్సర ఫాల్గుణ ***(వేగాపి)** శుక్ల ఏకాదశి ఆదివారము నుండి శ్రీ మన్మథ నామ సంవత్సర చైత్ర ***(ముత్తాపి)** శుక్ల ఏకాదశి మంగళవారము వరకు

* **వేగాపి, ముత్తాపి** = తెలుగు నెలలు

**చందా వివరాలు**

| | | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|---|
| శాశ్వత చందా | : | రూ.5000 | రూ.7500 | -- |
| 6 సం॥ | : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ | : | రూ. 600 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ | : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

**చందాదారులకు సూచనలు**

మీ చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
మీ చందా పూర్తయితే దయచేసి వెంటనే చందా పంపించండి. ఎం.ఒ. గాని డ్రాఫ్టు గాని పంపండి.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా

**డా॥ సామల లక్ష్మణబాబు,**
ప్రచురణకర్త, 'అమ్మనుడి' పత్రిక,
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు,
తెనాలి మండలం, గుంటూరు జిల్లా - 522 211.
ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com

**ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు**
**యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.**
**అకౌంట్ నెం. 915020010550189**
**IFSC Code : UTIB0000556**
**కోరినవారికి ఆన్‌లైన్ పత్రిక పంపగలము.**

# 'నడుస్తున్నచరిత్ర' చందా ఉన్నవారికి సూచన

**'అమ్మనుడి'** పత్రిక ఇంతకు ముందున్న నడుస్తున్నచరిత్ర ఆశయాదర్శాలతో వస్తున్నదే. కానీ పత్రికను **'తెలుగుజాతి'** ట్రస్టు ప్రచురిస్తున్నది. అయినా, కొందరి విజ్ఞప్తి మేరకు నడుస్తున్నచరిత్రకు చందాలు మిగిలివున్న వారికి కూడా వారి చందా సొమ్ముకు సరిపడా **'అమ్మనుడి'** పత్రికను పంపించాలని తెలుగుజాతి ట్రస్టు నిర్ణయించింది. కనుక ప్రతివారికి వారి చందా సొమ్ము ఇప్పుడు **'అమ్మనుడి'** చందా వివరాల ప్రకారం ఎప్పటివరకూ సరిపోతుందో – పత్రికను పెట్టి పంపే కవరుపై చిరునామా పైన ముద్రించి వుంటుంది. దానిని చూచుకొని, దయచేసి సకాలంలో **'అమ్మనుడి'** చందాను పంపించి పత్రికకు మీ మద్దతును కొనసాగించ గోరుతున్నాను.

**శాశ్వత చందాదారుల విషయంలో మనవి :**

'నడుస్తున్నచరిత్ర'కు రు. 1000 లు చెల్లించి, శాశ్వత చందాదారులుగా చేరినవారు 'అమ్మనుడి' పత్రికకు శాశ్వతచందా రు.5000 లకు గాను రు.4000 లు మాత్రం పంపి కొత్తగా రశీదు పొంద ప్రార్థన. అలా చేయలేనివారికి ఏడాదిపాటు **'అమ్మనుడి'** పత్రికను పంపించగలమని, అప్పటికీ చందాను కొనసాగించలేని వారికి పత్రికను పంపజాలమని మనవి చేస్తున్నాము. దయచేసి సహకరించగోరుతున్నాము.

## విన్నపం

ఉచితంగా పత్రికను ఇకపై పంపించజాలము.

'నడుస్తున్నచరిత్ర' పత్రికను అనేకమందికి ఉచితంగా పంపిస్తుండేవారము. ఇకపై ఉచితప్రతులు పంపడం వీలుపడదు. పత్రిక కావలెనని కోరుకొనే వారందరూ చందాదారులుగా చేరవలసిందిగా కోరుతున్నాము. మీ మిత్రులను కూడా ప్రోత్సహించి, చందాదారులుగా చేర్చి పత్రికను శక్తివంతం చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము.

**– ప్రచురణకర్త**

**అన్ని భాషలకన్నా అమ్మ భాషే మిన్న**

**మాతృభాషను ప్రేమించలేనివాడు, మాతృమూర్తినీ మాతృభూమినీ ప్రేమించలేడు.**

# రచయితలకు, కవులకు సూచనలు

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని **'నడుస్తున్న చరిత్ర'** ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని **'అమ్మనుడి'** పత్రిక కొనసాగిస్తుంది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగుతీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి.
2. **'అమ్మనుడి'**లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు సమకాలీన సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి.
3. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించ గలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైన్ల)లకు మించకూడదు. ప్రతినెలా 4 లేక 5 కవితలకు మించి పత్రికలో చోటుండదు.
4. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగువారి శ్రేయస్సుకు సంబంధించిన అంశాలపై రచనలను పంపండి. విమర్శలు విషయంపైనే ఉండాలిగాని వ్యక్తులపై చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి.
5. ప్రతినెల 15వ తేదీ లోపు చేరిన రచనలనే రాబోయే నెల పత్రికలో ముద్రణకు పరిశీలించగలము.
6. రచనలను యూనికోడ్‌లో గాని, అను ఫాంట్స్ లో గాని పంపించవచ్చు. లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి ఇ-మెయిల్) కు పంపాలి. లేదా కొరియర్‌లో గాని, రిజిష్టర్డ్ / సాధారణ పోస్టులో గాని పంపవచ్చు.
7. ప్రచురణ కోసం పంపించే రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంప లేదని, పరిశీలనలో లేదని హామీపత్రం విధిగా, స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము.
8. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.


STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS OF
**"AMMANUDI", MONTHLY MAGAZINE, TENALI**
as required under Rule 3 of the Registration of News Papers (Central) Rules 1956.

**FORM IV** (See Rule 3)

| | | |
|---|---|---|
| 1. Place of Publcation | : | Angalakuduru |
| 2. Periodicity | : | Monthly |
| 3. Printer's Name | : | SAMALA LAKSHMANA BABU |
| 4. Whether Citizen of India | : | Yes |
| 5. Address | : | D.No.8-386, Angalakuduru Post, Tenali Mandal - 522 211 Guntur Dist., A.P. |
| 6. Publishers Name | : | SAMALA LAKSHMANA BABU |
| Address | : | As above |
| 7. Editor's Name | : | SAMALA RAMESH BABU |
| Address | : | As above |
| 8. Names & Addresses of individuals who own the News Paper | : | SAMALA LAKSHMANA BABU As above |

I, Samala Lakshmana Babu, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Vijayawada
28-02-2015

sd/- S. Lakshmana Babu
Publisher


# చదువరులకు విన్నపం

1. 'అమ్మనుడి' సంచికలో వచ్చిన రచనలపై మీ స్పందనను తెలియజేయండి.
2. సమాధానం కోరే సందేహాలను, ప్రశ్నలను సంపాదకుని ఉద్దేశించి పంపవచ్చు. వాటికి పత్రికలోనే సమాధానాలు ఇవ్వబడతాయి.

## *రచనలు పంపవలసిన చిరునామా :*


డా॥ సామల రమేష్‌బాబు,
సంపాదకుడు 'అమ్మనుడి'
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ,
హిందీ కళాశాల వీధి, మాచవరం,
విజయవాడ-520004. ఫోన్ : 9848016136,
0866-2439466
e-mail: ammanudi@gmail.com


*- సంపాదకుడు*

United Nations
Educational, Scientific and
Cultural Organization

అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం సందర్భంగా
యునెస్కో డైరెక్టర్ జనరల్ శ్రీమతి ఇరీనా బొకోవా సందేశం

# భాష ద్వారా, భాషతోనే అంతరీకరణ విద్య

పదిహేనవ అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవాన్ని 2015వ సంవత్సరంలో జరుపుకోబోతున్నాము. అంతర్జాతీయ సమాజానికి ఇది ఒక మలుపు వంటి సంవత్సరం కూడా. కారణం సహస్రాబ్ది అభివృద్ధి లక్ష్యాలకు ఇదే చివరి సంవత్సరం. అంతేకాకుండా ప్రపంచవ్యాప్త నిరంతర అభివృద్ధికి దేశాలు ప్రణాళికలని నిర్వచించుకుంటున్న కాలం కూడా ఇదే.

2015 తర్వాత వచ్చే కాలానికి అభివృద్ధి ప్రణాళికలో అందరికీ నాణ్యమైన విద్య అనే అంశం ప్రధానాంశం కావాలి. విద్య అందుబాటును విస్తృతపరచడం, నాణ్యతని పక్కాగా చూచుకోవడం ఇప్పటిదాకా విద్య అందని వారిని విద్య బోధనలోనికి చేర్చుకోవడం, ప్రపంచంలోని అందరికీ విద్య అందుబాటులోనికి తేవడం అనేవి నిరంతర అభివృద్ధి ప్రణాళికలో ప్రాధాన్యాన్ని సంతరించుకోవాలి. ఈ లక్ష్యాలను చేరుకోవడానికి విద్యాబోధన అనేది మాతృభాషలోనే జరగడం అన్నది తప్పకుండా జరగాలి. నేర్చుకునే ప్రక్రియ, నేర్చుకునే ప్రక్రియకు దన్ను, గణితం, చదవడం, రాయడం అన్నీ మాతృభాషలో జరగాలి. ఈ లక్ష్యాన్ని ముందుకు తీసుకుపోవడానికి విద్యాబోధన, శిక్షణ, విద్యా కార్యక్రమాలు, సరైన శిక్షణ వాతావరణాన్ని కల్పించుకోవాలి.

ఈ లక్ష్యాలను యునెస్కో ప్రపంచవ్యాప్తంగా ముందుకు తీసుకుపోతుంది. అంతరీకరణ విద్య (ఇంక్లూసివ్ ఎడ్యుకేషన్)లో భాగంగా లాటిన్ అమెరికాలో యునెస్కో చిల్డ్రన్స్ ఫండ్ (యునెస్కో బాలలనిధి)తో ద్విభాషా విధానంతో ద్విసంస్కృతి విధానంతో అంతరీకరణ విద్యను అమలుచేయడం జరుగుతూ వుంది. దేశీయమైన సంస్కృతిని ఇతరేతర సంస్కృతిని కలగలిపేందుకు ఈ విధానాన్ని అనుసరించడం జరుగుతూ వుంది. యునెస్కో ప్రాంతీయసంస్థ, ఆసియాలో, బాంకాక్, థాయ్‌లాండులలో (పసిఫిక్ ప్రాంత) మాతృభాష విస్తృతపరిచే ప్రయత్నం చేస్తూ వుంది. నేర్చుకునే ప్రక్రియ బాగా నాణ్యంగా ఉండడానికి మాతృభాషలో విద్యాబోధన చాలా బలమైన శక్తి. బహుభాషా విధానానికి దన్ను కావాలన్నా ఈ శక్తి చాలా అవసరం. భాషాపరమైన, సంస్కృతిపరమైన వైవిధ్యాలను గౌరవించడానికి కూడా ఈ మాతృభాషా శక్తి చాలా అవసరం. త్వరత్వరగా పరిణామాలు జరుగుతున్న సమాజాలలో ఈ విధమైన మాతృభాషా విద్య చాలా అవసరం.

అందరికీ విద్య అనే లక్ష్యాన్ని చేరడానికి 2000 సంవత్సరం నుండి చాలా విరివిగా కృషి జరుగుతూ వుంది. ఇంకా పూర్తి కాని లక్ష్యాల దిశగా, కొత్త సవాళ్ళను ఎదుర్కొనేందుకు మనం ఇంకా విశేషంగా కృషిచేయాలి. అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం అనేది లక్ష్యసాధన దిశగా పనిచేసే మంచివేదిక. అన్నిరకాల విద్య అవసరాలకు మాతృభాష ప్రాధాన్యాన్ని గుర్తించడానికి నాణ్యమైన పద్ధతిలో నేర్చుకోవడానికి ఇప్పటిదాకా విద్య చేరని వారిని చేరడానికి మనం మాతృభాష జెండాను మోసుకొని ముందుకు పోవాలి. ప్రతి బాలిక, బాలుడు, ఆడ, మగా వారి వారి సమాజాలలో ఈ లక్ష్యాల కోసం పనిచేయడానికి వారికి అవసరమైన పరికరాలు సమకూర్చుకోవాలి. మాతృభాషలో విద్యాబోధన అన్నది ప్రాథమిక మానవహక్కు. అన్ని రకాల నిరంతర అభివృద్ధికి బలమైన శక్తి.

# ఇతర భాషల నుండి మాటల్ని తీసుకొంటే లాభమా, నష్టమా?



**2013** నవంబరు 29న చెన్నపట్నం (చెన్నై)లోని కేంబ్రిడ్జ్ ఇంగ్లీష్ లాంగ్వేజి ఎసెస్‌మెంట్ డిపార్టుమెంటులో ఒక సదస్సు జరిగింది. ఇందులో దాని ప్రధాన అధికారి మైకేల్ మిలనోవిక్ ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ఆయన అన్నమాటలివి :

“ఆంగ్లభాషలోకి ఇతరభాషల నుండి వచ్చిచేరిన మాటల వలన ఆంగ్లభాష సుసంపన్న మయింది అనడం కొంతమేరకే వాస్తవం. అవి ఆంగ్లాన్ని మరింత సంక్లిష్టంగా మార్చాయన్నది పూర్తినిజం. ఇప్పటి ఆంగ్లానికి షేక్‌స్పియర్ నాటి ఆంగ్లానికి తేడా ఉన్నమాట నిజమే అయినా ఆ మార్పు సహజంగా ఏర్పడింది. గత కొన్ని ఏళ్ళుగా ప్రపంచ నలుమూలలనుండి వచ్చి పడుతున్న ఇతర భాషాపదాలను చేర్చుకుంటూపోతున్నకొద్దీ ఆధునిక ఆంగ్లం చాలా చాలా కటువుగా మారిపోతున్నది.”

వేరే నుడుల నుండి కొత్తగా వస్తున్న వేరే మాటలను ఉన్నవి ఉన్నట్లుగా కలిపేసుకోవడం అన్నది తెలుగునుడి గొప్పదనంగా మన తెలివిపరులు (మేధావులు) మొదటినుండీ చెప్తూ ఉన్నారు. అది తప్పు అని ఇంగ్లీషు తెలివిపరులే ఇప్పుడు మొత్తుకుంటున్నారు. 'పెరనుడి మాటలను పలుకుతీరుతో సహా దిగుమతి చేసుకోవడం లేదా… ఒక పెరనుడి మాటకు మాటగా ఇంకొక పెరనుడి మాటలు వాడటం (ఇంగ్లీషుకు ముందుగా సంస్కృతాన్నో, ఉర్దూనో) నరి తీరుకాదు. ఎన్ని కొంగొత్త మాటలు వచ్చినా తన కుదుర్ల నుండి మాటలు పుట్టించి వాడుకలోకి తెచ్చుకోవడమే సరియైనతీరు.' ప్రపంచవ్యాప్తంగా తెలివిపరులు ఇదే చెప్తున్నారు. కొంగ్రొత్త ఆరయికలు (పరిశోధనలు) అదే తెలుపుతున్నాయి. తెలుగుజాతి ఈ విధంగా ముందుకు అడుగులు వేయాలి.

సంపుటి : 1 సంచిక : 1
అమ్మనుడి
మార్చి 2015

సంపాదకీయం

# రెండు తెలుగు రాష్ట్రాలూ తమ భాషావిధానాన్ని ప్రకటించాలి

ఆంధ్రప్రదేశ్ ఇప్పుడు రెండు రాష్ట్రాలైంది. ఏడాది కావస్తున్నా రెండు ప్రభుత్వాల అధినేతలూ తమ విద్యావిధానం ఏమిటో, భాషా విధానం ఏమిటో ప్రకటించలేదు. ఎన్నికల ప్రచార సమయంలోనే తెలంగాణ ముఖ్యమంత్రి కేసీఆర్ తాము అధికారంలోకి వస్తే ఒకటో తరగతి నుంచే ఇంగ్లీషు మీడియంలో చదువులు చెబుతామని అన్నారు. కానీ దాన్ని ఆధారం చేసుకొని అయినా ఇంతవరకు తమ విద్యావిధానాన్ని ఆయన ప్రభుత్వం ప్రకటించలేదు. ఇటు ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రి చంద్రబాబు కూడా ఈ అంశాన్ని దాటవేస్తున్నారే తప్ప, ఎక్కడా స్పష్టంగా తమ భాషా విధానం ఏమిటో చెప్పలేదు.

తెలుగు భాషోద్యమకారులు 2012లో ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా పెద్దఎత్తున ఉద్యమించి తెలుగుభాషా మంత్రిత్వశాఖను సాధించారన్న అంశాన్నే ఆంధ్రప్రభుత్వం మరచిపోయింది. సమైక్యరాష్ట్రంలో జీ.వో.నెం.909/31.12.2013న జారీఅయిన సంగతిని విస్మరించి తమ మొదటిబడ్జెట్‌లో గతంలో వున్న యువజనాభ్యుదయం, పర్యాటకం, సాంస్కృతిక మంత్రిత్వశాఖ పేరిటనే కేటాయింపు ప్రకటించారు. ఆ శాఖలోనుంచి సాంస్కృతిక శాఖను విడదీసి భాష, సాంస్కృతిక మంత్రిత్వశాఖగా ఏర్పాటుచేశారన్న స్పృహే వారికి లేకుండాపోయింది. విచిత్రమేమిటంటే వారి ప్రభుత్వంలో భాషాసాంస్కృతిక శాఖకు ప్రత్యేకంగా మంత్రి వున్నారు! కాని బడ్జెట్లో ఆ ప్రస్తావనే లేదు!

ఇప్పుడు రెండు రాష్ట్రాల్లోనూ భాషాసాంస్కృతిక మంత్రిత్వశాఖలున్నాయి. కాని, వారికి భాషావిధానమంటూ ఒకటి లేకపోవటం విచిత్రం. ఆ శాఖ ఏ విధానం ప్రకారం పనిచేస్తుందో అసలు ఆ శాఖ వున్నందుకు ఉపయోగం ఏమిటో అర్థంకాదు. ఈనాడు (ఫిబ్రవరి 21న) మళ్ళీ అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవాన్ని జరుపుకొంటున్నాం. యునెస్కో డైరెక్టర్ జనరల్ ఈ సందర్భంగా యిచ్చిన సందేశంలో మాతృభాషలతోనే ముందడుగు వేయాలని, గణితంతో సహా అన్ని పాఠ్యాంశాలు మాతృభాషలో నేర్పితేనే విద్యార్థులకు సరియైన జ్ఞానం అందించినట్లవుతుందని చెప్పారు. మాతృభాషలో విద్యాబోధన అన్నది ప్రాథమిక మానవహక్కు అని, అన్నిరకాల నిరంతర అభివృద్ధికి సరియైన, బలమైన శక్తి మాతృభాషేనని, యునెస్కో ప్రకటించింది. ఇలా 15 యేళ్ళుగా యునెస్కో మొత్తుకుంటూనే వుంది. మన రాష్ట్రప్రభుత్వాలు ఆర్భాటంగా ఉత్సవాలు జరిపి, వాగ్దానాలు కుమ్మరిస్తాయే తప్ప ఏదీ ఆచరణలోకి రాదు.

మన పొరుగు రాష్ట్రప్రభుత్వాలకు భాషావిధానంలో స్పష్టత వుంది. అందువల్లనే కర్నాటక, తమిళనాడువంటి రాష్ట్రాలు ప్రగతిపథంలో వున్నాయి. ఇది తెలిసి కూడా మన ప్రభుత్వాలు దారికి రాకపోవడం వారి ప్రజాస్వామ్య వ్యతిరేకధోరణికి అద్దం పడుతున్నది.

మనవి రెండూ తెలుగురాష్ట్రాలే. తొలి భాషాప్రయుక్త రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డానికి కారణం ఆంధ్ర, తెలంగాణలలో వెల్లువెత్తిన భాషాభిమానమే. తెలుగువారంతా ఒకే రాష్ట్రంలో వుండాలన్న తాపత్రయమే. ఎందరో

సంపాదక హృదయం

ఎన్నో త్యాగాలు చేసినమీదట ఆంధ్రప్రదేశ్ ఏర్పడ్డది. కానీ ఈ 60 ఏళ్ళలో మన పాలకుల స్వార్థరాజకీయాల వల్ల విభజన జరిగి ఇప్పుడు రెండు రాష్ట్రాలయ్యాయి. సమైక్య రాష్ట్రంలో భాష విషయంలో ఎంత నిర్లక్ష్యం చేశామో, ఇప్పుడు కూడా అదే వైఖరి రాజకీయనాయకుల్లో కనిపిస్తున్నది. ఈ ధోరణి కొన్నేళ్ల తర్వాత ఈ రెండు రాష్ట్రాల విచ్ఛిత్తికి కూడా దారితీస్తే ఆశ్చర్యపోనక్కరలేదు.

60 యేళ్ళ క్రితం సంయుక్త మద్రాసు రాష్ట్రం నుంచి విడిపోయి ప్రత్యేక ఆంధ్ర రాష్ట్రం ఏర్పర్చుకోవాలనే ఉద్యమం చేశారు. పైకి భాషారాష్ట్ర వాదాన్ని ముందుకు తెచ్చినా, దాని వెనుక వున్న అసలు విషయం నాటి రాజకీయనాయకుల రాజ్యకాంక్షే. అందువల్లనే ఆంధ్రరాష్ట్రం ఏర్పడగా తక్కిన మద్రాసు రాష్ట్రంలో మిగిలిపోయిన నలభైశాతం మందికి పైగా వున్న స్థానిక తెలుగువారు నష్టపోయారు. అక్కడ తమిళ రాజకీయం ఊపందుకుంది. అక్కడి తెలుగు రాజకీయనాయకులు పదవీకాంక్షతో తమిళీకరణ చెందారు. అందువల్లనే నాటికీ, నేటికీ తమిళనాట రాజకీయాల్లో ఉన్నత పదవుల్లో వున్న అధికార, ప్రతిపక్షాలవారు తమిళం మాట్లాడే తెలుగుబిడ్డలే !

ఇప్పుడు అక్కడ తెలుగు మూలాలున్న యువతలో క్రమంగా స్వభాషాభిమానం, ఆత్మాభిమానం చిగురులు తొడుగుతున్నాయి. తెలుగు అక్షరానికి దగ్గర కావాలన్న తపన పెరుగుతున్నది. ఇది రాజకీయకోణాన్ని సంతరించుకొని రానున్న పది పదిహేనేళ్ళలో కొత్త మార్పులకు దారితీయనున్నది. ఈ మా మాటలు అతిశయోక్తులుగాను, తొందరపాటుగాను పలువురు అనుకోవచ్చు గాక. కానీ ఇది వాస్తవం. అణచివేత – ముఖ్యంగా భాషా సాంస్కృతిక అణచివేత ఆత్మగౌరవాన్ని రెచ్చగొడుతుంది. ఒకప్పుడు ఆ రాష్ట్రంలో ద్రవిడోద్యమం తమిళ భాషోద్యమంగా రూపుదిద్దుకొని రాజకీయాలను శాసించింది. మరొక రూపంలో ఇవే పరిస్థితులు ఆంధ్ర, తెలంగాణల్లో ఏర్పడకుండా వుండాలంటే, సాంస్కృతికత, సామాజికత అంశాలుగా ఉద్యమాలు బలం పుంజుకోకుండా వుండాలంటే మన ప్రభుత్వాలు ప్రజలందరి శ్రేయస్సును లక్ష్యంగా పెట్టుకుని పనిచేయాలి. అందుకూ వారు మాతృభాషనే నమ్ముకోవాలి. తెలిసి తెలిసీ పరాయీకరణ చెందడానికి ఏ సమాజమూ ఒప్పుకోదు.

ప్రత్యేక తెలంగాణ ఉద్యమంలో భాషాసాంస్కృతిక వివక్ష అంశాన్ని కూడా ముఖ్యమైన అంశంగా ముందుకు తెచ్చారు. నిజానికి భాషా వివక్ష మన సమాజంలో తొలినుండీ వ్రేళ్లూనుకున్నదే. కులవ్యవస్థ, చదువులు కొన్నివర్గాలకే పరిమితం కావటం, అందరికీ సమానంగా విద్యాసాంస్కృతిక అవకాశాలు లేకపోవటం ఈ వివక్షకు దారితీసింది. మాట్లాడేభాషకు, పుస్తకాల్లో భాషకూ సంబంధం లేకుండాపోయింది. సామాన్య ప్రజల్లో వాడుకలో వున్న ఎన్నో మాటలు మన నిఘంటువుల కెక్కలేదు. అప్పుడు సంస్కృతం, ఇప్పుడు ఇంగ్లీషు తోడు లేనిదే విద్యావంతులు నాలుగు మాటలు వ్రాయలేని పరిస్థితులు నెలకొన్నాయి. ఇదంతా మన పాలకులకు సరియైన భాషావిధానం లేకపోయినందునే. శాస్త్రసాంకేతిక అంశాలతో సహా అనేక అవసరాలకు తెలుగును పనికిరానిదిగా ముద్ర వేశారు. ఇప్పుడైనా వాస్తవాన్ని గమనించి తెలుగు మూలాలపై ఆధారపడి తెలుగు నుడిని ఆధునికంగా పెంచుకోకపోతే ఇంకా మిగిలివున్న తెలుగు కూడా పరాయీకరణ చెందుతుంది. ఈ ప్రమాదం రెండు రాష్ట్రాల్లోనూ పొంచివుంది. ఇప్పటికైనా రెండు ప్రభుత్వాలూ మేల్కొనాలి. తమ సమాజాల్లో ఉన్న వైవిధ్యాన్ని కాపాడుతూనే, ప్రజల ఉమ్మడి భాషను పాలనాభాషగా, బోధనాభాషగా పెంపుచెయ్యాలి

రెండు రాష్ట్రాల్లోనూ తెలుగు ప్రాధికారసంస్థల్ని ఏర్పాటుచేసి భాషాభివృద్ధికి పరస్పరం సహకరించుకొంటూ ముందుకు సాగితేనే, రెండు తెలుగురాష్ట్రాలూ బలమైనవిగా ఎదుగుతాయి. అన్ని రంగాల్లోనూ ఇచ్చిపుచ్చుకొనే ధోరణితోనే అభివృద్ధిని సాధించగలం. ఇది భాషారంగంతోనే మొదలు కావాలి.

**21-2-2015**

**ఏ రాష్ట్రంలో ఉన్నా ఏ దేశంలో ఉన్నా తెలుగువారంతా ఒక్కటే**

ప్రభుత్వాలు-భాష

- ఆచార్య పులికొండ సుబ్బాచారి

# తెలుగు రాష్ట్రాల భాషావికాస వ్యూహాలు

చరిత్ర పొడుగూతా జరుగుతూ వస్తూ ఉండే ఘటనలు ఏవీ యాదృచ్ఛికం కావు అని ఒక చారిత్రకుడు చెప్పాడు. అంటే ఏ సంఘటనా ఏ విషయమూ దానంతట అనుకోని విధంగా జరగదు అనీ, ప్రతీ ఘటనకు దాని వెనుక జరుగుతూ వచ్చిన వరుస ఘటనలు కారణం అవుతాయని ఆ చారిత్రకుని భావన. ఇటీవలి కాలంలో తెలంగాణ ఉద్యమం, దరిమిలా రెండు రాష్ట్రాల ఏర్పాటు అనేవి కూడా అంతే. దీనికి ఒక దాని వెనుక ఒకటిగా అనేక సంవత్సరాల దశాబ్దాల కనీసం వంద సంవత్సరాల నేపథ్యం ఉంది. ప్రాంతీయ భేద భావాలు పొంగుకు రావడానికున్న కారణాలలో భాష కూడా ఒకటి. భాషాప్రయుక్త రాష్ట్రంగా తొలిసారిగా ఏర్పడిన మొదటి రాష్ట్రం మొదటి సారిగా రెండు రాష్ట్రాలైన తొలి భాషాప్రయుక్త రాష్ట్రంగా కూడా చరిత్రకి ఎక్కింది ఆంధ్రప్రదేశ్. ఈనాడు కొత్తగా ఒక మాట మాధ్యమంలో చాలా పరివ్యాప్తంగా వినియోగంలోనికి వచ్చింది. తెలుగు రాష్ట్రాలు అనే మాధ్యమ వ్యవహారం ఒక రకంగా తెలుగు వారికి ఆనందాన్ని కలిగిస్తూ ఉంది. ఇది ఇంతకు ముందు లేని భావన.





**తెలుగు భాషా వికాసం, తెలుగు సాహిత్య ప్రక్రియలకు ప్రోత్సాహం విషయంలో రెండు తెలుగు రాష్ట్రాలూ ఉమ్మడి వ్యూహాలు చేసుకోవచ్చు అవి కలిసి పనిచేయవచ్చు.**

తెలుగు వారికి రెండు రాష్ట్రాలైన నేపథ్యంలో తెలుగు భాషా వికాసానికి రెండు రాష్ట్రాలవారు ఎవరికి వారే అనే పద్ధతిలో మార్గాలు వేసుకుంటారా? ప్రణాళికలు వేసుకుంటారా? లేదా కలిసి నడుస్తారా? ఉమ్మడి ప్రణాళికలు వేసుకుంటారా? ఎలా అయితే తెలుగు భాషకు ఎక్కువ మేలు జరుగుతుంది? సాహిత్యానికి ఎక్కువ ఆదరణ కలుగుతుంది. ఈ ఆలోచనలు చర్చించుకునే సమయం, పంచుకునే సమయం ఇది. రెండు రాష్ట్రాలు విద్యార్థులకు వారివైన ఆశయాలను అమలు చేసే దిశగా పాఠ్యాంశాలలో సమూలమైన మార్పు తీసుకు వచ్చే ఆలోచనలు చేస్తున్నట్లు తెలియవస్తూ ఉంది. ఈ విషయంలో పరిశిష్ట ఆంధ్రప్రదేశ్ కన్నా తెలంగాణ రాష్ట్రం చాలా పట్టుదలతో ఉన్నట్లు ఆయా అధికారులు చేసే ప్రకటనలవల్ల తెలియవస్తూ ఉంది.

భాషా వికాసానికి ఆయా రాష్ట్రాలకు ప్రత్యేకమైన విధానం ఉండాలి. భాషాప్రయుక్త రాష్ట్రాలు ఏర్పడిన నేపథ్యంలో ప్రతి రాష్ట్రం దానికి చెందిన భాషావిధానాన్ని ఏర్పాటుచేసుకోవాలి దాన్ని అమలు చేసుకోవాలి. అంతే కాదు. ఆ భాషలోని సాహిత్యానికి సంబంధించి ఒక అకాడమీని కూడా ఏర్పాటు చేసుకోవాలి. మనకున్న రెండు తెలుగు రాష్ట్రాలకు కావలసిన భాషా విధానాన్ని గురించి ఇక్కడ చర్చించుకోవాలి. దీనికి సంబంధించి ఇప్పటిదాకా ఉన్న ఉమ్మడి రాష్ట్రం ఈ విషయంలో చేసిన శ్రమని, విధానాన్ని కూడా ఇక్కడ పరిశీలించ వలసి ఉంది.

ప్రభుత్వాలు అనుసరించ వలసిన భాషా విధానాలు ప్రధానంగా రెండు రకాలుగా చెప్పుకోవచ్చు. ఒకటి పరిపాలన భాషగా తెలుగును ఎలా వ్యాప్తం చేయాలి. రెండు విద్యాబోధనలో మాతృభాష తెలుగు ఎలా ఉండాలి. ఈ రెండూ కాక ఇతర విషయాలను కూడా తర్వాత ప్రస్తావించవచ్చు. ఉమ్మడి రాష్ట్రం ఉన్నప్పుడు తెలుగు అధికార భాషా సంఘాన్ని ఒకటి ఏర్పాటు చేశారు. ఇది తెలుగును పరిపాలన భాషగా అభివృద్ధి చేయడానికి అమలు చేయడానికి ఉద్దేశించింది. ఈ విషయంలో అనుకున్న ప్రగతిని సాధించలేదు. కనీసం 50 శాతం అయినా తెలుగు పాలనభాషగా అమలుకు నోచుకోలేదు. కాగా విద్యా బోధనలో తెలుగు వ్యాప్తికి అంటే పాఠ్యపుస్తకాల తయారీకోసం తెలుగు అకాడమీ ఏర్పాటు అయింది. ఇది చాలా కృషి చేసింది. ఇంటర్మీడియట్, డిగ్రీ, ఇంకా కొన్ని పి.జి కోర్సులకు పాఠ్యపుస్తకాలను ఇది తయారు చేసింది. దీనికృషి కొంత సంతృప్తికరంగానే ఉందని చెప్పవచ్చు. కాని తెలుగు బోధన భాషగా అమలు చేయడంలో ఉమ్మడి రాష్ట్రంలో ప్రభుత్వాలు చేయవలసిన శ్రమ చేయలేదు. అంతేకాదు తెలుగు మాధ్యమంలో చదువుకుంటే ఉద్యోగాలు రావు అని ప్రజల్లో ఉన్న భ్రమను తొలగించడానికి ప్రత్యక్షమైన చర్య తీసుకొని, ఉద్యోగార్థులు నమ్మేలా చేయడంలో, తెలుగు మాధ్యమాన్ని బోధన మాధ్యమంగా కనీసం పాఠశాల స్థాయిలోనైనా అమలు చేయడంలో ఘోరంగా విఫలం అయ్యాయి ఆ ప్రభుత్వాలు. విద్య ప్రైవేటు పరం అవుతూ ఉంటే, ఇంటర్ విద్య, పాఠశాల

విద్య కార్పొరేట్ రంగంలోనికి పోతూఉంటే, ప్రభుత్వ విధానాలు వాటికి అనుకూలంగా ఏర్పడ్డాయే తప్ప, విద్యను ప్రభుత్వ రంగమే ప్రధానంగా అమలుచేసే శక్తిగా ప్రభుత్వం అడుగులు వేయలేదు. ఈ నేపథ్యంలో తెలుగు అకాడమీ చేసిన కృషి బూడిదలో పోసిన పన్నీరు చందంగా మిగిలింది.

ఈ నేపథ్యంలో తెలుగు వికాసానికి రెండు తెలుగు రాష్ట్రాలు ఏవిధమైన వ్యూహాలు రచించుకోవలసి ఉంది అని ఇక్కడ చర్చించడం చాలా అవసరం.




పాలన భాషగా రెండు రాష్ట్రాలలో తెలుగు: పరిపాలన భాష విషయంలో పరిశిష్ట ఆంధ్రప్రదేశ్ లేదా నవ్యాంధ్రప్రదేశ్ కు ఒక సౌకర్యం ఉంది. అమలు కావలసిన భాషా స్వరూపం గురించి విధానం గురించి అప్పటిదాకా ఉమ్మడి రాష్ట్రం చేసిన విధానాలు దీనికి చాలా వరకు ఉపకరిస్తాయి. అయితే అధికార భాష అమలుకు సంబంధించి తెలుగు అధికార భాషా సంఘాన్ని అది పునరుద్ధరించుకోవలసి ఉంది. అయితే అయిదేండ్ల కొకసారి లేదా మూడేండ్లకొకసారి ఏర్పాటు చేసేది అందునా ప్రభుత్వం ప్రతిసారీ నియమించే కొత్త సభ్యుల పద్ధతి అంత ఫలవంతంగా లేదని ఇంతకుముందు చాలా సార్లు ఋజువు అయింది. సభ్యులను అధ్యక్షుడిని నియమించిన ప్రతిసారి అది రాజకీయ నియామకం అని విమర్శలు తీవ్రస్థాయిలో వచ్చాయి. సాహిత్యవేత్తలకు భాషాప్రణాళిక రచనలకు చాలా అంతరం ఉందని, సాహిత్యవేత్తలు అందరూ భాషావేత్తలు కాని, ప్రణాళికాకారులుగా కాని పనికిరారని ప్రభుత్వాలు గ్రహించలేకపోయాయి. ఈ విషయాన్ని అలా ఉంచితే. అప్పటి అధికార భాషా సంఘాలు పాలనాభాష కోసం చేసిన ప్రయత్నాలు, రూపొందించిన విధానాలు చాలా వరకు ఉపయుక్తమైన వాటిని గ్రహించవచ్చు. ఆంధ్రప్రదేశ్ ఉమ్మడి రాష్ట్రానికి అమలు చేసిన భాష ప్రమాణ భాష పేరుతో గోదావరి మాండలికాన్ని వినియోగించారు అనేది అప్పటి విమర్శ. తెలంగాణ ప్రాంతానికి ఈ భాష ఆమోదయోగ్యం కాదని తెలంగాణ మేధావులు వాదిస్తూ వచ్చారు. కాని ఈ భాష పరిశిష్ట ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి ఉపయుక్తంగానే ఉంటుంది. దీనివల్ల కొంత రాష్ట్ర ప్రభుత్వానికి పని తగ్గే వీలుంది. కాని ఈ భాషను అమలుపరచే శాశ్వత యంత్రాంగం ఒకటి ఆ రాష్ట్రానికి అవసరం ఉంది. ఇది ఇంతకు ముందున్న అధికార భాషాసంఘం లాంటిది కాక ఒక సంపూర్ణమైన కార్యాలయం శాశ్వత ప్రాతిపదికన ఉండి, అందులో విశ్వవిద్యాలయ ఆచార్యుల స్థాయితో సమంగా ఉండే భాషావేత్తల పదవులు ఉండి, వారి నియామకం పూర్తిగా విషయోపయోగ దృష్టితో జరగాలి. ఇక ఈ శాశ్వత కార్యాలయాన్ని నడపడానికి ఒక అధ్యక్ష పదవిని ఉపాధ్యక్ష పదవిని పాలక మండలిని పూర్తిగా పారదర్శకంగా విషయైక దృష్టితో ఏర్పాటు చేయాలి. అధ్యక్షుని పదవిని తెలుగు అకాడమీ అధ్యక్షుడు లాగా మూడు సంవత్సరాలకు ఒకసారి మార్చినా పూర్తిగా భాష అమలు చేయగలిగే భాషా వేత్తలతో నియమించినా, శాశ్వత ప్రాతిపదికన ఏర్పాటు చేసే వ్యవస్థ పూర్తిగా కొనసాగుతూ ఉంటుంది గనుక అధ్యక్షుడు, పాలక మండలి విధాన నిర్ణయాలు తీసుకున్నా, దాని పాలన ఒడిదుడుకులు లేకుండా నడిచే వీలుంది. అంతే కాదు అధికార భాషాసంఘాన్ని నియమించడంలో విపరీతమైన జాప్యం జరిగినా కూడా శాశ్వత ప్రాతిపదికన చేసే వ్యవస్థ వల్ల కార్యకలాపాలు కుంటుపడకుండా ఉంటాయి. నవ్యాంధ్రప్రదేశ్ ఈదిశగా ఒక శాశ్వత ప్రాదిపదికన పనిచేసే ఒక వ్యవస్థని పరిపాలనా భాష అమలుకోసం ఏర్పాటు చేసుకోవాలి. ఇలాంటి వ్యవస్థే తెలంగాణ రాష్ట్రానికి కూడా అవసరం అవుతుంది. పాలన ఎలా ఉండాలి, అమలు విధానం ఎలా ఉండాలి అనే విషయాన్ని పైన చెప్పిన వ్యవస్థ నిర్ణయిస్తుంది. అలాగే నియంత్రిస్తుంది. గ్రామ పంచాయితీ కార్యాలయం దగ్గరనుండి పైనున్న సచివాలయం దాకా అన్ని ప్రభుత్వ కార్యాలయాలు అధికార భాషని అమలు చేసే అధికారం, భాషా స్వరూపాన్ని నిర్ధారించి కార్యాలయాలకు నిర్దేశించే అధికారం పూర్తిగా ఈ సంస్థకు దఖలు పరచాలి. అమలు చేయని కార్యాలయాల పైన అధికారులపైన చర్య తీసుకునే అధికారం ఈ సంఘానికి ఇవ్వాలి. గత ప్రభుత్వాలు అధికార భాషా సంఘానికి ఈ అధికారాలను ఏ మాత్రం ఇవ్వలేదు. ఈ కారణంగానే అధికార భాషా సంఘం కాగితాలు పంపే

తపాల కార్యాలయం అయిందే తప్ప, భాష అమలు విషయంలో కార్యాలయాలను ఏ మాత్రం కట్టడి చేయలేక పోయింది. అందుకే అధికార భాషగా తెలుగు అమలు ఉమ్మడి రాష్ట్రంలో జిల్లాల వారీగా ఆయా జిల్లాలలో 12 శాతం నుండి 52 శాతానికి పరిమితం అయింది. సాక్షాత్తు మూల అధికార పీఠం అయిన సచివాలయంలో అధికార భాష అమలు 3 శాతంగా ఉండింది. ఆంగ్లమానస పుత్రులు అక్కడ అధికంగా ఉండడమే దీనికి కారణం. ఇక అమలు చేసే భాషా శైలి ఎలా ఉండాలి అనే విషయంలో నవ్య ఆంధ్రప్రదేశ్‌కు పెద్ద ఇబ్బంది ఏమీ లేదు. ఇప్పటిదాకా ప్రామాణిక భాష పేరుతో వచ్చిన గోదావరి మాండలికాన్ని ప్రమాణ భాషగా, ప్రభుత్వం అంగీకరించిన శైలిలో ఉన్న భాషా శైలిని అది కొనసాగించ వచ్చు. దాన్ని అమలు చేసే వ్యవస్థనే ఆ ప్రభుత్వం కొత్తగా ఏర్పాటు చేసుకోవలసి ఉంది.

**తెలంగాణ అధికార భాష – దాని అమలు :**

ఉమ్మడి రాష్ట్రంలో ఉన్న అధికార భాషాసంఘం రెండు రాష్ట్రాలు ఏర్పడిన నేపథ్యంలో అదృశ్యం అయింది. ఈ దృష్ట్యా తెలంగాణ ప్రభుత్వం కొత్తగా ఒక శాశ్వత వ్యవస్థని ఏర్పాటు చేసుకోవలసి ఉంది. అది పైన చెప్పిన పద్ధతిలో పూర్తిగా శాశ్వత ప్రాతిపదికన పనిచేసే వ్యవస్థ కావాలి. తెలంగాణ ప్రభుత్వం ఈ దిశగా ఏ చర్యను ఇంతవరకు చేపట్టలేదు. తెలుగును అధికార భాషగా అన్ని స్థాయిల్లో అమలు చేసే దిశగా ప్రభుత్వం ఇంత వరకు ఏ ప్రకటనా చేయలేదు. ఈ దిశగా ఇది తొలి అడుగు ఇంకా వేయవలసే ఉంది.

ఇక ఏ విధమైన భాషని తెలంగాణ రాష్ట్రంలో అధికార భాషగా అమలు చేయాలి అనే విషయంలో చాలా తకరారు ఉంది. ఇప్పటి దాకా ఉమ్మడి రాష్ట్రంలో అమలు అయిన భాషాశైలిని అంగీకరించం అని, తెలంగాణ తెలుగు వేరే అని, తెలంగాణ తెలుగు–ఆంధ్రం ఒకటి కావు అని తెలంగాణ మేధావులు మంత్రులు ఇప్పటికే వాదించి ఉన్నారు. తెలంగాణ తెలుగే అధికార తెలుగుగా అమలు జరగాలి అని వాదించారు.

ఇక తెలంగాణ తెలుగు అనే అనాలి కాని, దీన్ని తెలంగాణ మాండలికం అని అనకూడదు అని కూడా తెలంగాణ మేధావులు వాదిస్తూ వచ్చారు. మేధావుల్లో కొందరైనా తెలంగాణ అంతా ఒకటే తరహా మాండలికం ఉందని భావించారు. ఈ నేపథ్యంలో ఏది తెలంగాణ మాండలికం అనే మౌలికమైన ప్రశ్న వస్తుంది. తెలంగాణలో వేరు వేరు జిల్లాలలో వేరు వేరు మాండలికాలు శైలులు ఉన్నాయి. అయినా ఒక జిల్లాలోని యాస మరొక జిల్లాలో అర్థంకాదనే వాదనే లేదు. కానీ ఇన్ని మాండలికాలలో ఏది ప్రమాణ భాష అవుతుందంటే సమాధానం చెప్పడం అంత తేలిక కాదు. మహబూబ్ నగర్ భాష, అదిలాబాద్ యాస, ఖమ్మం జిల్లా మాండలికం అంతా ఒకేలా ఉండవు. వేటి శైలి వాటికి ఉంది. కరీంనగర్, నిజామాబాద్ జిల్లాల భాష మరొక రకంగా ఉంటుంది. ఏ యాసని అధికార భాషగా అమలు చేయాలి ఇది అంత తేలికగా నిర్ణయించే విషయం కాదు.

తెలంగాణ ఉద్యమంలో ప్రత్యేకంగా పత్రికలు పుట్టాయి. అంతే కాదు, తెలంగాణ కోసం ప్రత్యక్షంగా దృశ్యమాధ్యమాలు అంటే ప్రత్యేకంగా టి.వి ఛానళ్ళు పుట్టాయి. తెలంగాణ కోసం ప్రత్యేకంగా ఏర్పడిన ఈ పత్రికలు ఛానళ్ళు ఏ భాషని అనుసరించాయి. ఏ శైలిని పాటించాయి

**తెలుగు బోధన భాషగా అమలు చేయడంలో ఉమ్మడి రాష్ట్రంలో ప్రభుత్వాలు చేయవలసిన శ్రమ చేయలేదు. అంతేకాదు తెలుగు మాధ్యమంలో చదువుకుంటే ఉద్యోగాలు రావు అని ప్రజల్లో ఉన్న భ్రమను తొలగించడానికి ప్రత్యక్షమైన చర్యతీసుకొని ఉద్యోగార్థులు నమ్మేలా చేయడంలో, తెలుగు మాధ్యమాన్ని బోధన మాధ్యమంగా కనీసం పాఠశాల స్థాయిలోనైనా అమలు చేయడంలో ఘోరంగా విఫలం అయ్యాయి ఆ ప్రభుత్వాలు. విద్య ప్రైవేటు పరం అవుతూ ఉంటే ఇంటర్ విద్య, పాఠశాల విద్య కార్పొరేట్ రంగంలోనికి పోతూఉంటే ప్రభుత్వ విధానాలు వాటికి అనుకూలంగా ఏర్పడ్డాయే తప్ప, విద్యను ప్రభుత్వ రంగమే ప్రధానంగా అమలుచేసే శక్తిగా ప్రభుత్వం అడుగులు వేయలేదు.**

అనే అంశం ఇక్కడ మనకు ప్రధానంగా చర్చనీయాంశం. నమస్తే తెలంగాణ అనే ప్రత్యేక దినపత్రిక అవతరించింది. అలాగే 'టి' న్యూస్ అనే ప్రత్యేకమైన ఛానల్ వచ్చింది. తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత మరికొన్ని ఉమ్మడి రాష్ట్రం కాలంలో ఉన్న పత్రికలు తెలంగాణ కోసం ప్రత్యేక ఎడిషన్లను ఏర్పాటు చేసుకున్నాయి. అలాగే రేడియో స్టేషన్, టి.వి ఛానళ్ళను అధికారిక దూరదర్శన్ కూడా ప్రత్యేకంగా ఏర్పాటు చేసింది. ***ఈనాడు, ఆంధ్రజ్యోతి*** దినపత్రికలు ఆంధ్ర ఎడిషన్‌కు ఏ భాషని వాడుతున్నాయో తెలంగాణ ఎడిషన్‌కి కూడా అదేభాషని వినియోగి స్తున్నాయి. తెలంగాణ మాండలికాన్ని అంటే ఏ తెలంగాణ జిల్లా యాసని ఈ పత్రికలు వినియోగించలేదు. ఉద్యమంలో కీలక పాత్ర పోషించిన నమస్తే తెలంగాణ పత్రిక కూడా ఇదే శైలిని అంటే మిగతా ఈనాడు, ఆంధ్రజ్యోతి అనుసరించిన శైలినే అనుసరించింది. శీర్షికలలో తెలంగాణ మాండలిక ధోరణి కనిపించినా, వార్తను అందించడంలో ముప్పాతిక మువ్వీసం ఈ పత్రికలు ఉమ్మడి రాష్ట్రంలోని దిన పత్రికల శైలినే అనుసరించాయి.

ఇక టి. న్యూస్ ఛానల్ కాని, దూరదర్శన్ వారి యాదగిరి ఛానల్ కాని, ఇంతకుముందు ఉమ్మడి రాష్ట్రంలో ఛానళ్ళు ఏశైలి భాషని ఉపయోగించాయో అదే శైలిని పాటించాయి. టి న్యూస్ మాత్రం ఒక పది నిముషాల వార్తని మాత్రం అచ్చమైన తెలంగాణ భాషలో చెప్పే పద్ధతిని ప్రవేశ పెట్టింది. మిగతా రోజు కార్యక్రమం అంతా పాత ప్రమాణ భాషలోనే సాగుతుంది. దీనికి కారణాలు వెదకడం అంత కష్టమైన పనేం కాదు. తెలంగాణ ప్రాంతంలో వారి కే పత్రిక వస్తున్నా ఇందులో ఇంకా ఉమ్మడి రాష్ట్రానికి చెందిన వారు గణనీయమైన సంఖ్యలో ఉన్నారు. అంతే కాదు. ఒక్క హైదరాబాదులోనే కొన్ని లక్షలమంది ఉన్నారు. వారికి పైన చెప్పిన పత్రికల శైలి భాషే బాగా తెలుస్తుంది, నచ్చుతుంది. తెలంగాణలో ఉన్న అన్ని జిల్లా ప్రాంతాల వారికి ఈ భాషే బాగా అలవాటుగా అర్థం అవుతుంది అని ఈ పత్రికలు భావించడం వల్లనే ఈ శైలి భాషని అచ్చువేశాయి. ఇదే విషయం ఇటు ఛానళ్ళకు కూడా వర్తిస్తుంది. ఉద్యమం తీవ్ర స్థాయిలో సాగినప్పుడు సభలు సమావేశాల్లో,




పాటల్లో తెలంగాణ మాండలికం వర్ధిల్లింది. కాని అచ్చు మాధ్యమం, దృశ్య మాధ్యమం మాత్రం అందుకు భిన్నంగా అప్పటి దాకా వచ్చిన ప్రామాణిక భాషనే వినియోగించాయి.

ఇక ఇప్పుడు తెలంగాణ ప్రభుత్వం అధికార భాషగా ఏ భాషని అంటే, ఏ జిల్లా శైలిని అనుసరించాలి అని అనుకున్నప్పుడు, పైన పత్రికల విషయాన్ని తెలంగాణలో పనిచేస్తున్న ఛానళ్ళు భాష విషయంలో అనుసరించే పద్ధతి మార్గదర్శకంగా ఉంటుంది. అంతే కాదు పరిపాలన భాష స్థిరీకరణ అనేది జరగవలసిన అవసరం ఉంది. ఎందుకు అంటే ఇప్పటి దాకా జరిగిన ఆంగ్ల పాలన భాషలో ఉన్న పదసంచయాన్ని మొత్తాన్ని అనువాదం చేసుకుని పరిపాలన పదకోశాన్ని తయారు చేసుకోవాలి. భారత ప్రభుత్వానికి చెందిన కంప్యూటర్ విజ్ఞాన సృష్టి చేసే సంస్థ CDAC వారు పాలన భాషా నిఘంటువును తయారు చేశారు. కాని అది పైన చెప్పిన ఉమ్మడి రాష్ట్రంలోని ప్రామాణిక భాషనే ప్రాతిపదికగా చేసుకుని తయారు చేసిన నిఘంటువు. తెలంగాణలో అధికార భాషకోసం ఈ నిఘంటువును యధాతథంగా వాడుకోవడానికి వీలు కాదు కాబట్టి, ప్రత్యేకంగా ఒక అధికారిక పాలన భాషా నిఘంటువును తయారు చేసుకోవాలి. అందుకు ముందే అధికార భాషాశైలిని నిర్ధారించుకోవాలి. దీని కోసం తెలంగాణ ప్రభుత్వం తొలిగా విధాన నిర్ణయాన్ని తీసుకోవాలి. తెలంగాణలో ఉన్న భాషా వేత్తలతో (సాహిత్యకారులు అంటే కవులు, కథారచయితలు, నవలారచయితలు దీనికి సరికాదు) భాషా ప్రణాళిక చేసే నిపుణులతో ఒక ప్రత్యేక సంఘాన్ని నియమించుకొని తెలంగాణలో ప్రచలితంగా ఎక్కువ వ్యాప్తిలో ఉన్న ఏ శైలిని అధికార భాషకు వినియోగించుకోవాలి అనే విషయాన్ని నిర్ధారించుకోవాలి. తర్వాత పైన చెప్పిన పద్ధతిలో అధికార భాష, పాలన భాషానిఘంటువును తయారు చేసుకోవాలి. ఈ స్థాయిలోనే తెలంగాణ కోసం ప్రత్యేకంగా అధికార భాషా సంఘాన్ని నియమించుకోవలసి ఉంటుంది. పైన చెప్పిన ప్రత్యేక సంఘం అధికార భాషా వ్యవస్థ కలిసి ఈ పనిని చేయాలి.

ఇక తెలంగాణలో తెలుగు భాష అమలు గురించి ప్రకటన చేసినా, ఆలోచన చేసినా, మరుక్షణమే ఒక సమస్య ముందుకు వస్తూ ఉంది. అది మైనారిటీ సోదరుల నుండి. తెలుగును అధికారికభాషగా అమలు చేయడం ఉర్దూ ప్రగతికి అవరోధం అనే వాదనను వెంటనే రాజకీయవాదులు వాదనలోనికి తీసుకు వస్తూంటారు. ఇది చాలా సార్లు జరిగింది. కాని అన్ని ప్రభుత్వ ఉత్తర్వులు ఉర్దూలో కూడా ఉండేలా చూసి ఉర్దూ భాషీయులకు ఏవిధమైన అసౌకర్యం కలగకుండా చూడడం అంత కష్టమైన పని కాదు. కాకుంటే చిత్తశుద్ధితో ఆలోచించి ఎక్కడ ఉర్దూ భాషీయులు అధికంగా ఉంటే అక్కడ ప్రభుత్వ కార్యకలాపాలు రెండు భాషల్లో జరిగేలా చూడడం దీనికి పరిష్కారం. అసలు అధికార భాష అమలుకు సంబంధించి తెలంగాణ ప్రభుత్వం ఇంత వరకు దృష్టి సారించనే లేదు. అందుకు ఇదే సరైన సమయం.

**విద్యాబోధనలో తెలంగాణ భాషా దృష్టి :**

తెలంగాణ విద్యాబోధనలో తెలంగాణ చరిత్ర సంస్కృతి, ఆ ప్రాంతానికి చెందిన వీరులు, సాంస్కృతిక వీరులు, చరిత్ర ప్రసిద్ధులైన వ్యక్తుల చరిత్ర ఉండాలని తెలంగాణ ప్రభుత్వం చాలా ఉత్సుకతతో ఉంది. పాఠ్యపుస్తకాల రూపకల్పనకు ఒక ప్రత్యేక కమిటీని ఏర్పాటు చేయడం అది పని ప్రారంభించడం కూడా చేసింది. కాని పాఠ్యపుస్తకాలలో భాష ఎలా ఉండాలి అనే విషయంపైన ప్రభుత్వంలోని ప్రధాన బాధ్యులైన వ్యక్తులు ఎవరూ ఇంతవరకు ఒక ప్రకటన చేయలేదు. తెలంగాణ పాఠశాలల్లో తెలుగు బోధన ఏ తరగతి వరకు ఉండాలి. తెలుగు మాధ్యమ బోధన ఏ తరగతి వరకు చేస్తారు అనే విషయంపైన ఇంతవరకు ఏ విధమైన అవగాహన కాని, నిర్ణయం కాని చేయలేదు. తెలంగాణ ప్రభుత్వం కూడా ఆంగ్లమాధ్యమ పాఠశాలలవైపు మొగ్గు చూపుతున్నట్లు తెలుస్తూంది. అటు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడా ఇటీవల జరిగిన నాలుగవ ప్రపంచ తెలుగు మహాసభల్లో తీసుకున్న నిర్ణయాల పైన, వాటి అమలు పైన, ఏ విధమైన చర్యలు తీసుకునే దిశగా ఆలోచనే చేయడం లేదు. తెలుగు మాధ్యమ బోధన విషయంలో తెలంగాణ ప్రభుత్వం ఇంతవరకు తన వ్యూహాన్ని ఆలోచనను తెలుపలేదు.

ఉమ్మడి రాష్ట్రంలో దాదాపు 18 లక్షల ప్రభుత్వోద్యోగాలున్నాయి. అందులో ప్రతి సంవత్సరం కనీసం 20 శాతం మంది ఉద్యోగ విరమణ పొందినా సుమారు రెండున్నర లక్షల ఉద్యోగాలు ఖాళీ అవుతాయి.

తెలుగు రాష్ట్రాలలో, తెలుగు వారి కోసం పనిచేసే ఉద్యోగాలలో తెలుగు మాధ్యమంలో చదువుకున్న వారే అవసరం అవుతారు. కాబట్టి ఈ దిశగా ఆలోచించి తెలుగు మాధ్యమంలో డిగ్రీ కాని, పి.జి కాని చదువుకొంటే ప్రభుత్వ ఉద్యోగాలు రావు అనే భయం లేదు – అని తెలుగు రాష్ట్రాలు రెండూ యువతరానికి కచ్చితమైన సందేశాన్ని, ఒక నమ్మకాన్ని ఇవ్వగలిగితే, యువతరం తప్పకుండా తెలుగు మాధ్యమంలో చదవడానికి ఉత్సాహం చూపిస్తారు. ఇటు తెలంగాణలో, తెలుగు రాష్ట్రాలలో కాకుండా ఇతర రాష్ట్రాలకు, ఇతర దేశాలకు ఉద్యోగాలకు పోయే వారు ఎంత సంఖ్యలో ఉంటారు. అలా భావించే వారికోసం కొద్ది సంఖ్యలోని ఇంగ్లీషు మాధ్యమ విద్యాసంస్థలు చాలవా? పద్నాలుగు లక్షల మంది ఉద్యోగులు తెలుగు వారి కోసం తెలుగులో పనిచేయవలసిన అవసరం ఉన్నప్పుడు తెలుగు మాధ్యమంలో మీరు చదువుకోండి అని చెప్పడం తెలుగు రాష్ట్రాల బాధ్యత అని తప్పక చెప్పాలి. ఈ దృష్ట్యా తెలంగాణ రాష్ట్రం తన భాషా విధానాన్ని సత్వరం ప్రకటించవలసిన అవసరం ఉంది. అటు పాఠశాల విద్యను ఇటు ఉన్నత విద్యను ప్రైవేటు రంగానికి వదిలి వేయకుండా తన అధీనంలో ఉంచుకుంటే, భాషా విధానాన్ని ప్రభావ వంతంగా అమలు చేసే వీలుంటుంది.

తెలుగు అకాడమీ కూడా విడిపోయి రెండుగా మారినా తెలంగాణలో తెలుగు అకాడమీ అనేది ఒకటి ఉంటుంది. కాబట్టి ఈ సంస్థను తెలంగాణ భాష వ్యూహాలకు అనుకూలంగా పాఠ్యపుస్తకాలను పాఠశాల స్థాయినుండి. పి.జి స్థాయి వరకు తయారు చేసే మంచి సంస్థగా అభివృద్ధి చేసుకోవలసిన అవసరం ఉంది. పైన చెప్పిన పద్ధతిలో దీనికి ప్రత్యేకమైన శాశ్వతమైన వ్యవస్థను ఏర్పాటు చేయాలి.

తెలంగాణ తెలుగు పాఠ్యపుస్తకాల భాషగా అవతరించడం ఎలా? దాన్ని అన్ని తెలంగాణ జిల్లాలలో ఉన్న యాసల వారికి సమంగా బాగా అర్థం అయ్యేలా భాషాశైలి ఎంపిక ఎలా అన్నది కత్తిమీది సాము వంటిది. కొద్ది క్రియాపదాలనో కొన్ని బహువచన రూపాలనో తెలంగాణ భాషలోనికి వాడినంత మాత్రాన సరిపోదు. తెలంగాణ సాంస్కృతిక వారసత్వానికి ఈ పాఠ్య పుస్తకాల భాష ఎలా ప్రాతినిధ్యం వహిస్తుందో రూపకల్పనలోనే బోధపడవలసి ఉంది. ఇందుకు అనుభవజ్ఞులైన భాషా వేత్తలు కలిసి పనిచేయవలసి ఉంటుంది.

**రెండు తెలుగు రాష్ట్రాల ఉమ్మడి వ్యూహాలు, కార్యాచరణలు:**

రెండు తెలుగు రాష్ట్రాలలో సాహిత్య ప్రక్రియలు అన్నీ సమానంగా ఉన్నాయి. పద్యకవిత, వచన కవిత, కథ, నవల, గల్పిక, పాట, నోటి సాహిత్యం ఇలా అన్ని ప్రక్రియలు రెండు ప్రాంతాలలో ఉన్నాయి. ఈనాటి కవులు, రచయితలు రెండు ప్రాంతాలలో సాహిత్య సృజన చేస్తున్నారు. ఇప్పుడు రెండు రాష్ట్రాల వారు సాహిత్య అకాడమీలు ఏర్పాటు చేసుకోవలసిన అవసరం ఉంది. ఒక ఉదాహరణని ఇక్కడ చూద్దాం. తెలంగాణ ప్రభుత్వం ఉత్తమ నవలలను పోటీకి ఆహ్వానించింది. ఈ ప్రకటన కేవలం తెలంగాణకే పరిమితం కావడం అవసరమా? ఇదే పని అటు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేసినప్పుడు, తన పదమూడు జిల్లాలకే పరిమితమై కవులు రచయితల సృజనలను ఆహ్వానించవచ్చా? ఇలాంటి ఇతర సాహిత్య కార్యక్రమాలను ఈ రెండు తెలుగు రాష్ట్రాలు చేసినప్పుడు రెండు ప్రభుత్వాలకు ఉమ్మడి ప్రణాళికలు, వ్యూహాలు ఉంటే మంచిదా? అనే విషయాలు ఇప్పుడు చర్చనీయాంశం. ఉమ్మడి రాష్ట్రంలో సాహిత్య అకాడమీలో తెలంగాణ ప్రాంతానికి అన్యాయం జరిగిందని తెలంగాణ ప్రాంత సాహిత్యకారులకు రావలసినంత గుర్తింపు రాలేదని ఒక ఆరోపణ మేధావులనుండి ఉంది. దానికి ఎన్నో సంవత్సరాలు సారథ్యం వహించినది తెలంగాణ ప్రముఖుడు దేవులపల్లి రామానుజరావుగారు అన్న విషయం గుర్తుంచు కోవాలి. ఈ వివాదాల దృష్ట్యా తెలుగు సాహిత్య వికాస కార్యక్రమాలలో రెండు రాష్ట్రాలకు ఉమ్మడి వ్యూహాలు ఉండాలా? ఉంటే ఎలా ఉండాలి? అనే విషయాన్ని మేధావులు చర్చించాలి.

దీని తర్వాత ఉమ్మడిగా రెండు తెలుగు రాష్ట్రాలు కలిసి చేయవలసిన పనులు కొన్ని ఉన్నాయి. తెలుగుకు ప్రాచీన హోదాని కేంద్రప్రభుత్వం ప్రకటించింది. తమిళ భాషను కేంద్రం ప్రాచీన భాషగా గుర్తించిన తర్వాత, మనకీ వేడి పుట్టి, ఆదిశగా కృషిని పోరాటాన్ని సాగించాం. తెలుగు భాష ప్రాచీనతని తిరిగి బయటికి తోడి, కొత్త చరిత్రని ఆవిష్కరించుకొన్నాము. మన ఉమ్మడి పోరాటాల ఫలితంగా తెలుగుకు కేంద్రం ప్రాచీన హోదాని కల్పించింది. కాని తమిళ ప్రభుత్వం వారికి కేటాయించిన రెండు వందల కోట్ల రూపాయలను వినియోగించుకుంటూ తమిళ భాషావికాసానికి, తులనాత్మక అధ్యయనానికి సాహిత్య అభివృద్ధికి ఎంతో కృషి చేస్తూ ఉంది. Central Institute of Classic Tamil అనే సంస్థను వారు ఏర్పాటు చేసుకున్నారు. ఇది చాలా ప్రభావవంతంగా పనిచేస్తూ ఉంది. మనం పోరాడి తెచ్చుకున్న తెలుగు ప్రాచీన భాషా హోదాకి వచ్చే ఫలాలను పొందడానికి కావలసిన ఏ కృషిని గట్టిగా ఇంతవరకు చేయలేదు. కనీసం సంస్థకు అవసరమైన స్థలాన్ని కూడా చూపలేని స్థితిలో ఆ సంస్థని మైసూరులో ఉన్న భారతీయ భాషల సంస్థ (CIIL) కు అప్పగించారు. ప్రాచీన తెలుగు కోసం ఏర్పడిన సంస్థ కర్ణాటక రాష్ట్రంలో ఉండి పనిచేయడం ఎంత హాస్యాస్పదమో ఆలోచించాలి. ఉమ్మడి రాష్ట్రంలో దీనికి సంబంధించిన ప్రగతి జరగలేదు. ఇక రాష్ట్ర విభజన ఉద్యమం దానిపైని ధ్యాసలో ఉమ్మడి రాష్ట్రం తెలుగు ప్రాచీన భాషా కార్యకలాపాలపైన దృష్టి పెట్టలేకపోయింది. దీనికి కేటాయించే రెండు వందల కోట్ల రూపాయిలు రెండు రాష్ట్రాలకు చెందుతాయి. ప్రాచీన సాహిత్యం విషయానికి వస్తే తెలంగాణ ఆంధ్రప్రదేశ్‌లలో ఉన్న ప్రాచీన సాహిత్యం అంతా తుల్యమైనదిగా చెప్పవచ్చు. తత్సమ బహుళ కావ్యాలు తీసుకున్నా, ద్విపద కావ్యాలు గ్రహించినా, అచ్చ తెలుగు కావ్యాలు పరిశీలించినా రెండు ప్రాంతాలలోని కవులు సమంగా కృషిచేశారు. నన్నయ తత్సమ బహుళ భాష పోతన భాష భిన్నమైనవి కావు. కాబట్టి ప్రాచీన భాషాసాహిత్యాల అధ్యయనంలో రెండు తెలుగు రాష్ట్రాలకు ఉమ్మడి వ్యూహం అవసరం. ప్రాచీన తెలుగు సంస్థ ఏర్పాటు విషయంలో రెండు ప్రభుత్వాలు కలిసి పనిచేయవలసిన అవసరం కూడా ఉంది. రెండు చోట్ల రెండు సంస్థలను ఏర్పాటు చేసుకున్నా, కార్యక్రమాల రూపకల్పనలో, ఆచరణలో ఇద్దరికీ ఉమ్మడి వ్యూహాలు ఉండడం రెండు రాష్ట్రాలకు ప్రాచీన తెలుగు సాహిత్య పరిశోధనలకు లాభిస్తుంది.

కొన్ని ఇతర భాషల ఉదాహరణలను ఇక్కడ చూడవచ్చు. కేంద్ర సాహిత్య అకాడమీ కార్యకలాపాలను పరిశీలిస్తే. హిందీ సాహిత్యానికి సంబంధించిన కార్యక్రమాలను చేసినప్పుడు హిందీ భాషా ప్రాంతాలను అన్నింటిని ఇది పరిశీలనకు తీసుకుంటుంది. హిందీ నవల అంటే అన్ని హిందీ రాష్ట్రాలలో ఉన్న హిందీ నవలలను, హిందీ కవిత అంటే అన్ని రాష్ట్రాలలో ఉన్న హిందీ కవితలను అది గ్రహిస్తుంది. తెలుగు రాష్ట్రాలకు ఇలాంటి పని ఆచరణ సాధ్యం కాదా? రెండు రాష్ట్రాలు తిరిగి ఆలోచించాలి. పాత పరిస్థితే పునరావృతం అవుతుందనే అనుమానాలకు తావు లేకుండా, అకాడమీ రూపకల్పన సాధ్యం కాదా, ఆలోచించాలి.

బెంగాలీ భాషకు రెండు రాష్ట్రాలు మాత్రమే కాదు ఆ భాష రెండు భిన్న దేశాలలో ఉంది. తూర్పు పాకిస్తాన్ దరిమిలా బంగ్లాదేశ్‌గా అవతరించింది. ఇప్పటికీ బెంగాలీ వారిని ఎవరినైనా మన దేశంలో ఇప్పుడు తూర్పు బెంగాల్ అనేది లేదు కదా ఇక మన బెంగాల్‌ను పశ్చిమ బెంగాల్ అని ఎందుకు అనాలి. బెంగాల్ అని అంటే సరిపోతుంది కదా అని నేను ఒక బెంగాలీ మిత్రుడిని అడిగితే. దానికి అతను అంగీకరించలేదు. బాంగ్లాదేశ్ ప్రత్యేకమైన దేశమే. కాని అక్కడున్నదీ మా బెంగాలీ భాషే. మా దృష్టిలో అది ఇప్పటికీ తూర్పు ప్రాంత బెంగాలీ భాషే. మాది పశ్చిమ బెంగాలీయే కాబట్టి ఆపేరు అలాగే ఉండాలి. అంటే తూర్పు పశ్చిమం వేరుగా ఉన్నా, మా భాష ఒక్కటే అనే బలమైన భావాన్ని వారు ఇంకా గట్టిగా కలిగి ఉన్నారు. అంతే కాదు బాంగ్లా దేశ్ ప్రభుత్వం కూడా మన పశ్చిమ బెంగాల్‌లో జరిగే భాషా విషయం సాహిత్య విషయాల పైన చాలా మక్కువ చూపుతుంది. ఆ దేశంలోని భాషా విషయాల అమలులో పశ్చిమ బెంగాల్ నిర్ణయాలను కూడా ఆచరణలోనికి గ్రహిస్తూ ఉంది. 1960 దశకంలో పశ్చిమ బెంగాల్ చేసిన భాషా సంస్కరణలను, విధానాలను బాంగ్లాదేశ్ కూడా పరిశీలించింది. అమలులోనికి గ్రహించింది. రవీంద్రనాథ్ ఠాగూర్ ఇప్పటికి కూడా వారికి అత్యంత గౌరవనీయుడైన కవే. ఆయన రచించిన సోనార్ బాంగ్లా అనే పాటనే బాంగ్లాదేశ్ తన జాతీయ గీతంగా గ్రహించింది అంటే, భాష సాహిత్యం విషయంలో రెండు ప్రాంతాలకు మధ్య ఉన్న సయోధ్య ఏ విధమైనదో మనం తెలుసుకోవచ్చు. ఇతర సాహిత్యసంస్థలు కూడా సాహిత్య ప్రక్రియలను గ్రహించినప్పుడు రెండు ప్రాంతాలలోని వాటిని గ్రహిస్తున్నాయి. సదస్సులు గోష్ఠులలో కూడా రెండు ప్రాంతాల సాహిత్యం భూమిక అవుతూ ఉంది. తెలుగు భాష, తెలుగు సాహిత్యం విషయంలో బెంగాలీ భాషకున్న ఈ రకమైన ఆరోగ్యకరమైన ధోరణులు రెండు తెలుగు రాష్ట్రాల మధ్య చాలా అవసరం.

తెలుగు భాషా వికాసం, తెలుగు సాహిత్య ప్రక్రియలకు ప్రోత్సాహం విషయంలో రెండు తెలుగు రాష్ట్రాలూ ఉమ్మడి వ్యూహాలు చేసుకోవచ్చు, అవి కలిసి పనిచేయవచ్చు అని చెప్పడానికి బెంగాలీ భాషకు సంబంధించి పైన చెప్పిన విషయం ప్రోత్సాహకారి అవుతుంది.

రచయిత ద్రావిడ విశ్వవిద్యాలయం (కుప్పం) లో ఆచార్యులు
ఫోన్ : **9440493604** E-mail : psubbachary@gmail.com

పొత్తాల విడుదల

## కతలగంప



2014 నవంబరు 9న బోధన్‌లో స.వెం.రమేశ్ రచించిన కథల సంపుటి 'కతలగంప' పుస్తకాన్ని విడుదల చేసినప్పటి చిత్రం. (ఎడమ నుండి కుడికి) స.వెం.రమేశ్, శిరంసెట్టి కాంతారావు, ఫాదర్ కెనడి, మధురాంతకం నరేంద్ర, పూదోట శౌరీలు, గాలి ఉదయమేరి, ఆర్.ఎం. ఉమామహేశ్వరరావు, ఆవిష్కరించిన సామల రమేష్‌బాబు

## శిలువగుడి కతలు



2014 నవంబరు 9న బోధన్‌లో పూదోట శౌరీలు రచించిన 'శిలువగుడి కతలు' పుస్తకాన్ని విడుదల చేసినప్పటి చిత్రం. (ఎడమ నుండి కుడికి) శిరంసెట్టి కాంతారావు, ఫాదర్ కెనడి, మధురాంతకం నరేంద్ర, ఎం.వి.ఎం.దాసు, ఆవిష్కరించిన గాలి ఉదయమేరి, పూదోట శౌరీలు, సామల రమేష్‌బాబు, ఆర్.ఎం. ఉమామహేశ్వరరావు,

## వేమన వాక్కులు





2015 జనవరి 10 న విజయవాడ పుస్తకమహోత్సవ వేదికపై అంగత వరప్రసాదరావు రచన 'వేమన వాక్కులు' పుస్తకాన్ని విడుదల చేసినప్పటి చిత్రం.(ఎడమ నుండి కుడికి) సామల రమేష్‌బాబు, గుమ్మా సాంబశివరావు, నాగార్జున విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు కోదాటి వియ్యన్నరావు, రచయిత అంగత వరప్రసాదరావు, జి.వి.పూర్ణచంద్, మొవ్వా శ్రీనివాసరెడ్డి

– స.వెం.రమేశ్

# తెలుగు కనబడదు – తెలుగు తప్ప వినబడదు

**ను**డులపేరుతో నాడుల ఏర్పాటు వలన తెన్నాట బాగా చితికిపోయింది తెలుగునేల కాగా, ఎక్కువ మేలు పొందింది కర్నాటక. అవును, తమిళుల కంటే కూడా పెద్ద తావును కన్నడిగిలు చేజిక్కించుకొన్నారు. తెక్కాణాన అంటే వింధ్యమలలకు కింద ఉండే తెలంగాణ, ఆంధ్ర, కేరళ నాడులలో నూటికి ఎనభైమంది ఒకేనుడిని మాటలాడేవాళ్లూ, మిగిలిన ఇరవైమంది, పలునుడులను నుడివేవారూ ఉన్నారు. అంటే అవి ఒక్కనుడి నాడులు. తమిళనాడు, కర్నాటకలు మట్టుకు అట్లకాదు, అవి పెక్కునుడినాడులు. అందుకే ఆ నాడులలోని తమిళులకూ కన్నడిగులకూ నుడి తగులం తీంద్రించుకొని ఉంటుంది. కన్నడనేలగా పేరుపడిన ఇప్పటి కర్నాటకను కొంచెం లోతులకు పోయి తరచి చూస్తే ఈ నిక్కం తేటతెల్లమవుతుంది.

వేరే నుడుల మందిని అంతా కన్నడిగులుగానే లెక్కవేస్తూ కన్నడగుంపును పెంచుకొంటూ వస్తుంటే కూడా, 2001 నాటికి ఇప్పటి కర్నాటకలోని కన్నడిగుల లెక్క 65 నూర్పాలును దాటలేదు. పడమటి కడలిదరి అంతా తుళు, కొంకణి నుడులవారి తావు. తూరుపునేల అంతా తెలుగుమయం. అయినా ఇప్పటి కర్నాటకలో తుళు, కొంకణి, కొడవ, ఉర్దూ, మరాటి నుడులకు దక్కిన మేవడిలో ఒకవంతు కూడా తెలుగుకు దక్కలేదు. ఇందుకు పలు కారణాలు ఉన్నా పెద్దది మటుకు ఆంధ్రప్రదేశం ఏర్పాటే. మచ్చుకు కోలారు పెవ్వంటెంను గురించి ఈ నాలుగు మాటలనూ వినండి.

పాత కోలారు ఇప్పుడు, కోలారు, చిక్కబళ్లాపుర అనే రెండు పెవ్వంటెములు అయింది. ఈ రెండింటినీ కలిపే ఇక్కడ చెబుతున్నాను. కర్నాటక పటంలో చూడండి, చిత్తూరు పెవ్వంటెంకు ఆనుకొని ఆంధ్ర కడుపులోకి చొచ్చుకొని వచ్చుంటుంది కోలారు. గౌరీ బిదనూరు, గుడిబండ, బాగేపల్లి, చిన్నబళ్లాపురం, సిడ్లగట్ట, చింతామణి, శ్రీనివాసపురం, కోలారు, ముళబాగలు, బంగారుపేట, మాలూరు అనే 11 వంటెములు ఉన్నాయి ఇందులో.

నుడినాడులు ఏర్పడేటప్పుడు అంటే 1956 తరిలో కోలారు పెవ్వంటెంలో, తెలుగు 54 నూర్పాలు, కన్నడం 21 నూర్పాలు, తమిళం 12 నూర్పాలు, ఉర్దూ 8 నూర్పాలు, మిగిలినవి 5 నూర్పాలు. మొన్నమొన్నటి వరకూ కన్నడం ఇంటినుడిగా మట్టుకే ఉండేది. ఇల్లు దాటినాక కన్నడిగులు కూడా తెలుగునే నుడువుతుండేవాళ్లు. కోలారులో – తెలుగు కనబడదు, తెలుగు తప్ప వినబడదు – అని పెద్దలమాట. ఇప్పుడిప్పుడు అది తిరగబడుతూ ఉంది. తెలుగు మెల్లగా ఇంటినుండి మట్టుకే అయిపోతున్నది.




కోలారు జిల్లా

కోలారు పెవ్వంటెపు నానుడి మెలనను చూస్తే వెప్పర కలుగుతుంది. తెలుగువాడి పట్టనితనానికి సిగ్గేస్తుంది. ఇప్పటివరకూ దొరికిన ఆనులను పట్టి చూస్తే కోలారు పెవ్వంటెపు తొలి కవి నంది తిమ్మన. రాయలవారి పేరోలగంలోని కవి ఈయన. తిమ్మన గురించి ఆంధ్రులకు చెప్పవలసిన పనిలేదు. పారిజాతాపహరణం అనే కావ్యాన్ని రాసినవాడు కదా. తిమ్మన కోలారు జిల్లాలోని 'నంది' అనే ఊర్లో పుట్టినవాడని కారుపల్లి కోదండ రామయ్య గారు ఆరసి చెప్పినారు. ఇక అక్కడి నుంచి మొదలుపెడితే కోలారు పెవ్వంటెంపు కవుల వరస ఇదీ....

1. ఆనందకవి, చిన్నబళ్లాపురం : వేదాంతసారము
2. ముమ్మడి తిమ్మబూపాల (1614–1680), సుగుటూరు : కుమారార్జునీయం, సౌందరేశ చరితం, రాజేంద్రచోళ చరితం
3. పాలవేకరి కదిరీపతి (1600), తాడిగోళ్లు : శుకసప్తతి
4. కోడూరు వెంకటాచలకవి (17 నూరేడు), కోడూరు : శివరహస్యం
5. బద్దెవీటి రత్తయ్య (17నూ), సుగుటూరు : గణితదీపిక
6. యశస్వి జోగారావు (1667–1770) సుగుటూరు : యక్షగాన చరిత్ర
7. మల్లకవి, (1975) హోసూరు : శ్రీశైల పండితారాధ్య చరితము
8. పిన్నబయలాచార్య (19నూ), సుగుటూరు : గోగూచి చరిత్ర
9. కొమర్ల రామచంద్రయ్య (19–20నూ), చింతామణి : సుకర్మనీతి చింతామణి
10. తోర్లబయ్యారెడ్డి (19–20నూ), తోర్లవారిపల్లి : పద్మావతీ శ్రీనివాసం
11. గుమ్మరాజకవి (19–20నూ), చౌడేశ్వరి మహాత్మ్యం, అశ్వదార, సంగ్రహ రామాయణము, ఆపద్బాందవ శతకం
12. హొసహుడ్యం వెంకటరెడ్డి (1901–1954), హొసహుడ్యం : వివేక రత్నమాల, వేదాంత ప్రశ్నరత్నావళి, వేణుగోపాల శతకము

# కోలారుమండలము తెలుఁగుసీమ

అన్ని విధముల కచ్చితమైన తెలుగుప్రాంతమగు కోలారు మండలములో విజయనగర చక్రవర్తుల పరిపాలనా కాలమందు, సంస్కృతాంధ్ర భాషలలో కవిత్వము చెప్పగలిగిన వారు పెక్కుమంది యుండిరనుటలో నెట్టి యాశ్చర్యమును లేదు. ఈ మండలము, నేడే కాదు, విజయనగర సామ్రాజ్యము వెలసియుండిన కాలమందే కాదు, మౌర్య, శాతవాహన చక్రవర్తులకాలమందు సయితము తెలుగు ప్రాంతముగా నుండెనని, మైసూరు దేశ చరిత్రలు, మరియు మైసూరు జనాభా నివేదికలు మొదలగువానినుండి తెలియుచున్నది. విజయ నగర సామ్రాజ్య కాలమున, కోలారు మండల ప్రాంతమునకును, దాని పరిసర ప్రదేశములకును, 'ములువాయి' రాజ్యము అనిపేరు. ఇచ్చట నొక రాజ ప్రతినిధి నివాసము చేయుచుండెను. 'ములువాయి' అను నగరమును బట్టియే ఆ రాజ్యమునకు 'ములువాయి రాజ్యము' అను పేరు వచ్చినది. ఈ ములువాయి పురమును కన్నడిగులు 'ముళుబాగిలు' అని పిలుతురు. ఈ పురమునకు 'శతకవాటపురము' అని పేరుండి నటులగూడ తెలియుచున్నది. ఈ శతకవాటపురము లోని, దేవుళ్ళమీద తెలుగుభాషలో వ్రాసిన పాటలు, పద్యములు నేడు కొన్ని లభించియున్నవి.

సాళువ నరసింహరాయలు, ఆ ముళువాయి రాజ్యములో నుండు, 'టేకల్లు' అనుప్రాంతమునకు, కొంతకాలము పాలకుడుగా నుండెను. సుగుటూరు రాజులు, పాలవేకరి వంశపురాజులు మొదలగు వారు కోలారుమండలములోని, వేర్వేరు భాగములను, 14,15 మరియు 16వ శతాబ్దములలో పాలించుచుండిరి. ఆ రాజులు విద్యాభిమానులు, కవి పండిత పోషకులు; వారిలో కొందరు కవులుగాను, పండితులుగాను నుండిరి. పాలవేకరి కదిరీపతి 'శుకసప్తతి' యనునొక జీవకళగల కావ్యమును వ్రాసెను, కొఱవి గోపరాజు, ఈమండల మందలి 'వేముగల్లు' అను పట్టణమునకు రాజై యుండిన రాణా వంశమువాడైన మల్లరాజు ఆస్థానకవిగా నుండెను. ఈతడు 'సింహాసన ద్వాత్రింశిక' యను తేనెలు గురియునట్టి, యొక చక్కని కావ్యమును వ్రాసెను. ఈతని కవిత్వము, ఇట్టి కావ్యము లాంధ్రమున నరుదనియు, పండితులు, విమర్శకులు, ఏకగ్రీవముగా పొగడి యున్నారు. ఈ మండలములోని, 'కెందట్టి'యను పురమున పెక్కు మంది సంస్కృతాంధ్రపండితులు, కవులు ఉండిరనియు, వారు పెక్కు గ్రంథములు వ్రాసిరనియు తెలియుచున్నది. ఇటులే కోలారు మండలమున ఎందరో కవులుండిరనియు, వారు తెలుగు భాషలో పెక్కు గ్రంథములు వ్రాసిరనియు తెలియుచున్నది.

ఇది, ఆనాటి పరిస్థితి. కాని ఈ మండలము, నేడు తెలుగు సీమలో లేక కన్నడదేశమందున్నది. ఇచ్చట తెలుగు భాషకు ఆదరము కాని, ప్రోత్సాహము కాని లేదు. ఇట్టి, అననుకూల పరిస్థితులలో గూడ తెలుగులో చక్కగను, ధారాళముగను కవిత్వము చెప్పగల, మరియు గ్రంథ రచన చేయగలవారు, నేడు సయితమచ్చట ఉన్నా రనుట ప్రశంసనీయమగు విషయము. కొన్ని సంవత్సరములకు ముందు కోలారు జిల్లాలోని గవనిపల్లి వాస్తవ్యులయిన, శ్రీ గుమ్మరాజు రామకవిగారు, శ్రీ చౌడేశ్వరీ మహాత్మ్యము అనునొక పద్య కావ్యమును వ్రాసినారు. ఆ గ్రంథము పెక్కుమంది పండితులచే ప్రశంసింపబడినది. దానికి పీఠికవ్రాసిన, సుప్రసిద్ధాంధ్ర పండితులు, కవులు, మరియు విమర్శకులునయిన, శ్రీరాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మగారిట్లు వ్రాసియున్నారు. "ఈ మృదు మధుర కావ్యమును కవిగారు వ్రాతలో నున్నపుడే నాకై వెదకుకొనివచ్చి, వినిపించి నన్ను నిర్హేతుక ప్రణయ గౌరవములందు ముంచియుండిరి. ... వీరి గవనిపల్లి కోలారు జిల్లాలోనున్నది. కాని, కృష్ణా, గోదావరి జిల్లాలలోలేదు సరిగదా, రాయలసీమలోనైన తలదూర్చుకొను భాగ్యము దానికి లేదు.... పూర్వాంధ్రులకు గాని, పశ్చిమాంధ్రులకు గాని, ఈ ప్రక్క దృష్టి యింకను పాతినట్లులేదు. మైసూరురాజ్యము పూర్తిగా కన్నడసీమ యను భ్రాంతి బైటివారికున్నది. లోపల వారికి కన్నడసీమ కావలయునను, పేరాసయున్నది. వారి యుదాసీనము, వీరి పట్టుదల రెండును జేరి, ఈ మండల మందలి యించుమించు పదునొకండు లక్షల తెలుగువారి, తెలుగుతనము నానాటికి రూపుమాయుచున్నది. ఇట్లుండగా అక్కడి కవులు, కావ్యములు వెలికి వచ్చుట యెట్లు? ఇట్టియిరుకులో గూడ మా మిత్రులు ఇంతటి సరస ప్రబంధము రచించి ప్రకటించు నుత్సాహమునకు గారణము నాటినుండి నేటివరకు నంధవరీక నియోగుల నాడులలో వ్యాపించి నాటుకొన్న కవితాశక్తియే కానీ, ఆంధ్రులు కల్పించి యిచ్చిన యవకాశములును, అనుకూలములును గావు.... చక్కని ధారాళశైలిలో, అచ్చమగు తెలుగు పోకడలతో, ఇంతగొప్ప కావ్యమును రచించు నేర్పును, ఓర్పును, ఈకాల మందేర్పడి యుండుట మైసూరు రాజ్యమందలి ఆంధ్రభాగ మందు ఆంధ్ర సాహిత్య మెంత సార్వజనీనముగా నుండెనో, ఎట్టి పరాయణము గలదిగా నుండెనో స్పష్టముగా చాటుచున్నది...." (చూ.చౌడేశ్వరీ మహాత్మ్యము. పీఠిక పుటలు. 1,2)

తరతరాలనుండి కోలారు మండలములో, తెలుగు భాష సర్వజనీనముగా వ్యాపించియున్నదను పరమ సత్యమును శ్రీశర్మగారి పై వాక్యములు చక్కగా విశద మొనర్చుచున్నవి. ఇక, ఈ విషయమును గురించి యెవ్వరికిని యేలాటి సంశయ ముండనవసరము లేదని నా మనవి. ఈ సుపరిస్థితినిబట్టి చూచిన, తెలుగు భాష, మూడు పూవు లారుకాయలుగా వర్ధిల్లుచుండిన, రాయల పరిపాలనా కాలములో, కోలారు మండలమందు పెక్కుమంది తెలుగు కవులుండిరనియు, వారా భాషలో సుద్గ్రంథముల వ్రాసిరనియు నిస్సందేహముగా జెప్పవచ్చును. మృదు మధురముగా కవిత లల్లగల నైపుణ్యము కోలారు మండల కవులకు తరతరాలుగ లభ్యమైన, దైవదత్తమైన శక్తియనియు, మరియు నీమండలము ప్రాచీన కాలమునుండియు, ఆంధ్ర కవిశేఖరులకు కాణాచిగా నుండెననియు జెప్పవచ్చును. ఇట్లు తెలుగుభాష, తెలుగు కవిత సర్వత్ర వ్యాపించియుండిన కోలారు మండలము, ముక్కు తిమ్మన కవికిని, ఆతని పూర్వీకులకును, జన్మభూమిగా నుండెనని తలంచుటలో, మరియు విశ్వసించుటలో తప్పేమియు లేదు అది యొప్పే యని గట్టిగా జెప్పవచ్చును.

(అష్టదిగ్గజ కవి సమాజములో రాయల నాశ్రయించిన తొలికవి ఎవరు? గ్రంథంనుండి, రచయిత : కీ.శే. కె.ఎస్. కోదండరామయ్య, ఎం.ఎ.బి.ఓ. ఎల్.బి.టి., మాజీ శాసనసభ్యులు, హోసూరు)

13. రాజయోగి వసంతయ్య (20నూరేడు), చిలకలనేర్పు : సుజన మనోరంజని

14. చంద్రశేకరశాస్త్రి (1890..) బైరగానిపల్లి : శృంగార స్తోత్రమనే అమరుకాన్ని తెలుగులోకి, మనుచరిత్రను కన్నడంలోకి

15. అప్పాశాస్త్రి (20నూ), బైరగానపల్లి : శంకరాచార్యుల ఆనందలహరిని తెలుగులోకి

16 దేవరకొండ శామబట్టు (18నూ), కోటగల్లు : రాగవేశ్వర స్తోత్రము, మైరావణ, నళ చరిత్ర హరికతలు, నృకేసరి శతకము

17. యోగి నారాయణ తాతగారు (1726-1836), కైవారం : 160పైగా తత్త్వ సంకీర్తనలు, తారకబ్రహ్మానంద ద్వయకంద శతకము, విమలాత్మ నారేయణకవి కంద శతకము, బ్రహ్మాండపురి శతకము, అమరనారేయణ శతకము, నాదబ్రహ్మానంద నారేయణ శతకము, శ్రీకృష్ణ చరిత తత్త్వామృత యోగసారము, కాలజ్ఞానము

పై వరుసలోని చాలామంది గురించి ఆరుద్రగారు 'సమగ్రాంధ్ర సాహిత్యం'లో చెప్పున్నారు. ఒకరిద్దరు తప్ప మిగిలినవారు అందరూ తెలుగులో రాసినవారే. ఆ ఒకరిద్దరు కూడా తెలుగుతోపాటు కన్నడంలో రాసినవారు తప్ప, అచ్చంగా కన్నడంలోనే కవిత చెప్పలేదు. అయితే అందరు రాసిందీ పద్యకవిత్వమే. 1940 నాటికి ఈ పద్యకవిత్వం ఆగిపోయింది. 19 వ నూరేడు చివరినుంచీ తెలుగు కన్నడ తమిళనుడులలో ఇంగ్లీసు చదువుల వలన కొంగొత్త నానుడి మొదలయింది. నవల, కత అనే కొత్తతీరులో రాత మొదలయింది. ఈ కొత్త నానుడి కోలారు పెవ్వంటెంలో 1940 నుంచీ కనబడుతున్నది. అప్పటివరకూ మొత్తం తెలుగులోనే వచ్చిన పద్యకవిత్వం ఆగిపోయి, వచనం మొదలయింది. ఆ వచనం కన్నడంలో మొదలయింది.

మొదలుపెట్టినవారు ఇద్దరు, 1. కె.వి.అయ్యర్ 2. మాస్తి వెంకటేశ అయ్యంగార్. ఈ ఇద్దరూ తమిళులే. ఇద్దరూ కతలను రాసినవారు. అయ్యరు పదికిలోపే రాయగా, అయ్యంగారు కొత్త కన్నడ నానుడికి పెద్ద దోవను ఏర్పరచినారు. 'మాస్తి, కన్నడపు ఆస్తి' అని పేరు గడించినారు. వీరద్దరినీ పక్కన పెడితే, 1975కు వెనకనే కన్నడ కతా నవలా కోలారు సీమలో వెలువడినాయి. 1940 కు వెనుక మొదలయిన కొంగొత్త నానుడిలో ఒక్క నూర్పాలు కూడా తెలుగులో రాలేదు. అంతా కన్నడమే. అడపాదడపా అక్కడా ఇక్కడా తమిళకతలూ కవితలూ కూడా వచ్చినాయి వస్తున్నాయి కానీ తెలుగు ఊసేలేదు. ఉన్నట్లుండి తెలుగు ఎందుకు బిలుకుమారిపోయింది? ఇప్పటికీ పదుల వందల పల్లెల్లో కేళికలూ, యక్షగానాలూ, కోలాటలూ, పండిరిబజనలూ అన్నీ తెలుగులోనే నడుస్తున్నాయి. పల్లె నోళ్లల్లో తెలుగు నిలిచే ఉంది. కానీ రాతలో తెలుగు లేనేలేదు. పాతకోలారు పెవ్వంటెం మొత్తంమీద నాలుగయిదు తెలుగుబడులు కూడా లేవు. ఇళ్ల అరుగులమీద అయ్యవార్ల దగ్గర చదువునేర్చుకున్న తరి వరకూ తెలుగు రాత ఉండి, సర్కారుబడుల రాకతో కనుమరుగు అయిపోయింది.

కవిత

# మొగలిపూవంటి... తెలుగు

మొగలి పువ్వంటి ఘుమఘుమల తెలుగు
మమతానుబంధాల వెల్లువల తెలుగు

ఏనాటి ఈ మాట ఏనాటిపాట
ఎల్లలెరుగని భాష ఉల్లమెరిగిన భాష
పైరుపచ్చని భాష పరిమళించే భాష
పలుకులో తేనియల్ చిలికేటి భాష ॥మొ॥

గోదారి నదులలో కావ్యమై తెలుగు
కృష్ణమ్మ ఝరులతో నాట్యమై తెలుగు
పెన్న గలగలలలో వయ్యారి తెలుగు
తుంగా తరంగాల తడిసి మురిసింది ॥మొ॥

సంగీత సాహిత్య సర్వాంధ్ర కళలలో
కావేరి తీరాన కాంభోజి తెలుగు
కర్పూర గంధాలు కోమలీ లాస్యాలు
కన్నెవలపులతోట వన్నెచిన్నెల పేటి ॥మొ॥

మంచిముత్యపు వాన మించు వెన్నెల వాన
కులుకు పలు యాసలతొ కలికి మన తెలుగు
అజంత రవరవల అందగించెడి తెలుగు
మలుపు మలుపున మింటి కెగసేటి తెలుగు ॥మొ॥

*- డాక్టర్ తుర్లపాటి రాజేశ్వరి*

బరంపురం, ఫోన్: 08093520819

1953లో ఆంధ్రనాడు ఏర్పడి, 1956 లో కర్నాటక ఏర్పాటయినాక తెలుగురాతకు ఇక్కడ దిక్కులేకుండాపోయింది. ఏదో బావుకోవాలని చీల్చుకొని పోయిన ఆంధ్రులు ఇంట్లో తెలుగునే పట్టించుకోలేదు, ఇంక బయట తెలుగును పట్టించుకొంటారా?

కోలారు సీమ నుంచి వస్తున్న కొంగొత్త కన్నడ నానుడిలో ఎక్కవపాలు తెలుగువాళ్లు రాస్తున్నదే. తెలుగుబడులు ఉండుండి, తెలుగును చదువుకొని ఉంటే తెలుగులోనే రాసుండగలిగేవారు. వారిలో ఆ సొరణను తట్టిలేపే తలవర ఒక్కడైనా పుట్టలేదు ఆంధ్రనాడులో, చివరకు చిత్తూరు, అనంతపురం వాళ్లు కూడా 'కోలారులో తెలుగువాళ్ళ ఉండారా' అనేంత గొప్ప నిలవరానికి వచ్చింది తెలుగుజాతి.

తమిళనాడులో 'తెలుగువాణి' చేస్తున్నట్లుగా కర్నాటకలో కూడా పెద్ద ఎత్తున తెలుగునేర్పించే పని మొదలయితే తప్ప, తెలుగు ఇక్కడ ఇంక ఎంతోకాలం మనలేదు.

*(ఈ కవుల సమాచారం ఇచ్చిన స.రఘునాథ్ గారికి మప్పిదాలతో...)*

# మూలాలు మరచిపోతే...



మరుపు ఒక గతం కావచ్చు
మరుపు ఒక వర్తమానశకలం కావచ్చు
ఏదైనా ఒక మెట్టుగా వుపయోగపడకపోతే
ఏదైనా ఒక మేఘ శకటంలా మారకపోతే
ఎన్ని గగన సదృశ హర్మ్యాలు నిర్మించినా
ఎన్ని పచ్చని చేలు ధ్వంసించినా ప్రయోజనమేముంది?
కులం పునాదుల మీద కట్టే కుడ్యాలు ఎంతకాలముంటై?
సకలం విదేశీ పెట్టుబడి మీద నిలిపే
మీ ప్రాభవ దుర్గం కట్టుబడి ఎన్నేళ్లు నిలుస్తుంది!

మనిషికి గుప్పెడు మెతుకు, గుక్కెడు నీళ్లు
చెదరని గూడు, చీలని కూలని కుటుంబం
పాడీ పశువూ, వూరూ నారూ, చెట్టూ చేమా, మాటా మంతీ
మంచికీ మనుగడకీ మనిషిని మనిషి హత్తుకునే మెత్తని గుండెల మమతల స్పర్శ
పిలిస్తే పలికే తల్లి పలుకు, కలిస్తే కదిలే తెలుగు తొలుకు
మట్టినుంచి మింటిదాకా పెనేసుకున్న శ్రమైక జీవన స్పందన
తరాల తెలుగు ప్రజల సామాజిక పోరాట పరంపరల పరిమళమే కదా!

తన్నుతాను నిలదొక్కుకోటానికీ తన్నుతానుబతికించుకోటానికీ
పడినపాట్లు, మడి లేచిన పదనిసలు అన్నీ మన భాషా చరిత్ర ఘోషలే కదా!
మొన్నటి మచ్చలు, నిన్నటి గాయాలు, నేటి కన్నీటి చారికలు
మననం చేసుకోవటం లేదంటే మరుపు మాయలో పడినట్టే కదా!
తెలుగు మూలాలు మరచి, మార్గం మలుపు తప్పినట్టేకదా!

ప్రజల్ని ఒక సామూహిక క్షేమంకర వుత్పత్తి సంబంధం నుంచి విడగొట్టి
ఒంటరి బేరసారాల సరుగ్గా కుదించి, కొలిచి చిత్రిక పట్టే
ఈ వూహల వూసరవెల్లితనం వుద్దేశం, వ్యూహం ఏమిటి?

సంప్రదాయమంటే పంచెకట్టూ, పేటంచు కండువా
పట్టుచీరా పట్టు పరికిణీ వోణీ ఒడ్డాణం, ముక్కుపుడకా
వాలుజడా పాపిటిబొట్టూ కాలిపట్టాలేనా?
సంస్కృతంటే ఆటా పాటా అలంకారాలూ ఆడంబరాలేనా?
ఆచారాలంటే గుడిచుట్టు తిరుగుడులూ నదినీటిమునకలేనా?

ఈ పండుగ పబ్బాల మాటున
ఈ సందడి సర్దాల చాటున
జనాన్ని జోకొట్టి, ధనానికి జేకొట్టే పరిశ్రమ ప్రారంభమవుతున్నదేమో అన్పిస్తున్నది.
మళ్లీ వలసాధిపత్యానికి, పరాధీన సంస్కృతికి
పల్లకీ పడ్తున్నామేమో అన్పిస్తున్నది.

అ,ఆలను అణచి ఆంగ్లాన్ని ఎత్తుకుంటే
అంతరాలు తొలగి అంతస్థులు ఎదిగినచ్చేనా?
పెరిగే పేదరికానికి పెన్నిధులందినట్టేనా?
ఇంకా జ్ఞాన సూర్యుడ్ని చూడలేని దశలోనే
అమ్మ అక్షరముందంటే దానికి బాధ్యులెవరు?
ఇన్నేళ్ల నల్లదొరల పెత్తనం, పెడసరం
ప్రజల భాషలో విద్యా పాలనా పక్కకు నెట్టి పకపకలు పోతుంటే
దీనికి ఇరుసూ ఇమిడికా ఎవరు?

రోజు రోజుకీ
పదమటనుడికి జాతి సొమ్మసిలిపోతున్నది
పాశ్చాత్యపదఘట్టనకు భాష పగుళ్లు బారుతున్నది
బతుకోసం ప్రపంచమంతా చెల్లాచెదురైన తెలుగు సంతు
బిక్కచచ్చి, వూపిరి బిగబట్టి – చేతులు చూపుతూ చాస్తూ
గొంతుకలో కొట్టాడుతున్నమాటకు త్రాణం ఈయమనీ
కొడిగట్టిన తెలుగు దివ్వెకు ప్రాణం పోయమనీ
తల్లినేలకు నిర్నిమేష నిరీక్షణతో నివేదిస్తున్నది
చిన్ని చిన్ని సంస్థలకూ వ్యక్తులకూ
చేదోడువాదోడుగా వుండమని వేడుకొంటున్నది,

ఇప్పటికైనా తెల్గునేల నూతన పాలకులు
మరచిన దారికి మర్లి, చెమట సుగంధంలో సేదదేరి
తెలుగు పొలంలో కలుపు పీకి, కలుగులు పూడ్చి వెలుగు దవనం పండించమని
ప్రతి తెలుగు పుటకా తెలుగుప్రేమా ప్రేముడీ కోరుకుంటున్నది.

- వెలుగు వెంకట సుబ్బారావు
చీరాల, ఫోన్: 09290942433

చరిత్ర

- బొర్రా గోవర్ధన్

# తెలుగమ్మ ఒడిలో బౌద్ధం

**బు**ద్ధుడు పుట్టింది నేపాల్‌లోని లుంబినీ వనంలో, బౌద్ధం మొలకెత్తింది బీహార్‌లోని బుద్ధగయలో. బౌద్ధం మూడు పూలు ఆరు కాయలుగా పెంపొందింది మన తెలుగు నేలలో.

ప్రపంచంలో మరెక్కడా లేని విధంగా మన తెలుగునేలపై ఒకప్పుడు బౌద్ధం నడయాడింది. ఆ ఆనవాళ్ళను మన తెలుగు నేల తన పొర పొరలో దాచుకుంది. ఇక్కడి నేలను తవ్వితే మణులు మాణిక్యాలతోపాటు, అంతకంటే కోటిరెట్లు విలువైన చరిత్ర మణులు వెలికివస్తాయి. వేల బౌద్ధస్థూపాలు, ఆరామాలు, విహారాలు, విద్యాలయాలు బైటపడతాయి. అలా బైటపడిన ఒక్కొక్కటి ఒక్కొక్క చరిత్రను మనముందుంచుతుంది. మన గొప్పతనాన్ని చాటుతుంది.

అసలు బౌద్ధానికే కాదు - మానవజాతి నాగరకతకు కూడా భరతఖండంలో మన తెలుగు నేల పుట్టిల్లు . ముఖ్యంగా కృష్ణా, గోదావరి నదుల చుట్టుప్రక్కల ప్రాంతాలు కోట్ల ఏళ్ళనాటి భూపరిణామ చరిత్రను తెలియజేస్తాయి.

మన తెలుగు నేల అతి పురాతన కాలం నుండే చరిత్రగతిలో ముందు వరసలో ఉండటానికి కారణం భౌగోళికంగా ఆ నేలతీరు. తెలుగునేల తీరే ప్రత్యేకమైంది. నిజానికి మన భరతదేశం భౌగోళికంగా 'ఎడారి' ప్రాంతం కావాలి. కానీ ఉత్తరాన ఉన్న హిమాలయాలు, దక్షిణాన ఉన్న హిందూ మహాసముద్రం వల్ల ఆయా ఋతువుల్లో ఏర్పడిన ఋతుపవనాలు వృధాగా పోకుండా జడివానలు కురిపించి, ఎడారిగా మారాల్సిన నేలను పచ్చదనంతో నింపేశాయి. ఈ ఋతుపవన వానల వల్ల పుట్టిన నదులే కృష్ణ, గోదావరి నదులు, ఇంకా కావేరీ పినాకినీ, తుంగభద్ర లాంటి చిన్నచిన్న నదులు చాలా ఉన్నా ఈ రెండు నదులే పొడవైనవి కాబట్టి, వీటి పరిసరాలన్నీ విశాలంగా విస్తారంగా పంటభూములయ్యాయి. పచ్చదనమే జీవులకు 'జీవం' కాబట్టి, అన్నియుగాల్లో ఈ ప్రాంతంలో జీవుల మనుగడ కొనసాగింది. - అలాగే వ్యవసాయానికీ పుట్టిల్లు అయ్యింది. ఈ వ్యవసాయం మనిషిని దేశదిమ్మరిగా తిప్పక, ఒక్క చోటే బ్రతికే నిలకడ బతుకులు ఏర్పాటు చేస్తుంది. మనుషులు ఇలా ఒకే చోట ఎన్నోవేల ఏళ్లుగా కదలకుండా బ్రతికే వీలు ఉంది కాబట్టి, ఈ ప్రాంతం అతిపురాతన కాలం నుండి మన నాగరకతలకు తొలి ఆనవాళ్లుగా నిలిచింది.

నాగరకత అంటేనే, మనిషి జీవించే తీరు. మనిషి జీవనంలో మెలకువలు, భాష, శాస్త్రం, చిత్రలేఖనం, శిల్పకళ, వ్యవసాయం, ఇళ్ళు, రహదారుల నిర్మాణం, చదువు, వేషధారణ ఇవన్నీ నాగరకతను తెలిపేవే. ఈ అన్నింటి విషయంలో మన తెలుగు నేల ఎప్పుడూ వెనక పడి లేదు. వెనక పడ లేదు. చరిత్ర ప్రతి మలుపులో దాని ప్రత్యేకతను అది చాటుకుంటూనే ఉంది.

అలాగే... బౌద్ధం విషయంలో కూడా. బౌద్ధం పుట్టింది ఎక్కడైనా... పెరిగింది ఇక్కడే. అనేక శాఖలుగా విస్తరించిన బౌద్ధంలో ఎన్నో శాఖలు ఇక్కడి నుండి పుట్టినవే. మహాభారతంలో ఆంధ్రుల ప్రస్తావన ఉంది. అలాగే బౌద్ధ దర్శనంలో తెలుగు తత్వవేత్తల ముద్ర బలీయంగా ఉంది.



బౌద్ధంలోని మహాయాన, వజ్రయాన సంప్రదాయాలు పుట్టింది ఈ నేల మీదే. ఇక్కడ పుట్టిన ఈ బౌద్ధ సంప్రదాయాలే ఈనాడు ప్రపంచ వ్యాపితంగా వర్ధిల్లుతున్నాయి. ఇలాచూస్తే బౌద్ధం జీవగర్ర మన తెలుగు నేల అనడం, అనుకోవడం మెరమెచ్చులు కాదు. ప్రపంచంలో అతి పురాతన అతిపెద్ద విశ్వవిద్యాలయాల్లో రెండింటిని (అమరావతి,నాగార్జున కొండ) ఈనేల మీదే నెలకొల్పారు బౌద్ధులు.

ఒక సమయంలో దేశ విదేశాల నుండి వేలాది మంది ఇక్కడకొచ్చి చదువుకొనేవారు. అలాగే.. శిల్పకళలో కొత్త రీతులు, నిర్మాణ కళలో కొత్త కొత్త వరవడులు బౌద్ధుల ప్రభావం వల్లే ఇక్కడ పుట్టుకొచ్చాయి.

ఇలా.. అన్ని రంగాల్లో బౌద్ధం ఈ నేల మీద వేలాది ఏళ్లుగా వేళ్లూనుకు పోయింది. ఆ వైభవం ఈనాడు ఈ నేల తన ప్రతి అడుగడుగునా తేట తెల్లం చేస్తుంది. ఆ నేలతల్లి గుండె గూడు లోకి కొద్దిగా తొంగిచూద్దాం.

మన తెలుగు నేల మీద బౌద్ధం తీరుతెన్నుల్ని కొద్దిగా చూద్దాం.

తొలి ఆనవాళ్ళు :

ఇప్పటికి దాదాపుగా రెండువేల ఐదువందల ఏళ్ళనాడే - అంటే బుద్ధుడు జీవించి ఉన్ననాడే బౌద్ధం ఇక్కడకు చేరింది. బావరి అనే ఒక ముని, అతని శిష్యుల మూలంగా ఈ తెలుగు తీరానికి వచ్చింది.

బుద్ధుని కాలంలో గోదావరి తీరాన అస్సక రాజ్యం ఉండేది. 'అస్సక' అంటే అస్మక, అశ్మక అని. ఇది ఈనాటి నిజామాబాద్ చుట్టు ప్రక్కల ప్రాంతం. ఈ అస్సక రాజ్యంలో ముళక ప్రాంతం ఉంది. ఇది ఈ నాటి బోధన్ (బోధన ?, బుద్ధాన?). ఇక్కడ గోదావరి నది ఒడ్డున బావరి ముని ఆశ్రమం ఉండేది. ఈయన ఉంఛవృత్తి (పరిగ ఏరుకోవడం) మీద - అంటే మిగిలిపోయిన, విడిచిపోయిన వాటిని సేకరించుకుంటూ, అలాగే రాలిన పండ్లూ, కాయలూ ఏరుకొని తింటూ జీవిస్తూ ఉండేవాడు. ఆ నది ఒడ్డున ఒక పెద్ద ఊరు ఉంది. ఆ ఊళ్ళో తనకి కానుకగా వచ్చిన డబ్బుతో ఒక యజ్ఞం చేస్తాడు బావరి. ఆ పని పూర్తయాక, తన ఆశ్రమానికి తిరిగి వెళ్తాడు. అప్పుడు ఆయన వెనుకే ఒక బ్రాహ్మణుడు వెళ్ళి 'ఓ ఐదువందల నాణేలు ఇవ్వమని అడుగుతాడు. బావరి అతణ్ణి

కూర్చోబెట్టి, మంచి చెద్దలు చూసి, అప్పుదు "ఓ బ్రాహ్మణా! నాకొచ్చిన కాన్కలన్నీ అక్కడే, అప్పుడే పంచేశాను, ఇప్పుడు నాదగ్గర ఏమీ లేదు. నన్ను మన్నించు" అంటాడు. అప్పుడు ఆ బ్రాహ్మణుడు.

"నేను అడిగినది ఇవ్వలేదు. కాబట్టి ఈనాటినుండి ఏడోరోజున నీ తల ఏడు వక్కలుగా పగిలిపోతుంది" అని తిట్టి, వెళ్ళిపోతాడు.

దానితో బావరికి మనేద (దిగులు) పట్టుకుంది. తెగ బాధపడి పోతాడు. తిండి కూడా మానేస్తాడు. బక్కచిక్కిపోతాడు. ఆ విషయం తెలిసిన ఒక వ్యక్తి వచ్చి 'బావరీ! ఆ బ్రాహ్మణుడు కపటి. పచ్చి మోసగాడు. డబ్బు యావ కలవాడు. వాడికి 'తల' గురించి కానీ, 'తల పగలడం' గురించి కానీ ఏమీ తెలియదు," అంటాడు.

'తల' అంటే ఏమిటో? 'తలపగలడం' అంటే ఏమిటో చెప్పగలరా?" అని అడిగాడు బావరి.

"నాకూ తెలియదు ఈ విషయం తెలిసిన జ్ఞాని, సంబోధిని పొందిన బుద్ధుడు ఒక్కడే! ఆయన ఇప్పుడు శ్రావస్తిలో ఉన్నాడు" అని చెప్తాడు ఆ వ్యక్తి.

'బుద్ధుడు' , 'సంబోధి' అనే మాటలు వినగానే బావరి సంతోష పడతాడు.

ఆయన తన శిష్యుల్ని పిలిచి

"నాయనలారా! ఇలారండి! సంబోధిని (జ్ఞానం) పొందిన ఒక వ్యక్తి శ్రావస్తిలో ఉన్నాడట. మీరు వెళ్ళి ఈ 'తల'గురించి, 'తల పగలడం' గురించి వివరాలు తెలుసుకురండి" అని చెప్పి, ఆ పదహారు మందినీ పంపుతాడు.

అక్కడి నుండి ఆ జటాధారులు (జుట్టు జడలు జడలుగా అట్ట కట్టుకు పోయిన మునులు) ఉత్తరదిక్కుగా బయలుదేరి, పతిట్ఠానం (ప్రతిష్టానం), ఉజ్జయిని, వెదిస (విదిశా), కోసంబి (కోశాంబి), కపిలవస్తు, కుసినగర, వైసాలి (వైశాలి) మీదుగా మగధరాజధాని దగ్గర ఉన్న పాసాణక చేతియ (పాషాణ చైత్యం) చేరారు. అక్కడ బుద్ధుణ్ణి కలుసుకొని, నమస్కరించి, తమ వివరాలు తెలిపి, 'తల'గురించి, 'తలపగలడం' గురించి అడుగుతారు.

దానికి బుద్ధుడు "తల అంటే అవిద్యే (తెలియని తనమే). శ్రద్ధతో, వీర్యంతో విద్య నేర్వడమే 'తల పగలడం' అని చెప్తాడు. అంటే అవిద్యను పగలగొట్టడమే తలను పగులగొట్టడం అన్నమాట. అంటే.. యజ్ఞయాగాలు చేయడం వల్ల ముక్తిరాదు. జ్ఞానం కలగదు. అవిద్యను తొలగించుకోవడం వల్లే సమ్యక్ జ్ఞానం (సరైన జ్ఞానం, లేదా సరైన తెలివి) కలుగుతుందని దీనర్థం. అలా అ పదహారు మంది బుద్ధుని దగ్గరకు వెళ్ళి ఆయన ఉపదేశం విని, ఆయన అనుయాయులుగా మారి పోతారు. అట్లా వెళ్లిన ఆ పదహారు మందిలో పదిహేను మంది అక్కడే ఉండిపోగా, వయస్సులో వారందరికంటే పెద్దవాడైన "సింగియుడు" అనేవాడు తిరిగి వచ్చి, బుద్ధుని బోధనల సారాంశాన్ని బావరికి చెప్తాడు. ఆ బోధనల సారాంశం తెలుసుకున్న బావరి మనేద తగ్గుతుంది. ఆ తర్వాత వారిద్దరూ ఆ గోదావరీ తీర ప్రదేశాల్లో బుద్ధుని బోధనలు వెల్లడిచేస్తూ గడిపారు.

ఈ కథ బౌద్ధ సాహిత్యంలోని 'సుత్తనిపాత'లో ఉంది. బౌద్ధ సాహిత్యంలోని అతిపురాతన గ్రంథం ఇది. ఈ 'సుత్త నిపాత' లోని ఆఖరివర్గం 'పారాయణవర్గం. బావరి 16 మంది శిష్యులు బుద్ధునితో జరిపిన సంభాషణలే ఈ పారాయన వగ్గ (పారాయణ వర్గం). ఈ పదహారుమంది కొన్ని ప్రశ్నలు బుద్ధుణ్ణి అడుగుతారు. బుద్ధుడు ఆ ప్రశ్నలకు సరైన సమాధానం ఇస్తాడు. - ఈ ప్రశ్నలు - సమాధానాలే ఈ పారాయణ వగ్గలో ఉన్నాయి. ఆ పదహారు మంది పేరున పదహారు విభాగాలు ఉన్నాయి. ఆ పదహారు మంది పేర్లు ఇవి :

1. అజితుడు 2. తిస్సమెత్తెయ్య. 3. పుణ్ణకుడు 4. మెత్తగుడు 5. ధోతకుడు 6. ఉపసివుడు 7. నందుడు 8. హేమకుడు 9. తొదెయ్యుడు 10. కప్పడు 11. జతుకణ్ణి 12. భద్రావుధుడు 13. ఉదయుడు 14. పోసాలుడు 15. మోఘరాజు 16. పింగియుడు.

అంటే... బుద్ధుని కాలంలోనే బావరితో కలిసి మొత్తం పదిహేడు మంది బౌద్ధదీక్ష తీసుకున్నారన్నమాట.

తెలుగు నేల మీద బౌద్ధం వేసిన తొలి అడుగులకు ఆనవాలు ఈ పారాయణ వగ్గ .

అందుకే బౌద్ధ ధమ్మ రాదారి.... మన గలగలల గోదారి.

(తర్వాత.... వచ్చేసంచికలో...)

పాట

## అడుగడుగూ బౌద్ధమే

పల్లవి : అడుగడుగు బౌద్ధమే - తెలుగు మాగాణిలో
అణువణువు బౌద్ధమే - మన జీవనాడిలో ॥అడుగడుగు॥

చరణం : పలికింది స్వాగతం - బావరీ మునిగణం
తొలి బీజమేసింది - అస్సక గణ జనం
చూపింది రాదారి - గలగలల గోదారి
బౌద్ధమే కిష్ణమ్మ - మారు పేరుగ మారె ॥అడుగడుగు॥

చరణం : శరణు గీతిక పాడె - కోటిలింగాల
పంచశీల శాల - మన ఘంటసాల
చతురార్యసత్యాల - గుంటుపల్లీ
అష్టాంగపది - నేలకొండపల్లీ ॥అడుగడుగు॥

చరణం : బోధి దమ్మం నడిచె - బొజ్జన్నకొండలో
జ్ఞాన జ్యోతులు వెలిగె - ఆదుర్రులో
శాలిహుండం బోధి - ధ్యాన భాండం
భట్టిప్రోలే బుద్ధ - ధర్మదీపం ॥అడుగడుగు॥

చరణం : నాగార్జునా కొండ గుండె లోగిలిలో
తొట్లకొండ, బావికొండ గుండియలో
అమరావతీ నగర - నడివీధిలో
నందలూరు, చందవరము ముంగిటిలో
సంఘమే వెలసింది - దమ్మమే నడచింది
తెలుగమ్మ తనువంత పులకరించింది ॥అడుగడుగు॥

చరణం : చైత్యాలు, స్థూపాలు - గుహలు, ఆరామాలు
తెలుగు నేలంతటా - వెలుగులే నింపాయి
ఈ జ్ఞాన కాంతులే - దిగంతాలకు చేరి
ధ్యాన జ్యోతిగ మారె-భువిని కాంచీపురి ॥అడుగడుగు॥

- బొర్రా గోవర్ధన్
నగరం, రేపల్లె, ఫోన్: 09390600157

ప్రకృతి

# సమన్యాయం !

- డా॥ కొప్పుల హేమాద్రి

ప్రకృతిమాతా పాహిమాం! మా జాతికి మీరే న్యాయం చెయ్యాలి.

నాయనా నారికేళా? నా వల్ల నీకేమన్యాయం జరిగింది? ఎవరికేది చేసినా (ప్రకృతి) ధర్మాన్ననుసరించే కదా చేస్తాను?

అహహ... అది కాదు మాతా! నేను విన్నవించేది "సమ న్యాయం" గురించి.

కాస్త వివరంగా చెబుతావా నాయనా?

అటులనే తల్లీ! వృక్ష సంతతికే చెందిన మేము సముద్రతీర ప్రాంతాలలోనే ఎందుకు జీవించాలి? మిగత చెట్లలాగే కొండలమీద పెరిగే అర్హత మాకు లేదా?

ప్రకృతి ధర్మమంటే నీకు అర్థమైనట్లు లేదు నారికేళా! నీకిప్పుడు ఎంత చెప్పినా ఆకాశాన్ని తాకుతున్న నీ తలకెక్కదు. ఇంతకు ముందు కూడా నీ జాతివారు నాతో ఇలాగే మొర పెట్టుకున్నారు! నేను సర్ది చెప్ప బోయాను. ససేమిరా ఒప్పుకోలేదు! దానితో ''స్వయంగా అనుభవిస్తేగాని తలకెక్కదని వాళ్ళకి మచ్చుకి ఒక కొండమీద నివసించే యేర్పాటు చేశాను. ఆ తరువాత ఏమయ్యిందో నీ మూడు కళ్ళకు గోచరమయ్యేలా చేస్తాను తిలకించు" అంటుండగానే ప్రదర్శన మొదలైపోయింది.

**ఒకటో అంకం సారాంశం** : ఓ కొండ. ఆ కొండ మీద కొబ్బరిచెట్లతోసహా రకరకాల వృక్షజాతులు ఉన్నాయి. ఋతు ధర్మాల ననుసరించి అన్నిచెట్లూ పూలు పూచాయి. కాయలు కాచాయి. పండిపోయిన కొన్ని జాతుల ఫలాలు రాలిపోయాయి. కొన్ని ఎగిరిపోయాయి. తల్లి చెట్ల సమీపంలోనే రాలిన గింజలు వర్షాకాలంలో అక్కడే మొలకెత్తాయి. మరికొన్ని తమ తమ భౌతిక స్వరూపానికీ, నిర్మాణ పద్ధతికీ అనుగుణంగా దూరప్రాంతాలకు చేరుకుని వీలు కుదిరిన చోట్ల మొలకెత్తి స్థిరపడ్డాయి.

**రెండో అంకంలో** దృశ్యమాల ఇలా ఉంది. వరుసగా కొన్నేళ్ళ పాటు వర్షాలు పడకపోవడంతో ఆ కొండ మీద పెరుగుతున్న అన్ని జాతుల చెట్లూ– గడ్డీ గాదంతో సహా చచ్చిపోయాయి. కార్చిచ్చు వ్యాపించి కాలి బూడిదైపోయాయి. బండరాళ్ళు బయట పడ్డాయి. కొంత కాలం గడిచిన తరువాత కనబడిన దృశ్యంలో– కొండమీద పూర్వపు వృక్షవైభవం జాడలేదు. గాలికెగిరివచ్చిన విత్తులూ, పక్షులూ తదితర అడవిమృగాల ద్వారా వచ్చి పడిన గింజలూ మొలకెత్తడంతో గడ్డి మొక్కలూ, తీగలూ, ఏవేవో జాతుల చెట్లూ పెరిగాయి. మరి కొబ్బరిచెట్ల సంగతో? అప్పటి వాతావరణం అనుకూలించక పోవడంతో కొండమీద కొబ్బరిచెట్లన్నీ నశించిపోయాయి. కాకపోతే, గతంలో ఆ కొండ నుండి ప్రవహించిన వాగుల్లో తేలుకుంటూ పోయి సముద్రతీరానికి చేరిన కొబ్బరిబోండాలు ఆ ప్రాంతంలో మొలకెత్తి ఇబ్బడి ముబ్బడిగా వృద్ధి చెందాయి.

ఈ దృశ్యాలను తిలకించిన నారికేళుడికి జ్ఞానోదయమయ్యింది. తమవంటి వృక్షాలు తీర ప్రాంతాలకు పరిమితం కావడమే "సమ న్యాయం' అని బోధపడింది.

**మరికొంత వివరణ:**

ప్రకృతికి సంబంధించినంత వరకు "సమ న్యాయం" అంటే యేమిటో మరింత చెప్పాల్సి ఉంది. మనం ఒక గొయ్యి తవ్వి, దాని మానాన దాన్ని వదిలేస్తే– కొంత కాలానికి అది మానవ ప్రమేయం లేకపోయినా పూడ్చుకుపోతుంది. అంతేకాదు, ఆ పక్కనే కుప్పలా పోసిన మట్టి కూడ కొంచెం కొంచెంగా తరిగిపోయి అక్కడున్న నేల మట్టానికి సమమైపోతుంది.




మరొక్క సంగతి. ఖాళీగా ఉన్న ఓ గదిలో ఒక దూదిపింజను ఉంచి, "ఫుల్ స్పీడ్"లో పంఖా వేసి, గదికి తాళం పెట్టి, కొన్ని గంటల తరువాత తెరిచి చూస్తే– దూదిపింజ ఆ గదిలో ఏదో ఒక మూలకు చేరి ఉంటుంది. ఇలా ఎన్నిసార్లు చేసినా ఎన్ని దూదిపింజలు వేసినా అవన్నీ ఆ మూలకే చేరుకుంటాయి. ఐతే, ఆ గది తలుపులు తెరచి ఉంచినా, లేక మరే మార్పు చేసినా ఆ దూదిపింజలు మరో చోటును వెతుక్కుని అక్కడ స్థిరపడతాయి.

పర్యావరణశాస్త్ర పరిభాషలో పైన ఉటంకించిన మార్పుల క్రమాన్ని "ప్రకృతిసిద్ధమైన వ్యవస్థాపన" (ఇకసిస్) అంటారు. ఈ ప్రక్రియ ద్వారా వచ్చిన పరివర్తన యొక్క అంతిమ ఫలితమే పర్యావరణ పరాకాష్ఠ (క్లైమాటిక్ క్లైమాక్స్). ఆ స్థితినే జీవావరణ సమతుల్యత (ఇకలాజికల్ ఈక్విలిబ్రియం) అంటారు.

మానవజాతి పరిణామక్రమాన్ని పర్యావరణ సిద్ధాంత చట్రంలో బిగించి చూస్తే, ప్రస్తుతం ప్రపంచవ్యాప్తంగా జరుగుతున్న ప్రతి ఘటనా ప్రకృతిసిద్ధమే అనిన్నూ, "క్లైమాటిక్ క్లైమాక్స్"ను చేరడానికీ, తద్వారా "ఇకలాజికల్ ఈక్విలిబ్రియం"ను సాధించడానికే అనిన్నూ మనకు అవగతమవుతుంది. ఈ కథలాంటి వ్యాసం ద్వారా నేను ప్రతిపాదించ దలచుకున్నది ఇదే !


ఫోన్: 09848296865


ఇదే మాదిరిగా మీరూ శాస్త్రీయ అంశాలను పత్రికకు రాయవచ్చు. - సం॥

# ‘ఎల్లలు లేని తెలుగు’ పుస్తకం విడుదల సభ



(ఎడమ నుండి కుడికి) పుస్తక రచయిత శ్రీ స.వెం.రమేశ్, విశిష్ట అతిథి డా॥ ఈమని శివనాగిరెడ్డి, ఆవిష్కర్త డా॥ చుక్కా రామయ్య, శ్రీ పి.వేణుగోపాలరెడ్డి, డా॥ సామల రమేష్‌బాబు, శ్రీ పాలేటి వెంకటరావు, శ్రీమతి పూదోట శౌరీలు

ఫిబ్రవరి 8న సాయంత్రం 5 గంటలకు హైదరాబాదులో దోమల్‌గుడాలోని హైదరాబాదు స్టడీ సర్కిల్ సభా మందిరంలో ‘ఎల్లలు లేని తెలుగు’ పుస్తకాన్ని ప్రముఖ విద్యావేత్త, తెలుగు భాషోద్యమ సమాఖ్య గౌరవాధ్యక్షులు డాక్టర్ చుక్కా రామయ్య ఆవిష్కరించారు. పరిపాలన రీత్యా రెండు రాష్ట్రాలుగా విడిపోయినా తెలుగుజాతి ఒక్కటేనని, అంతా సాంస్కృతికంగా కలిసిమెలిసి వుండాలని ముఖ్య అతిథి డాక్టర్ చుక్కా రామయ్య ఈ సందర్భంగా పిలుపునిచ్చారు. రెండు రాష్ట్రాలకు బయట వున్న తెలుగుప్రజల గురించి స్వయంగా పరిశోధన చేసి, రమేశ్ రచించిన ఈ వ్యాసాల సంకలనం ‘ఎల్లలు లేని తెలుగు’ అందరూ చదివి తెలుసుకోవలసిన విశేషాలతో నిండివుందని ఆయన చెప్పారు. ఈ పుస్తకాన్ని తొలి ప్రచురణగా తీసుకువచ్చిన తెలుగుజాతి ట్రస్టును అభినందించారు. విశిష్ట అతిథిగా విచ్చేసిన డాక్టర్ ఈమని శివనాగిరెడ్డి తెలుగుజాతి చరిత్ర లోతుల్లోకి వెళ్ళి అనేక విషయాలను ప్రస్తావించారు. ఈ పుస్తకంలోని వ్యాసాలు నడుస్తున్నచరిత్రలో ప్రచురించినప్పుడు తాను చదివానని, దీనివెనుక ఎన్నో ఏళ్ల పరిశోధన, అనుభవం వున్నాయని అన్నారు. తెలుగువాణి ట్రస్టు మేనేజింగ్ ట్రస్టీ శ్రీ పి.వేణుగోపాలరెడ్డి మాట్లాడుతూ తెలుగువాణి ట్రస్టులో ఒకరుగా స.వెం.రమేశ్ 2004 నుంచి తమిళనాడులో తెలుగుపాఠాలు బోధించే కార్యక్రమంలో ఎంతో కృషి చేశారన్నారు. అప్పుడు తెలుగు చదవడం, వ్రాయడం నేర్చుకున్న యువకుల్లోంచి కథారచయితలు ఆవిర్భవించడం గొప్ప సంగతి అన్నారు. దాత శ్రీ పాలేటి వెంకట్రావు తనతోపాటు ఆర్థికసహకారం చేసిన శ్రీ స్వర్ణ శరత్‌బాబు అనారోగ్యం వల్ల రాలేకపోయారని తెలుపుతూ ఈ పుస్తకం ముద్రణలో పాలుపంచుకున్నందుకు తాను చాలా సంతోషిస్తున్నట్లు తెలిపారు. సభాధ్యక్షత వహించిన తెలుగుజాతి ట్రస్టు మేనేజింగ్ ట్రస్టీ డాక్టర్ సామల రమేష్‌బాబు ప్రసంగంలో తెలుగుజాతి ట్రస్టును తెలుగువారి చరిత్ర, భాష మూలాలను వెలుగులోకి తేవడం కోసం స్థాపించామని, దీని నుండి ఒక నెలవారీపత్రిక ‘అమ్మనుడి’ పేరుతో ఈ నెలాఖరు రానున్నదని, ఇది ఇరవైయేళ్లుగా తాను ప్రచురిస్తున్న ‘నడుస్తున్నచరిత్ర’ వారసత్వంతో వస్తున్నదని గతంలో మాదిరిగా దీనికి అందరూ సహకరించాలని విజ్ఞప్తి చేశారు. ట్రస్టు తరఫున మొదటి పుస్తకం స.వెం.రమేశ్ రచన ‘ఎల్లలు లేని తెలుగు’ అని తెలియజేశారు. మున్ముందు మరికొన్ని పుస్తకాలు తేనున్నామని చెప్పారు. ఇప్పుడు నడుస్తున్న తెలుగు భాషోద్యమానికి ఒక చారిత్రక నేపథ్యాన్ని, వెలుగులోకి రాని అనేక వాస్తవాలను వెలికితీసి, వాటిని ముద్రణలోను, ఎలక్ట్రానిక్ మీడియాలోను ప్రచారం చేయాలని తెలుగుజాతి ట్రస్టు నిర్ణయించిందని చెప్పారు. తెలుగుప్రజల చరిత్రల్లో మరుగునపడిన అంశాలలోకి, భాష మూలాలలోకి పరిశోధన చేసే విద్యార్థులకు, ఔత్సాహికులకు తెలుగుజాతి ట్రస్టు నుండి అన్నివిధాలా సహకారం లభిస్తుందని తెలియజేశారు. చివరగా మాట్లాడిన పుస్తక రచయిత స.వెం.రమేశ్, ఎన్నోవేల యేళ్లుగా నివసిస్తున్న తమ ప్రాంతాలు ఆంధ్రరాష్ట్ర ఏర్పాటుతో పరాయి ప్రాంతాలవుతాయా? అని ప్రశ్నించారు. తమను ‘ప్రవాసాంధ్రులు’ అనడం పట్ల తీవ్ర అభ్యంతరాన్ని, ఆవేదనను తెలియజేశారు. విశాలమైన దక్షిణ భారతదేశమంతా పరచుకునివున్న తెలుగుప్రాంతాన్ని వదిలివేసి, స్వార్థరాజకీయ ఉద్దేశ్యాలతో ఆంధ్రరాష్ట్రాన్ని ఏర్పరచుకున్నందువల్ల ఇతర రాష్ట్రాల్లో వుండిపోయిన తామంతా అన్నివిధాలుగా మోసపోయామని, అక్కడి అణచివేతకు గురయ్యామని అన్నారు. ఇప్పటికీ మేమంతా ఇంట్లోను, తోటి తెలుగువారితోను తెలుగులోనే మాట్లాడుకుంటామని, ఈ విషయంలో మీకంటే మేమే నిజాయితీగా వున్నామని అన్నారు. ఈ రెండు రాష్ట్రాల్లో వున్నవారికి సమసంఖ్యలో వున్న బయటిరాష్ట్రాల తెలుగువారి గురించి పట్టించుకోని తమకు అన్నివిధాలా మద్దతును, సహకారాన్ని ఇవ్వాల్సిన బాధ్యత మీపై వున్నదన్నారు. ట్రస్టు కార్యదర్శి శ్రీ పారుపల్లి కోదండరామయ్య, ట్రస్టీలు శ్రీ కోటిపల్లి సుబ్బారావు, శ్రీమతి డి.పి. అనూరాధ, శ్రీమతి పూదోట శౌరీలు సభను నిర్వహించారు.

భాషోద్యమం

– మాదిరాజు రాంబాబు

# భావోద్వేగమే చాలదు!

**ఒక** రచయిత 'గుండెలు బాదుకుంటే తెలుగు వెలుగుతుందా?' అనే వ్యాసంలో భాషోద్యమకారులను వెటకరించారు. ఇది 2011 నాటి మాట. దానికి ఆనాడు సమాధానం చెప్పడానికి తగిన సందర్భం రాలేదు. అయితే 'నడుస్తున్న చరిత్ర' పత్రిక చితాభస్మం నుంచి రెట్టించిన ఉత్సాహంతో పైకి లేచిన ఫినిక్స్ పక్షిలా మళ్ళీ 'అమ్మనుడి'గా పుట్టుకొచ్చిన సందర్భంలో ఆయన వెటకారాన్ని ప్రస్తావించడం సరైనదిగా భావించాను.

ఏదైనా ఒక ఉద్యమంలో కాడెద్దులులాగా 'ఉద్వేగం' (భావజాలం–ఐడియాలజీ), 'హేతుబద్ధత' (సిద్ధాంతం–థియరీ) రెండూ సమన్వయంతో నడుస్తాయి. ఉద్యమానికి ఇంధనంగా ఉండే ఆ రెండూ పరస్పర పూరకాలుగా కొనసాగుతాయి. అంటే భాషోద్యమానికి సిద్ధాంతవేత్త ఎంత ముఖ్యమో, భావజాలవేత్త కూడా అంతే అవసరం. అంటే ఉద్వేగమూ, హేతుబద్ధతా తగుపాళ్ళలో ఉంటేనే ఏ ఉద్యమమైనా విజయవంతం అయ్యేందుకు అవకాశం ఉంటుంది. ఈ నేపథ్యంలో తెలుగు వెలుగు కోసం గుండెలు బాదుకొనే తెలుగువాళ్ళున్నట్లే, ప్రణాళికలు, పథక రచనలు చేసే సిద్ధాంతకర్తలు అవసరం. తెలుగు ఉద్యమానికి ఉద్వేగం మాత్రమే ఉందని విమర్శిస్తూ, దాని హేతుబద్ధతను ప్రస్తావించని ఆ రచయిత తెలుగు భాషోద్ధరణకు కొన్ని అమౌలిక చిట్కాలు సూచించారు.

ఐక్యరాజ్య సమితి రూపొందించిన అంతరిస్తున్న భాషల జాబితాలో తెలుగు భాష కూడా చేరేసరికి వివిధ తెలుగు మేధావుల శ్రేణుల్లో ఆందోళన మొదలయ్యింది. సమకాలీన అవసరాలకు తగినట్లుగా తెలుగు ఎదగ లేకపోయింది. ఆధునికీకరణ ప్రక్రియ కొరవడి, తర్వాతి తరాలు ఉపాధి భాషగా అంగ్లాన్ని ఎంచుకుంటున్న కారణంగా అసలు భాష ఉనికికే ప్రమాదం ఏర్పడిందన్న భయం సర్వత్రా వ్యాపించింది. ఇంగ్లీషు మాధ్యమ విద్య కారణంగా అమ్మనుడి నాశనమైపోతోందని వాపోతున్నవారు కొందరు. నిత్య వ్యవహారంలో ఇంగ్లీషు వాడకం పెరిగిన కారణంగాను, పత్రికల్లో, టీవీ చానళ్ళలో భాష సంకరమై పోతున్నదని చింతించేవారు మరికొందరు. తెలుగు పుస్తకాలకు సాహిత్యానికి ఆదరణ తరిగిపోతున్నదని ఆవేదన చెందేవారు మరికొందరు. ఇతర భాషాజాతీయులు ఇద్దరు కలిస్తే వారి భాషలోనే మాట్లాడుకుంటారని, ఇద్దరు తెలుగు వాళ్ళు కలిస్తే మాత్రం అమ్మనుడిలో కాక ఇంగ్లీషులోనో మరి ఇతర భాషల్లోనో మాట్లాడుకుంటారన్న చలోక్తి ప్రచారం ఉంది. దానికితోడు తెలుగు భాషా జాతీయుల ప్రాంతీయ, మాండలిక వైవిధ్యాలను అర్థం చేసుకోలేని రాజకీయ నాయకుల హ్రస్వదృష్టి, అవివేకం, లాభాపేక్షల కారణంగా ప్రాంతీయ వైషమ్యాలు ఉనికిలోకి వచ్చిన నేపథ్యంలో ప్రామాణిక తెలుగు భాష భావన సంక్షోభంలో పడింది. ప్రామాణిక తెలుగు భాష సంబంధిత మాండలికాలన్నిటి సంగమ స్థానంగా, సంశ్లేషిత రూపంగా కాక ఏదో ఒక ప్రాంత మాండలిక ఆధిపత్యానికి సాధనంగా మారింది. దాంతో మిగిలిన మాండలిక వ్యవహర్తల్లో రగిలిన అసంతృప్తి తమ మాండలికాన్ని ఒక ప్రత్యేక భాషగా, తమను తాము ప్రత్యేక భాషాజాతీయులుగా ప్రకటించుకునే ధోరణి కూడా తలెత్తింది. మరికొందరు తెలుగు భాష అగ్రవర్ణ వ్యక్తీకరణంగా ఉన్నందువల్ల తమ అస్తిత్వాల అభ్యున్నతి అమ్మనుడి ద్వారా సాధ్యం కాదని, వర్ణ వివక్షకు తావులేని ఆంగ్ల భాష నేర్వడం ద్వారా మాత్రమే కులవివక్షను ఎదుర్కొని వికాసం పొందగలమని భావిస్తున్నారు. ఈ నేపథ్యంలో తెలుగు భాషకు పట్టబోయే దుస్థితికి కారణాలను అన్వేషించే ప్రయత్నాలు ప్రారంభమయ్యాయి.

తెలుగు రాష్ట్రాల్లోనూ, ఇతర రాష్ట్రాల్లోనూ, విదేశాల్లోనూ దాదాపు 18కోట్ల మంది దాకా వ్యవహర్తలున్న తెలుగు భాష అంతరించిపోతుందని భయపడడం నిర్హేతుకమని కొందరు మేధావులు అభిప్రాయపడుతున్నారు. తెలుగు పత్రికా పాఠకుల సంఖ్య, సాహిత్య పాఠకుల సంఖ్య పెరుగుతూనే ఉంది తప్ప, తరగడం లేదు. 'పదుల సంఖ్యలోనో, వందల సంఖ్యలోనో వ్యవహర్తలు మిగిలిన పురాయుగపు ఆదివాసీ భాషల మాదిరిగా తెలుగు కూడా అంతరించిపోతుందని భయపడడం నిర్హేతుకమ'ని మరికొందరి వాదన. ఒక నిర్దిష్ట పర్యావరణంలో మనుగడలో ఉన్న సమాజంలోని భౌతిక, బౌద్ధిక ఉత్పత్తి వ్యవహార కార్యకలాపాల అవసరాలకనుగుణంగా వ్యక్తుల చైతన్యానికి, సంకల్పానికి అతీతంగా వస్తుగతంగా ప్రజల మధ్య ఏర్పడే 'శబ్ద సంకేత వ్యవస్థ'ను భాష అని పిలుస్తారు. భూగోళంలో పర్యావరణ వైవిధ్యానికి అనుగుణంగా వివిధ భాషలు ఉనికిలోకి వచ్చాయి. దృగంశాల (పైకి కనిపించే దృశ్యమాన ప్రపంచ) వాస్తవికత నుంచి ప్రపంచ (ప్రకృతి+సమాజం) అంతర్గత నియమాల అంతస్సారంలోకి మనిషి జ్ఞానాభివృద్ధి క్రమం లోతుగా కొనసాగేకొద్దీ అనంతమైన సాపేక్ష సత్యాలు ఉనికిలోకి వస్తుంటాయి. ఈ నిరంతరాయమైన జ్ఞానాభివృద్ధి క్రమంలోని వివిధలను అర్థం చేసుకునేందుకు వీలుగా సరికొత్త పారిభాషిక పదాలు రూపొందించు కోవాల్సి ఉంటుంది. దాంతో సాధారణ వ్యవహారిక భాష పునాదిగా వివిధ విజ్ఞాన శాస్త్ర రంగాల్లో అందుకు అవసరమైన పారిభాషిక పదజాలం ఏర్పడుతుంది. ఆయా సమాజాలలోని ఉత్పత్తి కార్యకలాపానికి అనుబంధంగా సాగే శాస్త్రసాంకేతికాభివృద్ధిలో భాగంగా అభివృద్ధి చెందే శాస్త్రాల అవసరాల కోసం పుట్టుకొచ్చే పదసంపద, భాషలను 'కృతక భాష'లని అంటారు. దృగంశాల పునాదిగా సాగే సామాజిక వ్యవహారాల కోసం మనుషులు వినియోగించే వ్యవహారిక భాషను 'సహజ భాష' అని పిలుస్తారు. ఈ సహజ భాష పునాదిగా వివిధ శాస్త్రాల పారిభాషిక పదజాలంతో 'కృతక భాష' రూపొందుతుంది. రెండూ అవిభాజ్యమైనవే. ఆయా సమాజాలు సాధించిన అభివృద్ధి స్థాయిని బట్టి ఆ రెండింటి వికాసాలుంటాయి.

ఒక జాతీయ భాషలోని సహజ, కృతక భాష అనే రెండు అంశాలూ పరస్పర ఆశ్రితాలుగా, పరస్పర పూరకాలుగా, పరస్పర ప్రభావితం అవుతూ కొనసాగుతాయి. ఆచరణ, జ్ఞానం ఎలా అవిభాజ్యమైనవో ఇవి రెండూ ఒక భాషలో అంతర్భాగాలు. వ్యవహారిక భాష ప్రజలదని, సాహిత్యం, విజ్ఞాన శాస్త్రాల భాష శిష్ట వర్గాలదని సూత్రీకరించడం పొరపాటు. సహజ భాషల పునాదిగానే కృతక భాషలు ఉద్భవించి

నప్పటికీ, అవి తిరిగి సహజ భాషల అభివృద్ధికి దోహదం చేస్తాయి. సహజ భాషలకు సామాన్య ప్రజలు కర్తలయితే కృతక భాషలకు మేధావులు, శాస్త్రవేత్తలు, తత్వవేత్తలు, సాహిత్యవేత్తలు ప్రధాన కారకులు. సహజ, కృతక భాషలు రెండూ సమాజాభివృద్ధికి అవసరమే. రెండు భాషలూ ప్రజల భాషలే. సహజ, కృతక భాషల్ని అంశీభూతాలుగా ఉన్న వ్యవస్థగా మాత్రమే భాషను అర్థం చేసుకోవాలి. అంతేగాని, కేవలం వ్యవహారిక భాషమాత్రమే ప్రజలభాషగా అర్థం చేసుకోవడం అశాస్త్రీయం. ఒక భాష అభివృద్ధి చెందడం, సుస్థిరంగా ఉండడం అంటే ఎంతమంది ఆ భాషలో మాట్లాడుతున్నారన్నది ప్రమాణం కాదు. ఒక భాషలోని సహజ భాష, కృతక భాష అంశీభూతాలు ఏ మేరకు తగురీతిలో అభివృద్ధి చెందాయన్నది అసలు విషయం. ఒక భాషలోని ఈ రెండు అంశీభూతాల సంతులిత అభివృద్ధి కుంటుపడితే అది గిడసబారి, జీవ లక్షణం కోల్పోయి ప్రజల సాంస్కృతిక, వైజ్ఞానిక అవసరాలను తీర్చడంలో నిరుపయోగ మవుతుంది. దాంతో క్రమంగా అది పరాయికరణ పొంది, అంతరించే దిశగా ప్రయాణిస్తుంది లేదా అవశేషంగా కొనసాగుతుంది. ఈ పరిస్థితి సదరు భాషాజాతీయుల అస్తిత్వాన్ని అంతర్ధానం చేస్తుంది. ఈ నేపథ్యంలో భాషోద్యమకారులు తెలుగు భాష అంతరిస్తుందని ఆందోళన చెందడం సమంజసమే. ఇప్పటికే ఆక్రమం ఆందోళనకరస్థాయి చేరుకుంది. తెలుగు పత్రికల, సాహిత్య పాఠకులసంఖ్య పెరుగుతున్నా మీడియాలో తెలుగుభాష దుస్థితిచూస్తే తెలుగు అంతరించిపోవడానికి అద్దం పడుతుంది.

తెలుగు సాహిత్యంలో ప్రబలంగా కొనసాగుతున్న అస్తిత్వవాద ఉద్యమ శ్రేణులు కవిత్వంలోకి, కాల్పనిక సాహిత్యంలోకి అనేక ప్రాంత, వృత్తి, కుల మాండలికాలను తీసుకువచ్చి, భాషను సుసంపన్నం చేసారన్న వాదనా ఉంది. అట్టడుగు వృత్తి శ్రేణుల నుంచి కాక, ఉన్నత మధ్యతరగతి ఉద్యోగ శ్రేణుల నుంచి వచ్చిన అస్తిత్వవాద రచయితలు వివిధ మాండలికాల్ని ఇంగ్లీషు భాషా భేషజంతో కలిపిన పదజాలాన్ని వినియోగించారు. తెలుగు భాష పట్ల అభిమానంతో గాని, అభివృద్ధి లక్ష్యంతోగాని రచనలు చేయలేదు. దానికితోడు చాలమంది అస్తిత్వవాద రచయితలకు తెలుగు భాష కంటే ఆంగ్ల భాష పైనే అభిమానం ఎక్కువ. ‘ఇంగ్లీషు భాష పులిపాల వంటిది, దాన్ని ఈ దేశంలోని దళితులందరూ స్వీకరించాలి. ఇంగ్లీషు పులిపాలు తాగిన వారిలో నూతన స్ఫూర్తిని, తెలివిని పెంచుతుంది’ అని అంబేద్కర్ 1920 ఫిబ్రవరిలో ‘మూక్‌నాయక్’ పత్రికలో ఇచ్చిన పిలుపును చాలామంది అస్తిత్వవాదులు స్థల, కాలాలను పరిగణించకుండా బలంగా విశ్వసించి ప్రచారం చేస్తున్నారు. మహారాష్ట్రకు చెందిన ప్రముఖ విద్యా సంస్కరణవేత్త విష్ణు శాస్త్రి చిప్లుంకర్, మహాదేవ్ గోవింద్ రణడే, గోపాలకృష్ణ గోఖలే, బాల గంగాధర్ తిలక్ వంటి జాతీయోద్యమ నాయకులు సైతం అంగ్ల భాషను ‘పులి పాల’తో పోల్చుతూ, ప్రజలు దాన్ని నేర్చుకోవాలని నొక్కి చెప్పారు. అయితే ఆనాడు జాతీయోద్యమానికి నాయకత్వం వహిస్తున్న గాంధీ బ్రిటిష్ సామ్రాజ్య వాదాన్ని నిరసిస్తూ ఆంగ్ల భాషను ‘సాంస్కృతిక సామ్రాజ్యవాదం’గా అభివర్ణిస్తూ, బాల్యంలో తొలినాళ్ళలో ‘తల్లి భాష’ను నేర్చుకోవడం అంటే బిడ్డకు ‘తల్లి పాలు’ తాగితే కలిగే ఆరోగ్యంతో పోల్చారు. పోలికలన్నీ కుంటివే... ఏదైనా ఒక లోతైన విషయాన్ని లేదా జ్ఞానాన్ని అర్థం చేసుకునేందుకూ పోలికలు సాధనాలు మాత్రమే కానీ, వాటికవే జ్ఞానం కాదు. తల్లి పాలు, పులి పాలు (పోత పాలు) అనే పోలికలు కూడా అంతే. శిశువు శారీరక, మానసిక ఆరోగ్యానికి, వికాసానికి తల్లి పాలు అవసరమైనట్లే, ఆ దశలో చుట్టూతా ఉన్న ప్రపంచానికి సంబంధించిన ప్రాథమిక జ్ఞానాన్ని ఏర్పరచుకుంటున్న ప్రాథమిక విద్య దశలో తల్లి భాష అంతే కీలకమైనది. మనిషి తల్లి పాలు అవసరంలేని తర్వాతి దశలో ఎలాగైతే పోతపాలు (పులి పాలు) శారీరక ధృఢత్వానికి సహకరిస్తాయో అలాగే ఇంగ్లీషు తదితర భాషలు వంటబడతాయి. తల్లిపాలు, పులి పాలు వంటి భావనలు రెండూ వివిధ సందర్భాలను బట్టి సరైనవే. అయితే భారతీయ సాంఘిక వ్యవస్థలోని సమస్యలకు ‘మృదువైన హిందుత్వ’ దృక్పథంతో పరిష్కారాలను సూచించిన గాంధీకి వ్యతిరేకంగా సమూల సాంఘిక మార్పు కోసం డిమాండ్ చేసిన అంబేద్కర్ స్థానిక మాతృ భాషల నుడికారాల్లోని వర్ణ తత్వాన్ని ధిక్కరించే క్రమంలో అంగ్ల భాషను ప్రోత్సహించారు. అయితే ఆ తర్వాత తల్లి భాషలో విద్యనభ్యసించడం వల్ల మేధో వికాసం ఉంటుందని ప్రపంచవ్యాప్తంగా అనేక విద్యావైజ్ఞానిక ఆవిష్కరణలు, అధ్యయనాలు ధృవీకరిస్తున్నాయి. కత్తి పద్మారావు వంటి కొద్ది మంది దళిత మేధావులు మాత్రమే తల్లిభాష అవసరాన్ని శాస్త్రీయంగా గుర్తించారు. అదీ కాక అసంఖ్యాక మధ్యతరగతి, బడుగు వర్గాల విద్యార్థులు చదువుతున్న ఆంగ్ల మాధ్యమ పాఠశాల చదువులు తల్లి భాషను దెబ్బ తీయగల శక్తిమంతమైనవి కావు. అందువల్ల భాషోద్యమకారులు పడుతున్న ఆవేదన, నివేదనలు అర్థరహితమైనవి, కేవలం గుండెలు బాదుకునే చర్యలు మాత్రమేనని కొందరు ఆంగ్లభాషా సమర్థకుల వాదన. తెలుగు భాష అంతరించిపోతోందని ప్రచారం చేయడం, అందుకు ఉద్యమించడం అనేది ప్రజల ఆకాంక్షలను పక్కదారి పట్టించి తమ ఆధిపత్య స్థానాన్ని సుస్థిరం చేసుకునేందుకు అగ్రవర్ణ మేధావుల, సీమాంధ్ర పాలక మేధావుల కుట్ర అనే ఆరోపణలు ముందుకొచ్చాయి. దానికి తోడు ఉపాధి కోసం ఆంగ్ల మాధ్యమంలో చదవవలసిన అవసరాన్ని భాషోద్యమకారులు గుర్తించకపోవడం శోచనీయం అనే విమర్శలు వచ్చాయి. భాషోద్యమకారులు, అభిమానులు – తల్లిభాష అవసరాన్ని శాస్త్రీయంగా కాక ప్రధానంగా భావోద్వేగంతో చేసిన విశ్లేషణ విమర్శకుల వాదనను పూర్వపక్షం చేయలేకపోయింది. తల్లిభాషా మాధ్యమ అవసరాన్ని ప్రజల్లోకి తీసుకెళ్ళడంలో భాషోద్యమం సఫలం కాకపోవడం దురదృష్టకరం.

సామాజికాభివృద్ధితో తెలుగు భాషాభివృద్ధి ముడిపడి ఉంటుంది. అందుకు అనుగుణంగా సహజ, కృతక భాషల అభివృద్ధికి దోహదం చేసే భాషా విధానం కోసం ఉద్యమించాల్సిన అవసరం ఉంది. అందుకు భిన్నంగా వాడుకలో లేని తెలుగు పదాలను వివిధ భాషా అవసరాలకు వినియోగించే పరభాషా పదాలకు ప్రత్యామ్నాయంగా వినియోగించేందుకు జరిగే ప్రయత్నాలు, అలాంటి డిమాండు మౌలిక పరిష్కారం కాదు. అదే సమయంలో తెలుగు భాషకు సంబంధించి స్వయం ప్రతిపత్తి కలిగిన ఒక అత్యున్నత వ్యవస్థను ఏర్పరచి, భాషా వ్యవహారాలను పరిష్కరించేందుకు, ఆధునిక అవసరాలకు అనుగుణంగా కొత్త పరిభాషను సూచించేందుకు, మాండలికాలతో సహా తెలుగు పదజాల నిఘంటువును తయారు చేసే ప్రయత్నం కూడా తెలుగు భాషాజాతి భాషాసమస్యను మౌలికంగా పరిష్కరించలేదు. భాషలోని వివిధ మాండలికాల మధ్య అంతర్గత ప్రజాస్వామ్యం పునాదిగా వివిధ ప్రపంచ భాషల నుంచి ఆదాన ప్రదానాలు చేపట్టే విధమైన తెలుగు భాషా విధానం అమలులోకి రావాలి. అందుకు అనుగుణమైన సామాజిక, రాజకీయార్థిక విధానాన్ని అమలు చేసే పాలకులతో కూడిన సామాజిక వ్యవస్థ తప్పనిసరి. కుల, వర్గ, ప్రాంత, లింగ అస్తిత్వాలకు అతీతంగా తెలుగు భాషోద్యమం వికసించాలి. ఇందుకు కేవలం భావోద్వేగం మాత్రమే చాలదు.

**రచయిత ఫోన్ : 09441829339**

- డి.పి.అనూరాధ

# తొలి శతాబ్దాల్లో తెలుగువాడు

ప్రపంచంలో అత్యంత సుందరమైన పురుష విగ్రహం అంటే ఇటలీలోని డేవిడ్‌ను పేర్కొంటారు. మైఖేలాంజెలో చెక్కిన ఈ డేవిడ్ విగ్రహం ఫ్లోరెన్స్‌లో ఉంది.

అందమైన స్త్రీ అనగానే మోనాలిసా గుర్తుకువస్తుంది. లియోనార్డో డావిన్సీ చిత్రించిన ఈ పెయింటింగ్ ఇప్పటికీ కూడా ఎందరినో ఆకట్టుకుంటూనే ఉంటుంది.

కానీ డేవిడ్‌ను మించిన శిల్పాలను మన తెలుగు వాళ్లు సృష్టించారు.. మోనాలిసా లాంటి చిత్తరువులు ఎన్నో అజంతా చీకటి గుహల్లో మగ్గిపోతున్నాయి.. ఇవన్నీ క్రీస్తు శకం తొలినాళ్లకు చెందినవి.. ఈనాటిలా ఆనాడు ఇంటర్నెట్ లేదు.

పోనీ మైఖేలాంజెలో.. లియోనార్డో కాలాల్లోని గ్రంథాలు..శాస్త్రాలు లేని సమయం అది.. మరి వాళ్లకు ప్రేరణ ఎక్కడిది? ఆనాటి సమాజమే వారి కళలకు.. ఊహలకు ఊపిరిపోసి ఉండాలి.. తమ చుట్టూ ఉన్న పౌరులే వారి కళ్లల్లో రూపుదిద్దుకుని ఉండాలి.

మన పూర్వీకులు రాళ్లను శిల్పాలుగా మార్చారు. రాతి గోడల మీద చిత్రాలను వేశారు. ఇవి కేవలం శిల్పాలు కాదు, కేవలం చిత్రాలు కాదు.. కరకు రాతి గోడల మీద కవిత్వాలు.. కథలు అంతేకాదు ఎన్నో పెద్ద పెద్ద గ్రంథాల ఆవిష్కరణే జరిగింది. మనసుపెట్టి చూడాలే కానీ ఆనాటి సమాజానికి సంబంధించి ఎన్నో కథలు చూపిస్తాయి. ఈ చిత్రాలు.. శిల్పాలు.. ఈ గ్రంథాల ద్వారా ఆనాటి మన తాతముత్తాతలని.. జేజమ్మలని పోల్చుకుందాం..





## స్త్రీపురుషుల తారతమ్యం లేదు :

శాతవాహనుల కాలంలో పర్వతాలను తొలిచి పెద్ద పెద్ద రాతి గుహలను బౌద్ధభిక్షువులు నిర్మించారు.. అటువంటి రాతి గుహల్లో ముఖ్యమైనవి మహారాష్ట్రలోని కార్లె గుహాలయాలు.. ఇక్కడి ప్రధాన చైత్యం భారతదేశంలోనే అతి పెద్దది.

ఈ చైత్యం వెలుపల ఉన్నటువంటి స్త్రీపురుషుల నిలువెత్తు జంట శిల్పాలు కళ్లను కట్టిపడేస్తాయి. ఆనాటి స్త్రీపురుషులు చక్కటి శారీరక దారుఢ్యంతో ఉన్నట్టుగా అన్పిస్తుంది. ఆనాడు సమాజంలో స్త్రీపురుషుల మధ్య తారతమ్యాలు లేనట్టున్నాయి. పురుషులు భుజం మీద చేయివేస్తే.. స్త్రీ కూడా భుజం మీదే చేయివేసింది.. పురుషుడు నడుమ్మీద చేయివేస్తే.. స్త్రీ కూడా నడుమ్మీదే చేయివేసినట్టుగా ఈ శిల్పాలు కనువిందుచేస్తాయి.. ఇద్దరూ అన్నిట్లో సమఉజ్జీలుగా అన్పిస్తారు. పురుషుడి ముందు స్త్రీ అణిగిమణిగి ఉండాలనే భావం ఆనాటి సమాజంలో ఇంకా ఏర్పడినట్టులేదు..

ఇక అలంకరణ విషయానికొస్తే స్త్రీలు ఆనాడు పెద్ద పెద్ద పాపిటి బిళ్లలు.. చెవులకు జూకాలు.. కొన్ని చోట్ల రింగులు.. మెడలో హారం.. చేతికి గాజులు.. కాళ్లకు కడియాలు పెట్టుకునేవారని తెలుస్తోంది. పురుషులకు తలపాగా ఉంది, పంచెకట్టుకున్నారు. ముంజేతికి కంకణాలు ఉన్నాయి.. కొన్ని జంట శిల్పాలు ఉల్లాసంగా ఉంటే.. కొన్ని బుద్ధుడి ప్రార్థనలో ఉన్నట్టు కన్పిస్తున్నాయి.

2వేల ఏళ్ల కంటే ఎక్కువ వయసు గల ఈ శిల్పాల్లో కొన్ని ఖండితమయ్యాయి. కార్లెలో ఏనుగుల శిల్పాలు కూడా ఆఫ్రికన్ ఏనుగుల్లా చాలా పెద్దగా అన్పిస్తున్నాయి.

## అమరావతి అద్భుతాలు :

కార్లె తరవాత అమరావతి శిల్పాలు రూపుదిద్దుకున్నాయి. అయితే అమరావతిలో రాతిఫలకాలపై శిల్పాలను తొలిచారు.. కార్లెలో రాతి కొండలనే శిల్పాలుగా మలచారు. అమరావతి శిల్పంలో కూడా పురుషుల

వేషధారణ కార్లె శిల్పాలతో సరితూగుతోంది. స్త్రీమూర్తుల విషయానికి వస్తే.. నాజూకుతనాన్ని పుచ్చుకున్నాయి. ప్రతి ఒక్కరి తలకట్టూ భిన్నంగా ఉంది. కొందరు కొప్పు కట్టుకొన్నారు. కొందరు అలాగే విడిచిపెట్టారు. మరికొందరు మొఖంపైకి కొప్పువచ్చేలా నిగను అలంకరించుకొన్నారు.. కాళ్లు కడియాల సంఖ్య కార్లెతో పోలిస్తే పెరిగిపోయింది. ఆనాడు కూర్చోవడానికి రకరకాలు ఉన్నట్టుగా ఈ శిల్పాలను చూస్తే తెలుస్తోంది. అలాగే వీరు తమతోపాటు తమ జంతువులను కూడా అలంకరించారు. గుర్రాలను.. ఏనుగులను.. చక్కటి పూసల దండలతో అలంకరించే వారని అమరావతి రాతి ఫలకాలను విశ్లేషిస్తే అర్థం అవుతోంది.




1. మృగయులు 'ఛద్దంతు'ని (బోధి సత్వుని) పట్టుకొనబూనుట, అజంటా, పదవ గుహ. 2. దంతములనుచూచి రాణి మూర్ఛిల్లుట, అజంటా, పదవగుహ.

మన పూర్వీకుల ఇళ్లు ఎలా ఉండేవి? ఆనాటి సమాజం ఎలా ఉండేది? ఈ వివరాలను అమరావతి స్థూపంలో దొరికిన ఈ శిల్పఫలకం అందిస్తోంది. ఈ శిల్పఫలకం కోల్‌కత్తా లోని ఇండియన్ మ్యూజియంలో భద్రపరచారు. ఇందులో ఓ భార్యాభర్తా తమకు పుట్టిన కవల పిల్లల్ని పొత్తిళ్లలో పొదిగి పట్టుకుని ఉన్నారు. తమ పాపాయిలని వస్త్రాలలో చుట్టగా, మిగిలిన వస్త్రం చేతుల మధ్యలోంచి కిందకు జారుతోంది. మరో చోట ఓ భార్య తన భర్త భోజనం చేస్తుంటే, ఎదురుగా కూర్చుని విసనకర్ర విసురుతోంది. ఇందులో ఇద్దరు పిల్లలు కూడా ఉన్నారు. ఆనాటి ఇళ్లు కూడా ఈ శిల్పంలో కన్పిస్తున్నాయి. రెండూ గుడిసెల్లాగానే ఉన్నాయి. గడ్డితో కప్పువేశారు. ఒక కప్పేమో త్రిభుజాకారంలో ఉంటే, మరొకటి అర్ధచంద్రాకారంలో ఉంది. ఓ వ్యాపారి గుర్రం మీద ఎక్కడికో బయల్దేరి వెళుతున్నాడు.

## సాంచి ద్వారతోరణం :

మధ్యప్రదేశ్‌లోని సాంచి స్థూపానికి ద్వారతోరణాలను శాతవాహన శిల్పులే నిర్మించారన్నది చరిత్ర తేల్చిన సత్యం. ఒక్కొక్క ద్వారం 34 అడుగుల ఎత్తు ఉంటుంది. ఈ ద్వారాల మీది శిల్పాలు కూడా ఆనాటి సమాజాన్ని విశదంగా కళ్లముందు ఉంచుతాయి. ఉత్తర ద్వారంలోని ఓ శిల్పఫలకాన్ని పరిశీలిద్దాం. తమ గుడిసె ముందు ఓ భార్యా భర్తా చలిమంట కాచుకుంటున్నారు. ఓ పిల్లాడు గుర్రానికి గడ్డి తినిపిస్తున్నాడు. మరో ఇంటి ముందేమో భార్యాభర్తలిద్దరూ పిచ్చాపాటీ మాట్లాడుకుంటూ ఉన్నారు. ఓ మహిళేమో నెత్తిమీద పళ్ల గంపను పెట్టుకుని బయల్దేరింది. ఇద్దరు వ్యాపారులు భరణాన్ని ఇచ్చిపుచ్చుకుంటున్నారు. కొంతమంది గుర్రాల మీద వెళుతుంటే మరికొంత మంది ఏనుగుల మీద ఎక్కి ఎక్కడికో వెళుతున్నారు. ఇవన్నీ జాతక కథల ఆధారంగా రూపొందించిన శిల్పాలే.

## అజంతాచిత్రాలు :

ఇక అజంతా చిత్రాలలో మన వాళ్ల గురించి తెలుసుకుందాం. అజంతాలోని 9,10 గుహలు తొలినాటివి.. వీటిని శాతవాహనుల కాలంలో తొలిచారు. చిత్రాలను వేశారు, శిల్పాలు చెక్కారు.. ఈ గుహల బయట ఉన్న శిల్పాలతో అమరావతి శిల్పాన్ని పోల్చుకోవచ్చు. పూర్ణకుంభాలు కూడా ఇక్కడ కన్పిస్తాయి.. గుహలోపల పెయింటింగ్‌లు కాలం పెట్టిన పరీక్షలో క్రమంగా ఓడిపోతున్నాయి.. ఇవి గుర్తించడానికి వీలు లేకుండా ఛిద్రమవుతున్నాయి. కానీ ఈ పెయింటింగ్‌ల రెప్లికాలు హైదరాబాద్‌లోని స్టేట్ మ్యూజియంలో ఉన్నాయి. వీటిని చూసి ఆనాటి మన పూర్వీకులను పోల్చుకోవచ్చు. పురుషులందరూ తలపాగాలు పెట్టుకున్నారు. రాజులు కాకుండా సామాన్య పురుషులు పైన చొక్కాల్లాంటివి ధరించడం విశేషం. వీరు నడుము చుట్టూ కండువాలను కట్టుకున్నారు. రాజులు కంఠాభరణాలను వేసుకున్నారు.

స్త్రీలేమో రకరకాల తలకట్టులు.. నగలు.. కంకణాలు.. కడియాలు.. చక్కటి అలంకరణకు ప్రసిద్ధిచెందిన వారిలో కన్పిస్తున్నారు. రాజులు కూర్చునే ఆసనాలు, రాణులు కూర్చునే ఆసనాల డిజైనింగ్ వేరుగా ఉంది. విసనకర్రల్లో కూడా విభిన్నత కన్పిస్తోంది.

ఇలా ఈ శిల్పాలను.. చిత్రాలను విశ్లేషిస్తే మన పూర్వీకులది వ్యవసాయ ప్రధానమైన సమాజం, వర్తకానికి ప్రాధాన్యం ఇచ్చారు.. కళాకారులకూ కొదవలేదు. అన్ని వృత్తుల వాళ్లూ సామరస్యంగా సహజీవనం సాగిస్తున్నట్టు అర్థమవుతోంది. ఆనాటి మన తాత ముత్తాతల జీవన విధానం గురించి లోతుగా అధ్యయనం చేయవలసిన అవసరం ఎంతైనా ఉంది.

**రచయిత ఫోన్ : 09441829339**

# సొసైటీ ఫర్ ప్రమోషన్ ఆఫ్ అడల్ట్ కంటిన్యూయింగ్ ఎడ్యుకేషన్
# (SPACE)

1-8-4/డి, రవీంద్రనగర్ కాలనీ, 8వ వీధి, హబ్సిగుడా, హైదరాబాదు-500007, తెలంగాణ రాష్ట్రం.

ఫోన్లు : 040-27159911, 27159996

ఆంధ్రమహిళాసభ ప్రోత్సాహంతో స్థాపింపబడిన స్వతంత్ర ప్రతిపత్తి గల రిజిష్టర్డు సొసైటీ - సొసైటీ ఫర్ ప్రమోషన్ ఆఫ్ అడల్ట్ కంటిన్యూయింగ్ ఎడ్యుకేషన్ (స్పేస్) హైదరాబాదులోని రాష్ట్ర వయోజన విద్యావనరుల కేంద్ర నిర్వహణను భారత ప్రభుత్వం 'స్పేస్'కు అప్పగించింది. ఈ ప్రకారం కేంద్ర ప్రభుత్వ ఆర్థిక సహాయంతో హైదరాబాదులోని రాష్ట్ర వయోజన విద్యావనరుల కేంద్రాన్ని 'స్పేస్' నిర్వహిస్తున్నది. 'స్పేస్' లక్ష్యాలు-అక్షరాస్యతను, నిరంతరవిద్యను పెంపొందించే క్షేత్రస్థాయి కార్యక్రమాలెన్నో కలిగివున్నాయి. అక్షరాస్యత, నిరంతర విద్యకు సంబంధించిన విద్యావనరుల అభివృద్ధి, క్షేత్ర కార్యక్రమాల నిర్వహణ వ్యవస్థల శిక్షణ మొదలైనవి 'స్పేస్' సంస్థ ప్రధాన లక్ష్యాలు.

* అక్షరాస్యత, నిరంతర విద్యల ఆవశ్యకత ప్రచారం.
* నాణ్యవంతమైన, సమర్థవంతమైన అక్షరాస్యత, నిరంతర విద్యాకార్యక్రమాల అమలుకు దోహదం చేయడం.
* కార్యకర్తలకు శిక్షణను ఇవ్వడం.
* మారుతున్న సామాజిక అవసరాలకు తగ్గవిధంగా అక్షరాస్యత, నిరంతర విద్యా ఏజెన్సీలు,గ్రూపులతో సమన్వయం, సహకారం.
* అక్షరాస్యతారంగంలో ఒక సమన్వయ కేంద్రం (నోడల్ ఏజెన్సీ)గా పనిచేయడం.
* అక్షరాస్యత, నిరంతర విద్యారంగంలో ఒక సలహాకేంద్రంగా వ్యవహరించడం.
* అక్షరాస్యత, నిరంతర విద్యల రంగంలో 'పరిశోధన-అభివృద్ధి' విషయాల్లో క్రియాశీలపాత్రను నిర్వహించడం.

| **డా॥ సామల రమేష్‌బాబు** | **ఆచార్య పి. పూర్ణచంద్రరావు** |
| --- | --- |
| అధ్యక్షులు | కార్యదర్శి |

# స్టేట్ రిసోర్స్ సెంటర్ ఫర్ అడల్ట్ & కంటిన్యూయింగ్ ఎడ్యుకేషన్ (SRC)

ఫోన్లు : 040–27097129, 27090029

## సాక్షర భారత్ ఆహ్వానం

* భారత ప్రభుత్వం 2009 సెప్టెంబరు 8వ తేదీన అంతర్జాతీయ అక్షరాస్యతాదినం సందర్భంగా "సాక్షర భారత్" పథకాన్ని ఆవిష్కరించింది.
* 2012 నాటికి 15 సంవత్సరములకు పైబడిన మహిళలలో అక్షరాస్యతను పెంచి, అక్షరాస్యతలో స్త్రీ పురుష భేదాలను (కనీసం 10%) ప్రాంతీయ, వర్గాల భేదాలను తగ్గించడం ఈ సాక్షర భారత్ మిషన్ 2012 ప్రధాన ఉద్దేశ్యం.

**లక్ష్యాలు :**

* 2010 నాటికి ఆరుకోట్లమంది స్త్రీలకు, ఒకకోటిమంది పురుషులకు ప్రయోజన అక్షరాస్యత అందించడం సాక్షర భారత్ ప్రధాన లక్ష్యం. వీరిలో ఎస్.సి., ఎస్.టి. కులాలకు, ముస్లిం మైనారిటీలకు, ఇతరులకు ప్రత్యేకంగా నిర్దేశితమైన కేటాయింపుల ద్వారా లక్ష్యసాధన జరుగుతుంది.
* అక్షరాస్యతానంతరం చదువును కొనసాగించి పాఠశాల స్థాయితో సమానమైన స్థాయి గల ప్రాథమిక విద్యను నేర్చుకోవాలనుకునే ఒక కోటీ యాభైలక్షలమందివయోజనులకు విద్యావకాశాలను కల్పించడం మరొక లక్ష్యం.
* వృత్తి విద్యానైపుణ్యాలను సంపాదించి తద్వారా ఆర్థికాభివృద్ధి సాధించాలనుకునే ఒక కోటీ యాభైలక్షలమంది వయోజనులకు వృత్తి శిక్షణా కార్యక్రమాలను నిర్వహించడం మరొక లక్ష్యం.

**మహిళలకు ప్రాధాన్యత :**

* "సాక్షర భారత్ మిషన్ 2012" కార్యక్రమంలో మహిళలే ప్రధాన లబ్దిదారులు. ఈ కార్యక్రమం మొత్తం మహిళా ప్రాధాన్యతాయుతంగా రూపొందించబడింది. మహిళల అక్షరాస్యతా శాతం 50 కన్నా దిగువన గల 365 జిల్లాలలో ఈ కార్యక్రమం ప్రధానంగా నిర్వహింపబడుతుంది. మనరాష్ట్రంలో ఈ కార్యక్రమం 18 జిల్లాలలో అమలు చేయబడుతుంది.

**పంచాయితీరాజ్ సంస్థల ద్వారా, స్వచ్ఛంద కార్యకర్తలచే అమలు :**

* పంచాయితీరాజ్ వ్యవస్థకు చెందిన సంస్థల ద్వారా ముఖ్యంగా గ్రామ పంచాయితీ ద్వారా అమలుచేయడం సాక్షర భారత్ ప్రత్యేకత. సమాజంలోని అన్ని వర్గాలను, ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలను, స్వయం సహాయక సంఘాలను ఈ ప్రజా ఉద్యమంలో భాగస్వాములుగా చేసి కార్యక్రమం అమలు జరుపుతారు. సాక్షర భారత్ కార్యక్రమం స్వచ్ఛంద కార్యకర్తల ద్వారా నడుపబడుతుంది. సేవాభావం, పట్టుదల గల స్వచ్ఛంద కార్యకర్తలే సాక్షర భారత్ కార్యక్రమాన్ని నడిపే రథసారథులు.

సాక్షర భారత్ లక్ష్యాలు సాకారమై మనదేశం "సాక్షర భారతం" కావాలంటే మనందరం స్వచ్ఛందంగా ముందుకు రావాలి. మనవంతు సహకారం అందించాలి. అక్షరాస్యతకు కృషిచేస్తే అక్షరం నిలుస్తుంది. మన భాష, మన సంస్కృతి నిలుస్తుంది. మన జాతి గౌరవం పెరుగుతుంది. అందరూ బాగుంటారు.

**వాడవాడలా పల్లెపల్లెలా విద్యావంతులు రారండీ !**

**సాక్షర భారత నిర్మాణానికి నడుంకట్టి అడుగేయండీ !**

**ఆచార్య డా॥ రమేష్ ఘంటా**
ఛైర్మన్

**డా॥ పి.వి. సుబ్బారెడ్డి**
డైరెక్టర్

# దూరవిద్యాకేంద్రం

# ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయం




నాగార్జుననగర్ - 522 510, గుంటూరు - ఆంధ్రప్రదేశ్
website : www. anucde.com, www.anucde.ac.in

## అందిస్తున్న కోర్సులు

### ఎం.ఎస్సీ. కోర్సులు

- బోటనీ
- జువాలజి
- ఫిజిక్స్
- కెమిస్ట్రి
- మైక్రోబయాలజి
- మేత్‌మేటిక్స్
- ఇన్ఫర్మేషన్ టెక్నాలజి
- కంప్యూటర్స్
- సైకాలజి
- స్టాటిస్టిక్స్
- ఫుడ్ & న్యూట్రిషన్
- బయో ఇన్ఫర్మేటిక్స్

### ఎం.ఏ. కోర్సులు

- తెలుగు
- ఇంగ్లీషు
- ఎకనామిక్స్
- హిస్టరి
- పొలిటికల్ సైన్సు
- సోషియాలజి
- సోషల్‌వర్క్
- జర్నలిజమ్
- హిందీ
- ఎం.కాం.
- ఎం.హెచ్.ఆర్.ఎం.

### ప్రొఫెషనల్ కోర్సులు

- ఎం.సి.ఎ.
- ఎం.బి.ఎ. (మూడు సం. డ్యూయల్ స్పెక్‌తో)
- ఎం.బి.ఎ. (మార్కెటింగ్)
- ఎం.బి.ఎ. (ఫైనాన్స్)
- ఎం.బి.ఎ. (హెచ్. ఆర్. ఎమ్)
- ఎం.బి.ఎ. (బ్యాంకింగ్ ఇన్సూరెన్స్ మేనేజిమెంట్)
- ఎం.బి.ఎ. (హాస్పిటల్ ఎడ్మినిస్ట్రేషన్)
- మాష్టర్ ఆఫ్ బిజినెస్ ఎకనామిక్స్
- L.L.M.(లేబర్ లాస్)
- L.L.M.(కాన్సిట్యూషనల్ లా& ఎడ్మినిస్ట్రేటివ్ లా)
- L.L.M.(టార్ట్స్ & క్రైమ్స్)
- L.L.M.(కార్పొరేట్ & సెక్యూరిటీస్-లా)
- **బి.ఎల్.ఐ.ఎస్సీ**

**పి.జి. డిప్లమా కోర్సులు**

(మేనేజిమెంట్, బయోటెక్నాలజి) బయో-ఇన్ఫర్మేటిక్స్ ఐ.టి., హోటల్ మేనేజిమెంట్, కంప్యూటర్ అప్లికేషన్స్, జర్నలిజమ్& మాస్ కమ్యూనికేషన్

### యుజి కోర్సులు

- బి.ఎ. (ఎకనామిక్స్, హిస్టరి, పొలిటిక్స్, సోషియాలజి, పబ్లిక్ ఎడ్మినిస్ట్రేషన్ స్పెషల్ తెలుగు, స్పెషల్ ఇంగ్లీషు, మేత్స్, స్టాటిస్టిక్స్, కంప్యూటర్ అప్లికేషన్స్ కాంబినేషన్స్)
- బి.కాం. (జనరల్, కంప్యూటర్ అప్లికేషన్స్)
- బి.ఎస్సీ (ఎం.పి.సి, బి.జడ్.సి., ఎం.ఎస్.సిఎస్, ఎం.పిసిఎస్, ఎం.ఇ.సి.ఎస్, ఎం.పి.ఇ, ఇన్ఫర్మేషన్ టెక్నాలజి, సిడి & ఎఫ్‌టి)
- బి.బి.ఎమ్. బిహెచ్.ఎమ్.
- డిప్లొమా ఇన్ ఫుడ్ ప్రొడక్షన్

సర్టిఫికెట్ కోర్సులు :

- హెచ్.ఐ.వి/ఎయిడ్స్ కౌన్సిలింగ్
- హోటల్ & హాస్పిటల్ హౌస్‌కీపింగ్

ఫోన్: 0863 - 2293299, 2293356, 2346222, 207, 208, సెల్ నెం : 9848285518, 9490820973, 9490820974, **E-mail: info@anucde.ac.in**

వారసత్వ సంపద

– సంకేపల్లి నాగేంద్రశర్మ

# కరీంనగర్ జిల్లాలో చారిత్రక గుట్టల విధ్వంసం

## తెలంగాణా ఆవిర్భావం తర్వాత పెరిగిన గ్రానైట్ మాఫియా ఆగడాలు

**తొలి** శాతవాహనరాజులకు రాజధానియైన కోటిలింగాల భూగర్భనగరం, వేములవాడ చాళుక్యుల రాజధానియైన వేములవాడ, కాకతీయ రాజుల వైభవం, చారిత్రాత్మకమైన బొమ్మలమ్మగుట్ట, నిజాం రాజుల కాలంలో జిల్లా కేంద్రంగా వెలుగు వెలిగిన ఎలగందుల ఖిల్లా, అడవుల్లో నెలకొన్న పౌరాణేతిహాస రామగిరి ఖిల్లాలు, వేములవాడ, ధర్మపురి, కాళేశ్వరం, కొండగట్టు వంటి దివ్యక్షేత్రాలు, విస్తారమైన గోదావరి పరీవాహక ప్రాంతం కలిగిన కరీంనగర్ జిల్లా రూపురేఖలు మారిపోతున్నాయి. ఈ జిల్లాలోని ప్రకృతి రమణీయమైన కొండలు, గుట్టలు గత పది పన్నెండేళ్ల కింద నుండి జాడాపత్తా లేకుండా పోతున్నాయి. తెలంగాణా నూతన రాష్ట్రా విర్భావం జరిగాక కూడా, అదుపు లోకి రావాల్సిన గ్రానైట్ మాఫియా ఆగడాలు, భిన్నంగా మరింతగా పెరిగి పోయి పలు చారిత్రాత్మకమైన గుట్టల విధ్వంసం కొన సాగుతూనే వుంది. పర్యావరణ పరిరక్షణకు, ప్రస్తుతం వున్న నిబంధనల మేరకు చర్యలు తీసుకోవాల్సిన అధికార యంత్రాంగం అన్ని చట్టాలను, నిబంధనలకు పక్కన బెట్టి గ్రానైట్ మాఫియా ఆగడాలకు వంతపాడుతున్నది. మే 2013లో 17 గుట్టల విధ్వంసానికి అనుమతులిచ్చిన జిల్లా కలెక్టర్ మరిన్ని గుట్టలను గ్రానైట్ అనుమతులివ్వడానికి రంగం సిద్ధమైనట్లు తెలిసింది. ప్రస్తుతం ఒక్క కరీంనగర్ జిల్లాలోనే సుమారు ఆరువందల గుట్టలు గ్రానైట్ మాఫియా చేతుల్లో విధ్వంసానికి గురవుతున్నాయని, కరీంనగర్ జిల్లాలోని రైల్వేస్టేషన్లన్నీ ఈ గ్రానైట్ రాళ్ళను మద్రాస్, కాకినాడ, కృష్ణపట్నం వంటి సముద్ర నౌకాశ్రయాల కేంద్రాలకు తరలిస్తూ అధిక ఆదాయాన్ని పొందుతున్నాయని పర్యావరణవేత్తలు ఆరోపిస్తున్నారు. ఇటీవల జరిగిన జడ్పీ సమావేశంలో జడ్పిటీసీలు గుట్టల విధ్వంసం గూర్చి విస్తృతమైన చర్చ లేవదీసినా ఫలితం మాత్రం శూన్యం. ఇంతేకాక ప్రతినిత్యం వందలాది గ్రానైట్ రాళ్ళ ట్రక్కులు యథేచ్ఛగా తిరుగుతూ, గ్రానైట్ రాళ్లను సముద్ర నౌకా తీరాలకు చేర్చుతున్నాయి. జిల్లాలోని రోడ్లు, వంతెనలన్నీ గ్రానైట్ ట్రక్కుల రవాణావల్ల శిధిలమైపోతున్నాయి. చైనా, మలేషియా, హాంకాంగ్, థాయ్‌లాండ్, జపాన్ వంటి సుదూర దేశాలకు ఈప్రాంతంలోని రాళ్ళు ఎగుమతి అవుతున్నాయి. రంగుగ్రానైట్ రాళ్ళకు, నల్లరాళ్ళకు విదేశాలలో విపరీతమైన మార్కెటింగ్ పెరిగిపోవడంతో తెలంగాణా ప్రాంతంలోని గుట్టలన్నీ కరిగి పోతున్నాయి. అందులో చారిత్రాత్మకమైన గుట్టలు దెబ్బతింటున్నాయి. రాబోయే కాలంలో తెలంగాణాలో రోడ్లు వేయడానికి, ఇళ్ళుకట్టుకోవడానికి, రైల్వే లైన్లు వేయడానికి కంకర, బండరాళ్ళు దొరికే అవకాశం మృగ్యమైపోతున్నది. నూతనంగా వచ్చిన తెలంగాణా ప్రభుత్వ సారథి కెసిఆర్ గారు, చెరువులు మరమ్మత్తులు, చెరువుల పరిరక్షణ పేరిట కాకతీయ మిషన్, ప్రతి గ్రామానికి మంచినీరు అందించే వాటర్ గ్రిడ్ పథకాలను సుమారు యాభై వేల కోట్ల రూపాయలతో ప్రారంభించారు. ఇందుకు పెద్ద ఎత్తున సన్నాహాలు జరుగుతున్నాయి. కాకతీయులు చెరువులను గుట్టల జాలు ఆధారంగా కట్టిన విషయాన్ని ఎవ్వరు కాదన లేరు. తెలంగాణా ప్రాంతం లోని గుట్టల జాలుతోనే చెరువులు నిండుతాయన్నది కాదనలేని సత్యం. వరంగల్ జిల్లాలోని లక్నవరం, భద్రకాళి, పాకాల, ధర్మసాగరం, రామప్ప చెరువులు గుట్టల మధ్యే నిర్మించబడ్డాయి. తెలంగాణా ప్రాంతంలోని గుట్టలన్నీ ఎడాపెడా మట్టుబెట్టుకుంటూ పోతే, ఈప్రాంతం త్వరలోనే భూకంపాల జోనులోకి చేరిపోగలదని నిపుణులు ఆందోళన చెందుతున్నారు. ఈ వ్యాసం రాస్తున్న సమయంలోనే తెలంగాణా ప్రభుత్వం మైనింగ్ అనుమతుల విధానాన్ని మరింత సులభతరం చేస్తూ తాజాగా ఉత్తర్వులు జారీచేసింది. ఆయా మండలాల తాసిల్దార్‌లు, ఆర్‌డివో, కలెక్టర్‌లు నిరభ్యంతర సర్టిఫికేట్లు ఇవ్వవచ్చు, తద్వారా గుట్టల విధ్వంసానికి ఈ జీవో ఊతమిస్తుందని పర్యావరణ వేత్తలు విమర్శిస్తున్నారు. హుస్నాబాద్, హుజూరాబాద్ ప్రాంతంలోని గుట్టల హారాలను దోచుకోవడానికి గ్రానైట్ మాఫియా కన్నుపడటంతో పర్యావరణ వేత్తలు తమ ఆందోళనను వ్యక్తం చేస్తున్నారు. నెలరోజుల కిందట శంకరపట్నం మండలంలో గుట్టల వద్ద జరిగిన పేలుళ్ళలో ముగ్గురు


పొట్లపల్లిలోని ఎల్లమ్మ గుట్ట



బొమ్మలమ్మగుట్టలోని ధ్వంసమైన జైనచక్రేశ్వరి పాదాలు



ప్రాచీన చరిత్ర గుర్తులున్న ఎల్లమ్మగుట్ట వద్ద పరిశోధకులు

క్వారీ కార్మికులు నేలకొరిగిన సంఘటన జిల్లాలో గ్రానైట్ మాఫియా ఆగడాలను వెలికి తెచ్చినట్లయింది. జిల్లాలోని ములంగూర్ ఖిల్లా, హుజూరాబాద్ ప్రాంతంలోని రాకాసిగుండ్లు, ఎలగందుల ఖిల్లా గ్రానైట్ మాఫియా చేతిలో విధ్వంస రచనలో భాగమయ్యాయి. ఎలగందుల ఖిల్లా చుట్టువున్న ఇరవై గుట్టలను గ్రానైట్ కు ఇచ్చిన విషయం తెలిసిందే. సైదాపూర్ మండలంలోని సర్వాయి పాపన్న గుట్టలను, హుస్నాబాద్ ప్రాంతంలోని పొట్లపల్లి ఎల్లమ్మగుట్టలను విధ్వంసం చేయడానికి గ్రానైట్ మాఫియా పెద్ద ఎత్తున ప్రయాత్నాలు సాగిస్తోంది. ఇక్కడి గుట్టలను గ్రానైట్ పరం చేయడానికి ఆర్‌డివోలు, ఇతర రెవిన్యూ, మైనింగ్ అధికారులు ప్రజాభిప్రాయ సేకరణ కోసం పర్యటించి వెళ్లారు. అంతేకాక పొట్లపల్లిలోని ఎల్లమ్మగుట్టలను గ్రానైట్ పర్మిషన్‌కై మైనింగ్ శాఖకు 20కి పైగా అర్జీలు వచ్చినట్లు పత్రికల్లో వార్తలు వచ్చాయి. ఎనిమిది వందల ఎకరాలలో విస్తరించివున్న ఎల్లమ్మగుట్టల విధ్వంసానికి బడాబాబులు తీవ్రంగా తెలంగాణా సర్కార్‌పై వత్తిడి తెస్తున్నట్లు పత్రికల్లో వార్తలు వస్తున్నాయి. ఇక్కడ సుమారు రెండువేల సంవత్సరాల పూర్వంకు చెందిన చరిత్ర దాగి వుందని, ఇక్కడ ఆదిమానవుల బృహత్‌శిలా సమాధులు, ఎల్లమ్మగుట్ట వద్ద బయల్పడిన ఎల్లమ్మ, నాగ విగ్రహాలు వున్నాయని, మరో నాగపట్నమని, ఎల్లమ్మగుట్టపైన అపూర్వ సొరంగం వుందని, ఎందరెందరో విదేశీ చరిత్రకారులు సైతం ఎల్లమ్మగుట్టపైన పరిశోధనలు చేశారని ఈ గుట్ట ప్రాంతాన్ని జనవరి 13న సందర్శించిన పరిశోధకులు జయధీర్ తిరుమలరావు, సూరేపల్లి సుజాత, పర్యావరణ వేత్తలు తోటపల్లి జగన్మోహనరావు, మాదన కుమారస్వామి, మార్వాడి సుదర్శన్ తదితరులు అభిప్రాయపడ్డారు. తెలంగాణా బహుజన పోరాట యోధుడు సర్వాయి పాపన్న 16-17 శతాబ్దాలలో స్థావరంగా ఏర్పరచుకొని, గుట్టపై ఖిల్లాను నిర్మించిన సర్దార్ సర్వాయి పాపన్న గుట్టలను కాపాడాల్సిన ఆవశ్యకత ఎంతైనా వుందని వీరన్నారు. తెలంగాణా ఉద్యమ తొలి పోరాట యోధుడు అనభేరి ప్రభాకరరావు నిజాం సర్కార్ కాలంలో జరిగిన తొలి ఎన్‌కౌంటర్‌లో ఈగుట్టల్లోనే అమరుడయ్యారు. మాజీ ప్రధాని పి.వి. జన్మస్థలమైన భీమదేవరపల్లి ప్రాంతంలోని వంగర ఈ గుట్టల సమీపంలోనే వుంది. ఇంతటి చారిత్రాత్మక ప్రాధాన్యం వున్న పొట్లపల్లి ఎల్లమ్మ, సర్వాయి పాపన్న గుట్టలను పరిరక్షించాలని, గ్రానైట్ మాఫియా ప్రమాదం నుండి కాపాడాలని చరిత్రకారులు కోరుతున్నారు. పాపన్న గుట్టపై గీతకార్మిక సంఘాల నాయకులు నెలకొల్పిన పాపన్న విగ్రహాన్ని ఎవ్వరో పెల్చివేయడం పలు అనుమానాలకు దారితీస్తోంది. అంతేకాక గంగాధర మండలంలోని త్రిభాషాశాసనమైన బొమ్మలమ్మగుట్టపైన జైన చక్రేశ్వరి పాదాలను రెండు సార్లు దుండగులు పెల్చి వేశారు.గత నాలుగేళ్ల కిందట ఈగుట్టను గ్రానైట్ పరం చేయడానికి సర్కార్ అనుమతులివ్వగా చరిత్రకారులు, రచయితలు ఉద్యమించి అడ్డుకున్నారు. అంతేకాక కరీంనగర్ మండలంలోని ఎలగందుల ఖిల్లా గుట్టలను గ్రానైట్ పరం చేయడానికి గుట్టల రాళ్లను సులభంగా రవాణా చేసుకోవడానికి 32కోట్లతో కరీంనగర్ పద్మనగర్ నుండి నాలుగులైన్ల రహదారిని నిర్మించడానికి సన్నాహాలు చేస్తోంది. ఈరహదారి నిర్మాణమైతే సిరిసిల్ల డివిజన్‌లో గుట్టనీటికి విధ్వంసంచేసి గుర్తై, సులభంగా రవాణా చేసుకోవడానికి వీలవుతుంది. జిలాలోని వేములవాడ, సిరిసిల్ల ప్రాంతాలలోని గుట్టలన్నీ విధ్వంస రచనలో భాగమవుతున్నాయి. తెలంగాణా రాష్ట్రం రాకముందు రామప్ప దేవాలయాలు, కుంతల జలపాతం, కవ్వాల్ అభయారణ్యంకు గురికాకుండా ఈ అడవి పరిరక్షణకు ఉద్యమించిన తెలంగాణా చరిత్రకారులు, తెలంగాణా నేతలు మళ్లీ తెలంగాణా సహజ వనరుల పరిరక్షణకై తిరిగి ఉద్యమించాల్సిన సమయం ఆసన్నమైంది. కరీంనగర్ జిల్లాలోని మానేరువంతెన, తంగెళ్లపల్లి, రేణిగుంట వంటి పొడవైన వంతెనలు గ్రానైట్ విపరీతమైన రవాణావల్ల స్తంభాలు కుంగి, ధ్వంసమైపోగా, వాటి స్థానంలో కొత్తవి నిర్మిస్తున్నారు. కోట్ల చెట్ల పెంపకానికి అటవీశాఖామంత్రి జోగురామన్న చర్యలు తీసుకుంటున్నట్లు, అటవీ ఉత్పత్తుల పరిరక్షణకు సాయుధ దళాలను పెడతామని అంటున్న కెసిఆర్ సర్కారు, మరోపక్కన వేలాది చెట్లు, జీవజాలాలున్న గుట్టలను మట్టుపెట్టే గ్రానైట్ మాఫియా చర్యల గూర్చి పట్టించుకోకపోవడం చర్చనీయాంశంగా మారింది. పర్యావరణ వేత్తలపై కేసులు పెట్టి రకరకాల ఇబ్బందులకు గురిచేస్తున్న గ్రానైట్ మాఫియా చేతుల్లోనే సర్కారు నడుస్తున్నట్లు ఆరోపణలు వస్తున్నాయి. మరోపక్క నల్గొండ జిల్లాలోని రాచకొండ గుట్టలను ఫిల్మ్‌సిటీ పేరిట, యాదగిరి గుట్ట ప్రాంతంలోని గుట్టలను దివ్యక్షేత్రం పేరిట మట్టుబెట్టే సన్నాహాలు ఊపందుకున్నాయి. దీని వెనుక రియల్ ఎస్టేట్‌ల మాయాజాలం వున్నట్లు ఆరోపణలు వస్తున్నాయి. మరో పది పన్నెండేళ్లయితే తెలంగాణా ప్రాంతంలోని గుట్టలన్నీ మాయం కావడం ఖాయం.

**రచయిత ఫోన్ : 09441797650**

– సన్నిధానం నరసింహశర్మ

# కడుపు తీపు

**చ**దువతగిన పుస్తకాలు ఎన్నో వుంటాయి... కానీ చదివి తీరవలసిన పుస్తకాలు కొన్నే వుంటాయి. చదివితీరవలసిన వాటిలో వర్తమానకాలానివీ వుంటాయి. అటువంటివాటిలో – ముఖ్యంగా ఖండ కావ్యాలలో వేటూరి ప్రభాకరశాస్త్రి 'కడుపుతీపి' ఒకటి.

తెలుగు సాహిత్యానికి వేయ్యేళ్ళ సేవ చేసిన ప్రక్రియ పద్యకవితా ప్రక్రియ. అన్ని ప్రక్రియల ఫలాలూ అనుభవైకవేద్యాలుగా చేసుకుంటే తెలుగు సాహిత్య వృక్ష శాఖలన్నీ తెలుస్తాయి.

2015 ఫిబ్రవరి 7వ తేదీకి ఓ ప్రత్యేకత వుంది. అది భాషా సాహిత్యాల పరిశోధకుడు, ప్రజావాఙ్మయానికీ కొంత సేవ చేసిన వేటూరి ప్రభాకరశాస్త్రి గారి 127వ జయంతి రోజు. అరవై రెండు సంవత్సరాలే జీవించిన ఆయన అనేక రచనలతోపాటు 'తెలుగు మెఱుగులు' పొత్తమును తెలుగు సరస్వతి కలంకారం చేశారు. "ఒడిదొడుకులు లేని తేట తెలుగు కవితా రచన చేసినవారిగా, అచ్చుయంత్రముల వెలుగు నెఱుగక మట్టి బ్రుంగిన తాటి యాకులను బట్టుకుని కన్నులు చిల్లులుచేసికొనెడి నిరంతర (సాహితీ) వ్యవసాయము చేసినవారిగా వేటూరివారిని 'ఆంధ్ర రచయితలు' ప్రామాణిక గ్రంథంలో మధునాపంతులవారు శ్లాఘించారు. 'భాషాపరిశోధకులు, విమర్శకులు కవులుగా నగుట అరుదు. ఆ యదృష్టము ఒక్క ప్రభాకరశాస్త్రిగారికే పట్టినది' అనేదికూడా సత్యనారాయణ శాస్త్రిగారి సత్యవాక్యము.



వేమూరి ప్రభాకరశాస్త్రి

ఆయన కేవలం కవేకాదు, ప్రత్యేకించి చెప్పుకోదగ్గ సవర్ణదీర్ఘసంధి రహిత మహాకవి కూడా. ఈ విషయాన్ని ఖండితంగా చెప్పడానికి ఆయన రాసిన నాలుగు ఖండకావ్యాల్లో 'కడుపుతీపు' 'కపోతకథ' సాక్ష్యాలు పల్కుతాయి. అందులో 'కడుపుతీపు' చదవితీరవలసిన కావ్యంగా భావించాలి. ఇప్పటికి తొంభైసంవత్సరాల క్రితం అంటే 1925లో చెన్నపురిలో ఆంధ్రపత్రికా ముద్రాలయం వారు అచ్చొత్తించిన ఖండకావ్యం **కడుపుతీపు**. ఇది అచ్చమైన తెలుగుదనం కల శీర్షిక. తేపటివేళ, మాపటివేళ, చీకటివేళ, ముగింపు అనే నాలుగు శీర్షికల్లో కైత బిగింపు సొంపులుంటాయి.

*కథ చెప్పినట్లు సాగుతాయి పద్యాలు*
*కలదెగద యంధ్రవిష్ణు*
*స్థలమై, శ్రీకాకుళాభి ధానమ్మున బే*
*ర్వెలసిన పురమంధ్రావని*
*వెలనాటన్ గృష్ణపెంపు వెలసిన చోటన్* – అనేది మొదటి పద్యం

కొన్ని శాసనాల్లో ఆంధ్రకు అంధ్ర అనే వుంది.

అంధ్రదేశంలో వెలనాట కృష్ణానది వెలసిన చోట,

ఆంధ్రవిష్ణుస్థలమైన శ్రీపురం శ్రీకాకుళం అని వుంది కదా అని శ్రవణ సుభగంగా ప్రారంభం.

ఆ ఊళ్ళో ఒక ఓవర్‌సీర్ కుటుంబం వుంది. వయసులో ఉన్నవాడు. తమిళుడు, ఆయన ఇల్లాలు, నలుగురైదుగురు బిడ్డలు. అందపు గందులు, ఆ కుటుంబంలో సర్వ సౌఖ్యాలూ వున్నాయి. చక్కని సంస్కృతి కల కుటుంబం పిల్లాడు ఆ తల్లిపాలు త్రాగడం సహజంగా ఒక్క పద్యంలో

*"గొబ్బున వచ్చి యొక్కచను గుద్దుచు నీద్చుచు తైక మారుచే*
*బ్రబ్బి మరొక్క సన్ దడవి పట్టుచు రెండును బాలవంకలై*
*యుబ్బి స్రవింపగా జననియుం దల మూర్కొన పొట్టనిండగా*
*జుబ్బనజూఱలాడెడు నినుంగు గనుంగొన వేడుకయ్యెడున్"*

అని చెప్పారు. తల్లీబిడ్డల ప్రేమపాళ్ళు సహజక్రియలూ గల ఈపద్యంలోని భావదృశ్య శిల్పం భావించి మనంకూడా బిడ్డలుగా మారుతామనిపిస్తుంది. ఈసందర్భంలో – బిడ్డలకి పాలెక్కడిస్తే స్తనసౌందర్యం తగ్గిపోతుందనుకునే తల్లుల భావాలపై వేటూరివారు ఒక వేటువేస్తారు తెలుగుదనం నిండుగాగల ఓ పద్యంలో

*"కుచసంపన్నత కూలిపోవుననియో క్రొవ్వారు మైసొరు విం*
*త చమత్కారములంతరించునని యో స్తన్యంబులేకుండ గు*
*బ్బ చనుల్ దిబ్బలుగా నొనర్చుకొని ద(డ)బ్బా పాలచే నిప్ప పు*
*త్ర చయంబుం బరిమార్చు మాతలటె మాతల్! కాలదూతల్‌గదా!*

కడుపుతీపు కథలో కవి వేటూరి జోక్యం కల్పించుకుని చెప్పిన ఈ పద్యంలోని భావం సువ్యక్తమే.

పదలాలిత్యం, తర్కశుద్ధి, శబ్ద స్థైర్యం, అలంకార విశేషం ఇలాంటి వెన్నో వుండి గుజ్జులా సాగాలి పద్యం అనే లక్షణాలన్నీ సలక్షణంగా ఈ ఒక్కపద్యంలోనే కాదు అన్ని పద్యాలలో ఉండడం ఈ కావ్యవిశేషం.

ఎంతటిమహాకవి పద్యరచనలోనైనా ఎక్కడో అక్కడ వదులు వదులు Loose Compostion కలయికలుండవచ్చేమోగాని, వేటూరి పద్య

రచనలో ముఖ్యంగా ఈ కడుపుతీపులో పద్యంలోనూ కనీసం ఒక్క పాదంలో నైనా ఉండకపోవడం అసాధారణం. సరే, కథా ప్రవేశం చేద్దాం.

అది శ్రావణమాసం. బెజవాడ ఆనకట్ట కృష్ణమ్మ ఇరవై అడుగులకు దాటి రెండు ఒడ్డుల మధ్యనా నిండి, మిగిలినది సముద్రంలోకి వెళ్ళిపోతోంది. వరదలొచ్చాయి. పల్లెల అవస్థలు హెచ్చాయి. పశువుల్నీ ధనధాన్యాల్నీ కాపాడుకోవడం కష్టమైపోయింది. అంత వరదలోనూ కృష్ణలో ఆడువారు, స్నానమాడువారు, పుణ్యకాంతల పూజాపునస్కారాలు చేస్తూనేవున్నారు. సరే మన కథానాయిక అయిన ఇల్లాలు ఇంటాయనతో పిల్లలతో స్నానానికి వెళ్ళింది. భర్త – రేవుని భార్యకి చూపించాడు– భార్య పిల్లల్ని ఒక్కొక్కర్నే స్నానం చేయిస్తోంది, ఇంతలో ప్రవాహంలో తుమ్మముళ్ళ కొమ్మ ఆమెచేయి దగ్గరికి వచ్చేసింది.

*'పై కేగుదెంచు నంచుం*

*గైకొని యాకొమ్మవిసరె గడగా బడగా*

*నాకొమ్మ, యందు మిసమిస*

*బ్రాకిన యట్లయ్యె అదియు బామో ఏమో'* – ఏదో పాకినట్లయింది మాత్రమే. భక్తిలో దైవ భయభక్తులుంటాయి, అందులోనూ నోములూ వ్రతాలూ చేసే పాతకాలం తల్లిగదా "మోపిదేవి సుబ్రహ్మణ్యమూర్తీ, నీకు మొక్కు చెల్లిస్తాను, దర్శనానికి వస్తాను. పుట్టలో పాలుపోస్తా, నాపిల్లలకు పురుగు భయంలేకుండా రక్షించమంది. స్నానంచేసింది. బిడ్డలు కాళ్ళకు అడ్డాలు పడుతూండగా ఇంటికి వచ్చింది. భర్తవచ్చాడు. తరువాత తపాలా ఉత్తరం ఒకటి వచ్చింది. అది అధికారలేఖ భర్తకు మదరాసు బదిలీ, జీతం పెంపునకు చెందిన లేఖ. వారిద్దరికీ ఉన్నవూరు నుండి చెన్నపట్నం వెళ్ళడానికి ఇష్టం లేదు, తప్పదు. ఆలోచిస్తున్నారిద్దరూ. తరువాత రాత్రి వేళ భోజనాలు చేశారంతా. ఇల్లాలు "వాన యీదురు గాలి వస్తోంది. ఆ మంచంమీద పిల్లల మధ్య మీరు పడుకోండి" అంది భర్తతో, పిల్లలు "అమ్మా నాన్న దగ్గర పడుకుంటే మాకు నిద్ర రాదు" అని నేలమీద తల్లి దగ్గరే పడుకుని పంతం నెగ్గించుకున్నారు. శ్రీకాకుళాధీశ్వరా! మా పిల్లల్ని జాగ్రత్తగా చూడమని ప్రార్థించుకుంది. పడుకున్నారు. మధ్యలో పాలకు పిల్లాడేడ్చాడు. తల్లి మేలుకుని తలుపు తీసి బయట కాళ్ళు కడుక్కు వచ్చి, తలుపు వారగా వేసి, చేపు రాగా పాలివ్వడానికి కుమారుణ్ణి తీసుకుని కూర్చొంది. అప్పుడు ఘోరం జరిగింది.

*"తెల్లంద్రాచటె (తెల్లత్రాచు) అప్పుడామె పయి కుద్రేకించి*

*దూకెన్ బుసల్*

*చల్లెం పైబడగార్చె, అంత సుతరక్షా చింతయేదక్కత*

*క్లెల్లం ద్రోపద నాపె పాపశిర మట్టే పట్టె నిర్భేతులన్ (ఇరుచేతులా)*

*'పిల్లల్ పిల్లలు పిల్లలంచునఱచెన్, బీభత్స కంఠధ్వనిన్"* తెల్లత్రాచును చేత్తో పట్టుకుని తన దగ్గరున్న పిల్లల్ని మంచంమీదకి చేర్చండి మంచంమీదకి చేర్చండి అనగా, భర్త లేచి పిల్లల్ని మంచంమీదకు చేర్చాడు ఖంగారుగా.

*"అయ్యో బిడ్డల జేకొను*

*దయ్యోబిడ్డల'ని యేడ్చు నంతే కానీ*

*అయ్యమ్మ పాము బట్టితి*

*చెయ్యిదిగో కరచునంచు జీర దయారే!*

ఆ విషపు తోకతో ఆమె రెండు చేతుల్ని చుట్టేసింది. ఈమె ఆ పాము ఎక్కడికి వెళ్ళి పిల్లల్ని ఏంచేస్తుందో అని దాన్ని పట్టుకునేవుంది. పాము తలతో కొట్టడం వల్ల చేతులనిండా రక్తంకారింది. వచ్చి చేరిన జనంలో ఒకరు ఉత్తరీయాన్ని పాముతలపై వేసి ఎలాగో చంపేశాడు. ఇల్లాలు గుడ్లు తేలేసింది. ఇంకా చనిపోవదు పిల్లాడు తల్లి శరీరంపై పడినా పాలు విషపుసాలయ్యాయి. ఇవ్వలేని ఆ సందర్భంలోనూ బాధపడింది. పసిబిడ్డల్ని ఉపేక్షించకుండా చూసుకుంటానని భర్తచే శపథం చేయించుకుని 'పసిబిడ్డలు పసిబిడ్డల"ంటూనే ప్రాణం విడిచింది.

*కొడుకుగుఱ్ఱలకై జంకు గొంకు లేక*

*పాసె దన ప్రాణముల దృణ ప్రాయముగను*

*బూటకంబయ్యె నిప్పుడీ బోటి వలన,* ప్రాణమన్నింటికంటే తీపనెడి పలుకు అన్నారు. కవి –

*ప్రాణం అన్నింటికంటే తీపే అయినా అంతకంటే కడుపుతీపే* తీపు – అని ఈకావ్యంద్వారా సందేశమిచ్చారు. వేటూరివారు. ఇది 105 పద్యాల ఖండకావ్యం. ప్రతీపద్యం చిక్కగా ఉండి అందులో తెలుగుదనం చక్కగా నిండిస్తూ కరుణరసస్ఫోకరంగా వ్రాశారు. అంతేకాదు దీనిలో సంస్కృతీ విశేషాలున్నాయి. ఆచారవ్యవహారా లున్నాయి. శ్రీకాకుళం నుండి తప్పనిసరి బదిలీ తెలిసినప్పుడు స్వస్థాన ప్రేమాంశాలు, వాని అనుభూతులూ వున్నాయి.

అంతేకాదు. ఇందులో ఆంధ్రుల గొప్పతనాలున్నాయి. చెన్నపురి వెడితే శ్రీకాకుళస్వామి దర్శనం, కృష్ణానదీస్నానం. ఇవేకాక

*"దొరకునో లేదో మధుర వర్తనము గల్గు*

*తెల్గు గేస్తుల చెల్మితీరు మరల"* అనుకొంటారు. ఎందుకంటే వారిది తమిళుల కుటుంబం, *''ప్రశస్త వస్తు భరితమగు ఆంధ్రభూమిని"* కాపురం మళ్లీ వస్తుందా అనుకుంటారు. కృష్ణాప్రాంతం ఊళ్ళ పొలాల ప్రకృతి మళ్ళీ దొరుకుతుందా అనుకుంటారు.

*"హృదయమిచ్చి ఆదరించుగృహస్థుల*

*నడుమ కాపురం బొనర్పగలిగె*

*కేలు మోడ్పు నీకు కృష్ణాతరంగిణీ*

*తీరశోభితాంధ్ర దేశలక్ష్మి"* అంటారు, ఆ దంపతులు.

*'చక్కెర అక్కఱలేనివి చిక్కనిపాల్ గడ్డపెరుగు*

*జిడ్డగు నేయున్ మిక్కిలి చవిగల కూరలు*

*చిక్కున్ కృష్ణాస్రవంతి చెంతల యూళ్ళన్'* అంటారు వేటూరికవి. అంతేకాదు

*"ఆతిధ్యగౌరవంబును స్వాతంత్ర్య ప్రియత, స్వల్పసంతోషము, దుర్నీతినిహీనత, నైచ్యా*

*పేతత్వము నాంధ్రులందు పేర్పడు గుణముల్"* అని కూడా పాత్రలతో చెప్పిస్తారు వేటూరివారు. నిమ్నోన్నతాలు అనడానికి 'వైపువాటములు' అని అనిన తెలుగుకవి వేటూరి ప్రభాకరశాస్త్రిగారే. కడుపుతీపిలో ఉనికితీపి, బాసతీపి, బతుకుతీపి ఇన్ని – ఎన్నో ఉన్నాయంటే చదివితీరవలసిన పొత్తం కదా!

(పొత్తాన్ని అందించిన శ్రీకృష్ణ దేవరాయాంధ్ర భాషా నిలయానికి – మప్పిదాలు)

**రచయిత ఫోన్ : 9292055531**

స్మృతి ప్రభాత

– డా॥ నాగసూరి వేణుగోపాల్



# తెలుగు సంగీత సేవను చరిత్ర కెక్కించిన 'గానకళ' మునుగంటి శ్రీరామమూర్తి

"... **1962** వ సం॥ జూన్ నెలలో 'గానకళ' ప్రారంభించాం . సంగీతానికి ఆంధ్రప్రదేశంలో ఒక పత్రిక ఉండాలనే భావన సాహసోపేతమైనదే! ఈనాడు మద్రాసు నుంచి ప్రచురితమవుతున్న సంగీత పత్రికలకు కొన్ని దశాబ్దాలకు ముందే నాకీ ఆలోచన కలగడం సాహసమే! పత్రిక ప్రచారం కోసం నాతోపాటు స్వర్గీయ మహేంద్రవాడ కామేశ్వరరావు అనేక పట్టణాలకు తిరిగి కష్టసుఖాలను పంచుకుంటూ పత్రికకు ఎనలేని సేవచేశారు. వారి సేవను నేను ఎప్పుడూ మరువలేను. కనీసం 15, 20 పట్టణాలలో ప్రముఖులను కలుసుకుంటూ, సభ్యులను చేర్పిస్తూ చాలా కృషి చేశాము. ఈ పర్యటన అనంతరం నా ఆరోగ్యం చెడింది. డబుల్ టైఫాయిడ్ బారిన పడ్డాను. 40 రోజులు రుగ్మతను అనుభవించాను. మామూలు స్థితికి రావడానికి వాడిన ఇంగ్లీషు మందుల ప్రభావం ఒక నెలపోయిన తర్వాత నాలో కన్పించింది. ఒళ్ళంతా తెల్లబడింది. – తలతో సహా. ఆస్థితి నుండి బయటపడటానికి నాకు సంవత్సరకాలం పట్టింది. దాని చికిత్సకు వాడని మందు లేదు, చేయని ప్రయోగం లేదు. ఆ 40 రోజులలో ఒక రోజున ఇంజక్షన్ తీసుకొన్నప్పుడు 20 నిమిషాలు నేను పైలోకానికి పోయాను. అంతా అయిపోయిందనే అనుకున్నారు. మొండిప్రాణం కనుకనో ఏమో తిరిగి నేల మీదకి దిగి వచ్చాను. ఈ అనుభవాలన్నీ సంగీత పత్రికను నిలబెట్టాలనే తపనతో ఉన్న చోటనే ఉండక, తిన్నచోట తినక అవిశ్రాంతంగా కష్టపడటం వల్ల వచ్చిన పర్యవసానమే.

ఇలా తన సంగీత మాసపత్రిక 'గానకళ' కోసం పడిన యిడుముల కథను మునుగంటి శ్రీరామమూర్తి 2014 నవంబరు సంచిక 'నాజీవన యానం'లో విపులీకరించారు. నవంబరు సంచికలో. ఇప్పుడే ఎందుకు ఈ సంగతులు రాశారా? అనే సందేహం కలుగుతోంది. 1962 జూన్‌లో మునుగంటి శ్రీరామమూర్తిగారు సంగీతం కోసం 'గానకళ' అనే పత్రికను ప్రారంభించి – విజయవంతంగా నడుపుతూ ఈ జనవరి 12న తన తొంబైమూడవ ఏట కాలధర్మం చెందారు. అరశతాబ్దం మించి సంగీతం కోసం ఒక మాసపత్రికను పెట్టి కొనసాగించడం నిజంగా సాహసమే.

మునుగంటి వారితో ముఖాముఖి పరిచయం జరిగి ఒక దశాబ్దం దాటి ఉండవచ్చు! నేను తెలుగు 'స్పోకెన్ వర్డ్స్' విభాగం చూస్తున్న కాలంలో వారిని సంగీత సంబంధమైన అంశం గురించి ప్రసంగించడానికి కాకినాడ నుంచి ఆహ్వానించాను. భౌతికంగా కలవడం 2005లో కావచ్చు కానీ వారి జర్నలిజం మూర్తిమత్వం పరిచయమై మూడు దశాబ్దాలు దాటింది. శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం గ్రంథాలయంలో కనబడిన పత్రికలలో గానకళ ఒకటి – సంగీతానికి ఒక మాసపత్రిక వస్తోందని తెగ సంతోషం కల్గింది. సంపాదకులు మునుగంటి శ్రీరామమూర్తిగారి మీద గౌరవం పెరిగింది. వారెవరో తెలియదు కానీ కృషి గొప్పదని భావించాను. వారి పత్రికను మూడునాలుగేళ్ళు చూసి వుంటాను. తిరుపతిలో ముఖాముఖి పరిచయమైనప్పటి నుంచి వారి సౌజన్యం ఎంతో అనురాగం ఏమిటో ప్రత్యక్షంగా, పరోక్షంగా చూడగలిగాను. మనిషి పొడుగు కాదు, కొంచెం సగటు ఎత్తుతోనే మూర్తి. దాదాపు తెల్లచొక్కాలోనే వారిని చూసినట్టు గుర్తు. మూర్తి కన్నా వారి మాట మరీ మృదువు. దయాపూరితం. హంగూ ఆర్భాటం లేవు. ఎప్పుడూ నాసలహాలు పత్రికకు అవసరమని కోరేవారు. వయొలిన్ అద్భుతం. ద్వారం వెంకటస్వామినాయుడు గారి 50వ వర్ధంతి కార్యక్రమాలు ఇటీవల చెన్నయ్‌లో నవంబరు 13,14,15 తేదీలలో జరిగాయి. చివరి రోజున (శనివారం కావడంతో) నేను తేనాంపేట 'తత్వలోక' ఆడిటోరియంలో జరిగిన కార్యక్రమంలో మునుగంటి శ్రీరామమూర్తి గారిని కలవటం, వారు ద్వారం వారి గురించి సవివరంగా, గంభీరంగా ఆంగ్లంలో ప్రసంగించగా వినడం సాధ్యపడింది. లేకపోతే వారిని కలిసి ఉండేవాడిని కాదు. ఆ మధ్య వారి ఆరోగ్యం తీసిపోయి, తర్వాత కుదుటపడ్డారు. అలాంటి మునుగంటివారు ఈ జనవరి 12 న సాయంత్రం అకస్మాత్తుగా మరణించారు. నిజానికి అదే రోజున ఓ సినీ నిర్మాత – దర్శకుడు వి.బి.రాజేంద్రప్రసాద్‌గారు కనుమూయటంతో టీవీ చానళ్ళు ఆయన సినిమా పాటలు వాడుకోవడంలో తనమునకలుగా ఉన్నాయి. మరుసటిరోజు మదరాసులో ఈనాడు పత్రికలో చదివేదాకా నాకు తెలియదు. రెండు నెలల క్రితం కలిశాను, హాయిగా మాట్లాడారు – అంతలోనే పోయారని బాధ కల్గింది.

శ్రీరామమూర్తిగారు 1925 మార్చి 25న కాకినాడలో జన్మించారు. తల్లిదండ్రులు సుభద్రమ్మ, మునుగంటి వెంకటరావు. తండ్రి గాయకులు. తాత శ్రీరాములుగారు త్యాగరాజస్వామి శిష్యపరంపరలు ఐదవతరానికి చెందినవారు. వీరి తాతగారు 115 సం॥లో క్రితం (లేదా ఇంకా ముందు) కాకినాడలో శ్రీరామ సమాజం ప్రారంభించారు. అలాగే ఉచిత సంగీత కళాశాలను శ్రీరామమూర్తి తాతగారు మొదలుపెట్టారు. అంతేకాకుండా వీరు గణపతి సంగీత ఉత్సవం పేరున 10 రోజులపాటు ఐదు హరికథలుండటం. శ్రీరామమూర్తిగారు ఈ నేపథ్యం నుంచి వచ్చారు.

64 సం॥ క్రితం సంగీత విద్వత్సభ ప్రారంభించి సంక్రాంతి సంగీతోత్సవం నిర్వహిస్తూ వచ్చాడు. ఇదికాకుండా 53 సం॥ క్రితం సంగీతానికి ఒక డాక్యుమెంటేషన్ ఏర్పరుస్తూ, రేపటి సంగీత చరిత్రకు ఆధారాలు తయారు చేశారు. పుస్తక రచన కాకుండా ప్రతినెలా పత్రిక తేవాలని – జర్నలిస్టుగా, సంపాదకుడుగా మారిపోయాడు. ఇపుడు 'గానకళ' అర్థశతాబ్దం దాటిన వ్యవస్థగా తయారైంది. ఈ పత్రిక సేవ ఎలా ఉంటుంది? ఉదాహరణకు 2014 నవంబరు సంచిక చూడండి – అది ద్వారం వెంకటస్వామినాయుడు సంస్మరణ సంచికగా శ్రీరంగం నారాయణబాబు, శ్రీపాద పినాకపాణి, ఎన్.సి. హెచ్ కృష్ణమాచార్యులు, ద్వారం భావన్నారాయణరావు, రజని, నూకల, ఆరుద్ర, ఇలపావులూరి కామేశ్వరరావు, నండూరి రామమోహనరావు, గుంటూరు శేషేంద్రశర్మ, సూరిబాబు, కొమండూరి శేషాద్రి, మునుగంటి శ్రీరామమూర్తి గార్ల వ్యాసాలతో అలరారుతోంది. 2014 డిసెంబరు సంచిక నేదునూరి కృష్ణమూర్తి మృతి సందర్భంగా వారి ప్రత్యేక సంచికగా వెలువడింది. ఇపుడు జనవరి సంచిక శ్రీరామమూర్తిగారి మీదనే తయారైంది.

మంగళంపల్లి బాలమురళీకృష్ణ, ఆవంత్స సోమసుందర్ వంటి పెద్దల పేర్లతోపాటు సుమారు నలభై మందికి పైగా సంపాదక, సారథ్య వర్గాలతో ఈ పత్రికను పర్యవేక్షిస్తున్నారు. సంగీత సభల సమాచారం, ఫోటోలతోపాటు చక్కని వ్యాసాలు ప్రచురిస్తోంది ఈ పత్రిక. మృదంగం, వీణ, తాళం బొమ్మలతో గానకళ లోగో సంగీత భరితంగా కనబడుతుంది. నిజానికి ఈ పత్రిక నిర్వహణకు చాలా కష్టాలు పడ్డారు. ఒకవైపు ఆర్థికవనరులను చేకూర్చుకుంటూ, మరోవైపు సంగీత సమాచారం క్రోడీకరించడం, ఇంకోవైపు కాకినాడ నుంచి పత్రికను ప్రచురించడం! విజయవాడ నుంచి, హైదరాబాదు నుంచి పత్రికను ప్రచురించడం సులువు. కాకినాడలో అన్ని సౌలభ్యాలు వుండవు. అయినా క్రమంతప్పకుండా పత్రికను కొనసాగిస్తూ వస్తున్నారు. పంచరంగుల అట్టతో, దాదాపు ప్రకటనలు లేకుండా ప్రతినెలా 36 పేజీల పత్రికను ఒంటిచేత్తో నెగ్గుకు రావడం ఆషామాషీకాదు. ఈ సమస్యలన్నీ ఒకఎత్తు! సంగీత కళాకారుల అహంకారాలు భరించడం మరోఎత్తు. సంగీత విద్వాంసుల రాజకీయాలు వారి విద్వత్తును మించి ఉంటాయి. కనుక ఈ సంబంధమైన వత్తిడిని కూడా ఈ పత్రిక నిర్వహణలో నిరంతరం చవిచూడాల్సి ఉంటుంది.

గానకళలో ప్రచురింపబడే ఫోటోలు కళాకారులకు ఇష్టం. అయితే మాలాంటి వారికి వారు ప్రతినెలా 'నా జీవనయానం' పేరున స్వగత విషయాలు 135 మాసాలుగా రాస్తున్న శీర్షిక ఆసక్తి కల్గిస్తుంది. ఈ 'నా జీవనయానం' త్వరలో పుస్తకంగా వస్తోందని శ్రీరామమూర్తి కుమారుడు, ప్రస్తుతం గానకళ సంపాదకుడు వెంకట్రావు చెబుతున్నారు. అలాగే ఇటీవల సంవత్సరాలలో మీడియా మెరుపులు పేరున సంగీతానికి సంబంధించిన మీడియా కబుర్లు శ్రీరామమూర్తి రాసేవారు. ఈ రెండు శీర్షికలు ఒకేచోట ఉండేవి. శ్రీరామమూర్తిగారు అదృశ్యమైనా వారి కుమారులు వెంకట్రావు తప్పక 'గానకళ'ను మరింత మెరుగ్గా నిర్వహిస్తారని నాకు నమ్మకముంది. ఈ పత్రిక నిర్వహణలో చాలామంది సంగీత విద్వాంసులున్నారు. అయితే పత్రికల నిర్వహణ తెలిసిన వారి లేని లోటు స్పష్టంగా కనబడుతోంది. ఈ పరిమితి ఒక్క గానకళకే కాదు – తెలుగు విద్యార్థి, గ్రంథాలయసర్వస్వం వంటి పత్రికలలో కూడా కనబడుతుంది. మొత్తం పత్రికలో వాడే భాష, శైలి ఒకే రకంగా ఉండాలి. పేజీలను, అంశాలను మరింత అర్థవంతంగా, ఆకర్షణీయంగా తీర్చిదిద్దాలి. అలాగే పత్రిక నెట్‌లో లభ్యం కావాలి. ప్రస్తుతం కర్ణాటక సంగీతం ద్వారా తెలుగు ప్రపంచ వ్యాప్తంగా ఉంది. వారందరికీ గానకళ చేరాలి.

మునుగంటి శ్రీరామమూర్తి గారి దృష్టి విశాలమైంది. పట్టుబట్టి 'సంగీతం – టెక్నాలజీ' అంశానికి సంబంధించి సాంకేతిక విజ్ఞానం సంగీతాన్ని ఎటువంటి మార్పులకు గురి చేసింది అనే విషయాలను వారి సభలో నాతో మాట్లాడించారు. ఉదయరాగం, సంధ్యారాగం – వంటి విభజన ఎ.సి. ఆడిటోరియం సౌలభ్యం వచ్చిన తర్వాత చెల్లుబాటు అవుతుందా? – వంటి సాంకేతిక విభజన పరమైన పార్శ్వాలు చర్చించే వారికి ఉండనే ఉంటాయి, పాతికేళ్ళక్రితం గోవాలో నేను ఉద్యోగం చేస్తున్నపుడు బొంబాయి ఎడిషన్ 'ది టైమ్స్ ఆఫ్ ఇండియా' పత్రిక ధ్యాన్ నాద్ కర్ణి సంగీత సమీక్షలు, విశ్లేషణలు తరచు ప్రచురించేది. సంగీత ఆస్వాదన సంబంధమైన అంశాలతోపాటు ఆయన రేకత్తించే సాంకేతిక సంబంధమైనవి. ఈనేపథ్యంతో తప్పక ప్రసంగించాలి అని కోరినపుడు నేను 'సంగీతానికి శాస్త్ర సాంకేతిక విజ్ఞానంతోపాటు' అనే విషయం గురించి వారి సభలో మాట్లాడాను. ఆ విషయాలను 'మిసిమి' పత్రికలో వ్యాసంగా ప్రచురించాను. ఆవ్యాసాన్ని పిమ్మట 'అత్యున్నత కళారూపం – సైన్స్' అనే పుస్తకంలో చేర్చాను కూడా!

బెంగుళూరు నాగరత్నమ్మగారు తన జీవితాన్ని ధారపోసి త్యాగరాజ స్వామి కీర్తనలను మనకు పంచారు. ఇలా ఎంతోమంది తమదైన కృషిని కర్ణాటక సంగీతానికి చేశారు. అటువంటి తరహా సేవను మునుగంటి గారు 'గానకళ' పత్రిక ద్వారా చేశారన్నది వాస్తవం!

**రచయిత ఫోన్ : 9440732392**

పిచ్చిచూపు

– చలసాని నరేంద్ర

# తెలుగు ప్రజల మధ్య శాపం
# తెలుగు రాష్ట్రాల నేతల వైరం

**ఆరు** దశాబ్దాల ఆరాటం, ఆందోళన, ఆవేదనల అనంతరం తెలంగాణ ప్రాంత ప్రజలు ప్రత్యేక రాష్ట్రం ఏర్పర్చుకోగలిగారు. అయితే ప్రజల అభీష్టం మన్నించి, గౌరవప్రదంగా కాకుండా రాజకీయ ప్రయోజనాలను మాత్రమే పరిగణనలోకి తీసుకొని, ముందుచూపు లేకుండా రాష్ట్ర విభజనను హడావుడిగా చేయడంతో రెండు రాష్ట్రాల మధ్య పలు అంశాల్లో స్పష్టత కొరవడింది. పరిపాలనాపరంగా, ఇతరత్రా రెండు రాష్ట్రాలు పరస్పరం సహకారంతో, అవగాహనతో, సమన్వయంతో కలసి వ్యవహరిస్తే తప్ప సవ్యంగా పరిపాలన జరపలేని పరిస్థితులు నేడు నెలకొన్నాయి.

గతంలో సన్నిహిత మిత్రులుగా మెలిగి, తరువాత పదవుల పంపకంలో సరివడక వేరుపడిన ఇద్దరు చంద్రులు రాష్ట్ర విభజన అనంతరం రెండు రాష్ట్రాలకు ముఖ్యమంత్రులుగా వచ్చారు. వారిద్దరికీ విశేష రాజకీయ, పరిపాలన అనుభవం ఉండడంతో వారి నాయకత్వంలో రెండు తెలుగు రాష్ట్రాలు సత్వర అభివృద్ధికి నోచుకోగలవని అందరూ ఆశించారు. పైగా రాష్ట్ర విభజన కోసం రెండు మూడేళ్ళుగా ఉద్యమాలు ఉధృతంగా జరగడంతో మొత్తం పరిపాలన స్తంభించినట్లు కావడమే కాకుండా అభివృద్ధి సహితం మందగించింది. దేశంలోనే పెట్టుబడులకు ఆకర్షణీయ నగరంగా వెలుగొందుతున్న హైదరాబాదు నుండి కొన్ని పరిశ్రమలు ఇతరత్రా ప్రాంతాలకు తరలే పరిస్థితులు నెలకొనడం, మరికొన్ని పరిశ్రమల విస్తరణ నిలిచిపోవడం, కొత్త పరిశ్రమలు రాలేని పరిస్థితులు నెలకొన్నాయి.



**రెండు రాష్ట్రాలు పరస్పరం సహకారంతో, అవగాహనతో, సమన్వయంతో కలసి వ్యవహరిస్తే తప్ప సవ్యంగా పరిపాలన జరుపలేని పరిస్థితులు నేడు నెలకొన్నాయి. పలు వివాదాల విషయంలో ముఖ్యమంత్రులు ఇరువురూ జోక్యం చేసుకుని, ఇచ్చిపుచ్చుకొనే రీతిలో వ్యవహరిస్తే పరిష్కరించుకోలేని తీవ్ర సమస్యలు లేవు.**

గతంలోని ఆవేశాలను మరచిపోయి, కొత్తగా ఏర్పడిన రెండు ప్రభుత్వాలు పరస్పరం అవగాహనతో సుపరిపాలన అందించగలవని అందరూ ఎదురు చూసారు. పైగా ఎన్నికల సమయంలో ప్రజలకు తలకుమించిన బరువు అని తెలిసినా పెద్ద పెద్ద హామీలు చేసి వచ్చారు. ముందుగా ఆయా హామీలను అమలుచేయలసిన బాధ్యత ఇద్దరిపైనా ఉంది. రాష్ట్ర విభజన చట్టం మేరకు హైదరాబాదు నగరం పదేళ్ళపాటు రెండు రాష్ట్రాలకు సమిష్టిగా రాజధాని నగరంగా కొనసాగే అవకాశం ఉంది. పలు పరిపాలనాపరమైన అంశాలపై రెండు రాష్ట్రాల మధ్య సరయిన విభజన జరుపకుండానే ఎన్నికల ముందు హడావుడిగా రాష్ట్ర విభజన జరిగినది. రాష్ట్ర విభజన జరిగి ఎనిమిది నెలలు అవుతున్నా, ఇంకా ఉద్యోగుల విభజన పూర్తి కాలేదు. పలు సంస్థలు రెండు రాష్ట్రాలకు ఉమ్మడిగా సేవలు అందించవలసిన పరిస్థితులు నెలకొన్నాయి. ఆర్ టి సి విభజన సహితం ముందుకు వెళ్ళడం లేదు. నదీ జలాల పంపకం విషయంలో పలు అస్పష్టత, వైరుధ్యాలకు వీలు కల్పించే పరిస్థితులు నెలకొన్నాయి. హైకోర్టు వంటి వాటి విభజన విషయంలో కేంద్రం ముందుకు సాగడం లేదు.

ఇటువంటి పరిస్థితులలో రెండు రాష్ట్ర ప్రభుత్వాలు ఉమ్మడిగా ఒక అవగాహనకు వచ్చి సామరస్యంగా తలెత్తుతున్న సమస్యల పరిష్కారం కోసం ప్రయత్నం చేస్తే ఒక మంచి సాంప్రదాయం నెలకొల్పినవారు అయివుండేవారు. అయితే అధికారంలోకి వచ్చిన తొలి రోజు నుండి పరస్పరం కలసి చర్చలు జరుపుకోలేని విధంగా వ్యవహ రిస్తూ ఉండడం రెండు రాష్ట్రాల ప్రజల మధ్య వైమనస్యాలు పెరగడానికి మాత్రమే దారితీయ గలదు.

ఇద్దరు ముఖ్యమంత్రులూ హైదరాబాదు నగరంలోనే ఉంటున్నారు. నూతన రాజధాని నిర్మాణం పూర్తి అయినా తన నివాసాన్ని హైదరాబాదు నుండి మార్చుకొనే ప్రసక్తి లేదని ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి యన్ చంద్రబాబు నాయుడు తేల్చి చెప్పారు. ఇద్దరి నివాసాలు సహితం కూతవేటు దూరంలోనే ఉన్నాయి. మొబైల్ ఫోన్ లు ఇద్దరి వద్దా ఉన్నాయి.

కనీసం పరస్పరం విడిగా పలకరించుకోలేని పరిస్థితులు నెలకొనడం విచారకరం. వారిద్దరూ మాట్లాడాలి అనుకొంటే రాజ్ భవన్ లో గవర్నర్ ఇ యస్ యల్ నరసింహన్ పట్టుబడితే కాని వీలు కావడం లేదు. కలసినప్పుడు ఏ సమస్య లేనట్లు వ్యవహరించడం, ఆ తరువాత ఎవరికీ వారే అన్నట్లుగా వ్యవహరించడం జరుగుతున్నది.

యంసెట్ పరీక్షల నిర్వహణ విషయం కావచ్చు, కృష్ణ జలాల విడుదల అంశం కావచ్చు, విద్యుత్ పంపకాలు కావచ్చు… ఏ వివాదాన్ని అయినా ముందు అధికారుల స్థాయిలో, తరువాత మంత్రుల స్థాయిలో అప్పటకీ వీలు కాని పక్షంలో, ముఖ్యమంత్రుల స్థాయిలో కూర్చొని మాట్లాడుకొనే ప్రయత్నం ఎందుకు చెయ్యడం లేదు? రాష్ట్ర విభజన తరువాత కూడా తెలంగాణపై పెత్తనం వొదులు కోవడానికి ఆంధ్రపాలకులు సిద్ధపడటం లేదంటూ తెలంగాణ ముఖ్యమంత్రి కె చంద్రశేఖరరావు ప్రకటనలు చేస్తూ ఉండడం, తాను సహకారం అందించడానికి ముందుకు వస్తున్నా చంద్రశేఖరరావు నుండి స్పందన లేదని చంద్రబాబు నాయుడు ఒకరిపై మరొకరు ఆరోపణలు చేసుకొంటూ కాలం గడుపుతున్నారు. రాష్ట్ర విభజన చట్టంలో పలు అంశాలపై స్పష్టత లేకపోవడం, విభేదాలు తలెత్తినప్పుడు పరిష్కరించుకొనే యంత్రాంగాల గురించి స్పష్టత లోపించడం వల్లనా, ప్రక్క రాష్ట్రల వారు విభజన చట్టాన్ని అతిక్రమిస్తున్నారని రెండు రాష్ట్ర ప్రభుత్వాలు తరచూ ఆరోపణలు చేస్తున్నాయి. అంతేగాని నిబంధనలను ప్రక్కకు నెట్టి రెండు రాష్ట్రాల ప్రజల అవసరాలను దృష్టిలో ఉంచుకొనే పెద్ద మనస్సుతో వ్యవహరించి రాజనీతిజ్ఞతను ప్రదర్శించే ప్రయత్నం ఎవ్వరూ చేయడం లేదు.

ఉదాహరణకు అధికారంలోకి రాగానే విద్యుత్ కోతలకు మంగళం పాడి, 24 గంటలు ప్రజలకు విద్యుత్ సరఫరా చేయ గలుగుతున్నాను అని గొప్పగా చెప్పుకొంటున్న చంద్రబాబు నాయుడు తెలంగాణ రాష్ట్రంలో విద్యుత్ సరఫరా లేక రైతులు పంటలను కాపాడుకోలేకపోవడం, కొందరు ఆత్మహత్యలకు సహితం పాల్పడు తుంటే స్పందించి ఏదో కొంత సహకారం అందించే ప్రయత్నం చేసారా? ఆంధ్రప్రదేశ్‌లో గృహ వినియోగదారులకు రోజుకు రెండు గంటల పాటు అయినా విద్యుత్ కోత విధించి తెలంగాణ రైతుల పంటలు కాపాడటం కోసం కొంత విద్యుత్ అందించి ఉంటే, ప్రజల మధ్య మంచి సంబంధా లకు ఒక పెద్ద ముందడుగు వేసినట్లు అయి ఉండెడిది కాదా?

అదే విధంగా నదీ జలాల వాడకంలో త్రాగు నీటికి మొదటి ప్రాధాన్యత ఇస్తారు. ఆ తరువాత సాగు నీటికి, చివరకు విద్యుత్ సరఫరాకు ప్రాధాన్యతలు ఇస్తూ ఉంటారు. రాయలసీమ ప్రాంతానికి ముందుగా త్రాగు నీటి అవసరాల కోసం రెండు రోజుల పాటు నీరు వదిలిన తరువాతనే తాము విద్యుత్ ఉత్పత్తి చేపడతాము అని తెలంగాణ ప్రభుత్వం అని ఉంటే పరిస్థితులు ఏవిధంగా మారి ఉండెడివి ? పోలీసుల పహారాతో విద్యుత్ ఉత్పాదన చేయవలసిన అవసరం ఉండెడిది కాదు కదా.

రెండు రాష్ట్రాల ప్రభుత్వాలు విషమ సమస్యలను ఎదుర్కొంటు న్నాయి. 16వేల కోట్ల రూపాయల లోటు బడ్జెట్‌తో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రారంభం కాగా, 9వేల కోట్ల రూపాయల మిగుల బడ్జెట్ తో ప్రారంభం అయిన తెలంగాణ ప్రభుత్వం సహితం పెను సవాళ్ళను ఎదుర్కొంటున్నది. విభజన చట్టంలో హామీ ఇచ్చిన విధంగా లోటు బడ్జెట్ మొత్తం కేంద్రం నుండి రాగలదని ఆశించిన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి కేంద్రం కేవలం రు.500 కోట్లు విదిల్చి నిరాశనే మిగిల్చింది. మిగులు అనుకున్న రీతిలో రెవిన్యూ వసూళ్లు లేకపోవడంతో తెలంగాణ ప్రభుత్వం సహితం తీవ్ర ఇబ్బందులను ఎదుర్కొంటున్నది. కొత్త రాష్ట్రాలకు ప్రత్యేక హోదా కల్పిస్తామని ఎన్నికల ముందు చేసిన వాగ్దానాలు నీటి మూటలుగా మిగిలిపోతున్నాయి. ఎన్నికల అనంతరం కూడా అనేక సార్లు హామీలు కురిపించిన కేంద్ర నాయకులు ఇప్పుడు కుంటి సాకులు చెబుతున్నారు. ఇతర రాష్ట్రాలు సహితం అటువంటి హోదాలు అడుగుతున్నాయని వంకలు పెడుతున్నారు. ఇటువంటి అంశాల్లో రాజకీయ సంకల్పం అవసరం. రాజకీయ సంకల్పం ఉంటే ఇటువంటి అడ్డంకులు రానే రావు. గతంలో ఉత్తరాఖండ్‌కు కేవలం ఆ రాష్ట్రానికి చెందిన వ్యక్తి ప్రణాళిక కమీషన్ ఉపాధ్యక్షుడిగా ఉండడంతో హుటాహుటిన ప్రత్యేక హోదా కల్పించారు. నేడు ఆంధ్రప్రదేశ్, తెలంగాణ రాష్ట్రాలకు కేంద్రంలో ఆ విధంగా అండగా ఉండగల నాయకత్వం లేకపోవడం వల్లనా రెండు రాష్ట్రాలు నష్టపోతున్నాయి.

పరస్పర కలహాలతో, అపవాదులతో కాలం గడుపకుండా ఇద్దరు ముఖ్యమంత్రులు కలసి తమ తమ రాష్ట్రాల అవసరాలు తీర్చాలని ప్రధాన మంత్రి వద్దకు వెళ్లి కూర్చుంటే, నరేంద్ర మోడీ కుంటి సాకులతో తప్పించు కోగలరా? అటువంటి రాజనీతిజ్ఞతను ప్రదర్శించగల నాయకత్వ పటిమ మన ముఖ్యమంత్రులకు లేదా? ఎన్నికల హామీలను అమలు చేయలేని వైఫల్యాల నుండి ప్రజల దృష్టి మళ్ళించడం కోసం అనవసరమైన వివాదాలను తెరపైకి తీసుకు వస్తున్నారనే అనుమానం ఈ సందర్భంగా పలువురికి కలుగుతున్నది.

రాజకీయ నిర్ణయాలు అవసరం అయిన చోట ఇతరత్రా వత్తిడులను సాకుగా చూపడం నమ్మశక్యంగా ఉండదు. గతంలో ఇచ్చిన మాటలను గాలికి వదిలివేసి, వ్యవహారంలో పారదర్శకత లేకుండా అడ్డగోలుగా కేవలం రాజకీయ ప్రయోజనాలకోసం వ్యవహరించినందుకు పదేళ్ళపాటు అధికార పక్షంగా ఉన్న కాంగ్రెస్ పార్టీకి ఒక్క అసెంబ్లీ స్థానం సహితం దక్కకుండా ఆంధ్రప్రదేశ్ ప్రజలు తిరస్కరించడం గతంలో ఎక్కడా ఎన్నడూ జరగలేదు. ఈ అనుభవాన్ని ఒక గుణపాఠంగా తెలుగు దేశం, టి ఆర్ యస్ పక్షాలు నేడు గ్రహించాలి. ప్రజలను మభ్యపరచాలని అనుకొంటే పొరపాటు చేసినవారు కాగలరు. ప్రజల ఆగ్రహాన్ని ఎదుర్కోవలసి వస్తుందని గ్రహించాలి.

ఒకవేళ నిజంగా ప్రత్యేక హోదా కల్పించడానికి రాజ్యాంగపరమైన అభ్యంతరాలు, అటువంటి హోదా కోసం నాడు బి జె పి నాయకత్వం ఎందుకు పట్టుబట్టింది, ఎందుకు తమ ప్రభుత్వం అమలు చేస్తుందని హామీలు ఇచ్చింది, పైగా ఎన్నికల ప్రణాళికలో సహితం పేర్కొన్నది… ఈ అంశాలపై బి జె పి నాయకత్వాన్ని నిలదీయడానికి సహితం ఇద్దరు ముఖ్యమంత్రులూ సిద్ధపడాలి. వీరిద్దరూ పరస్పరం కయ్యాలకు దిగుతూ ఉంటే, ఢిల్లీలో వారిని ఎవ్వరూ పట్టించుకోరని గ్రహించాలి. కలసి ఉంటేనే బలవంతులని తెలుసుకోవాలి.

రెండు రాష్ట్రాల మధ్య నేడు చెలరేగుతున్న పలు వివాదాల విషయంలో ముఖ్యమంత్రులు ఇరువురూ జోక్యం చేసుకుని, పరస్పరం

ఇచ్చిపుచ్చుకొనే రీతిలో వ్యవహరిస్తే పరిష్కరించుకోలేని తీవ్ర సమస్యలు లేవని చెప్పవచ్చు. ఇరు రాష్ట్రాల అవసరాలకు సరిపడిన నీరు కృష్ణానదిలో లేని సమయంలో ఇరు రాష్ట్రాలు సహితం సమస్యలు ఎదుర్కొనవలసినదే. పరస్పరం అవగాహనతో ఉమ్మడిగా అటువంటి సమస్యలను ఎదుర్కొనే ప్రయత్నం ఎందుకు చేయడం లేదు? ఎదురవుతున్న సమస్యలకు ప్రక్క రాష్ట్రం వారే కారణం అనే విధంగా ప్రజల మధ్య విద్వేషాలు పెంచే ప్రయత్నం ఎందుకు చేస్తున్నారు?

రెండు రాష్ట్రాలు తీవ్ర ఆర్థిక సమస్యలను ఎదుర్కొంటున్నా పరిపాలనలో పొదుపు పాటించే ప్రయత్నం చేయడం లేదు. వృధా వ్యయం అరికట్టే ప్రయత్నం చేయడం లేదు. గతంలో లేని విధంగా 15 మంది సలహాదారులను తెలంగాణ ప్రభుత్వం నియమించింది. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సహితం ఆ దిశలో అడుగులు వేస్తున్నది. పైగా వారిని వెంటాడుతున్న వాస్తు అపోహలు ప్రభుత్వ ఖజానాలకు భారీ వ్యయాలు కలిగిస్తున్నాయి. ఇతర మంత్రులకు పొదుపు బోధిస్తూ తాము మాత్రం పాటించడం లేదు. భారీ విదేశీ పర్యటనలు ఈ సందర్భంగా ప్రశ్నార్థకం అవుతున్నాయి.

ఇద్దరు ముఖ్యమంత్రులూ రెండురాష్ట్రాలూ – ఎదుర్కొంటున్న తీవ్ర సమస్యల పరిష్కారం కోసం, ఎన్నికల హామీలకోసం ఆసక్తి చూపకుండా ప్రాధాన్యత లేని అంశాలకు అనవసర ప్రాధాన్యత ఇస్తూ ప్రజలను మభ్యపెట్టే ప్రయత్నం చేస్తున్నారు. హైదరాబాదు ఉమ్మడి రాజధానిగా పదేళ్ళపాటు ఉండే అవకాశం ఉంది. తక్షణమే కొత్త రాజధాని ఏర్పాటు చేసుకోవలసిన అవసరం ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి లేదు. అయినా ఉద్యోగులకు జీతాలు ఇవ్వడమే కష్టం అనుకుంటూన్న సమయంలో రాజధాని నిర్మాణం గురించి ప్రజల్లో ఎన్నో ఆకర్షణలు కలిగించే ప్రయత్నం చేస్తున్నారు. తెలంగాణ ముఖ్యమంత్రి అయితే ఉన్న సచివాలయాన్ని వాస్తు దోషం పేరుతో మార్చడం కోసం టి బి ఆసుపత్రిని 80 కి మీ దూరానికి మార్చే ప్రయత్నం చేస్తున్నారు. ఇటువంటి కీలక అంశాల్లో అందరినీ సంప్రదించే ప్రయత్నం కూడా చేయడం లేదు. ఒంటెద్దు పోకడలతో వ్యవహరిస్తున్నారు.

ఇద్దరు ముఖ్యమంత్రులు కేవలం తమ రాష్ట్రాల్లోని సంక్షేమ, అభివృద్ధులకు సంబంధించిన అంశాలనే కాకుండా దేశ వ్యాప్తంగా, విదేశాల్లో ఉన్న తెలుగు ప్రజల క్షేమం గురించి కూడా దృష్టి సారించాలి. ఈ విషయంలో ఉమ్మడిగా రెండు ప్రభుత్వాలు కలసి కొన్ని చర్యలు చేపట్టవచ్చు. అరబ్ దేశాల్లో కూలీలుగా, నర్సులుగా, ఇతర ఉద్యోగాల కోసం వెళ్లి అనేక మంది మోసాలకు గురవుతున్నారు. అనూహ్యంగా మరణాలకు గురవుతున్నారు. వారి బాగోగుల గురించి పర్యవేక్షించేందుకు రెండు ప్రభుత్వాలు కలసి ఒక యంత్రాంగాన్ని ఏర్పాటు చేయవచ్చు కదా ? ఆయా దేశాలలోని మన రాయబార కార్యాలయాల్లో ఒక ప్రత్యేక అధికారిని నియమించవచ్చు కదా?

విమానాశ్రయాలలోనే నిఘా ఏర్పాటు చేసి ఉద్యోగాలకై వెడుతున్న వారు మోసాలకు గురికాకుండా జాగ్రత్తలు తీసుకోవడంలో సహితం పరస్పరం సహకారంతో వ్యవహరించ వచ్చు. గోదావరి పుష్కరాలు జరపడానికి రెండు రాష్ట్రాల ప్రభుత్వాలు సన్నద్ధం అవుతున్నాయి. కనీసం మంత్రుల స్థాయిలో అయినా రెండు ప్రభుత్వాలూ



ఈ విషయంలో ఒక అవగాహనకు వచ్చి, సమిష్టిగా ఏర్పాట్లు చేసే ప్రయత్నం చేస్తే మంచి వాతావరణం ఏర్పాటుకు దారితీయగలదు.

ఇక తెలుగు ప్రజల సాహిత్యం, సంస్కృతులను పెంపొందించు కోవడానికి, చారిత్రక అంశాలను వెలుగులోకి తేవడానికి సహితం ఉమ్మడిగా కృషి చేయవచ్చు. దేశ, విదేశాల లోని తెలుగు ప్రజలు అందరి మధ్య సాంస్కృతిక సహకారం పెంపొందించే విధంగా ఉమ్మడిగా కొన్ని కార్యక్రమాలు చేపట్టవచ్చు. రెండు రాష్ట్రాల విశ్వవిద్యాలయాల మధ్య సహకారం పెంపొందించి ఉమ్మడిగా కొన్ని కార్యక్రమాలు నిర్వహించే ప్రయత్నం చేయవచ్చు. పరిశోధన అంశాల్లో సహకారం అందించు కోవచ్చు.

కొన్ని చారిత్రిక కారణాల వల్లనా, పాలకుల ధోరణుల కారణంగా రెండు రాష్ట్రాల ప్రజల మధ్య ఇంతకాలం అపోహలు చెలరేగాయి. వాటిని తొలగించుకొని, రాజకీయంగా విడిపోయినా ప్రజలపరంగా కలసి ఉండే వాతావరణం ఏర్పాటుకు ప్రయత్నాలు జరగాలి. ఈ విషయంలో ఇరు రాష్ట్రాల ముఖ్యమంత్రులతో పాటు రెండు రాష్ట్రాలలోని మేధావులు, కళాకారులు, సాహితీవేత్తలు ప్రధానమైన కృషి జరుపవలసి ఉంది. ప్రత్యేక రాష్ట్రాలు ఏర్పడిన అనంతరం కుడా వేర్పాటు ధోరణులు కొనసాగడం బాధాకరం. రెండు రాష్ట్రాల అభివృద్ధికి, ప్రజల భవిష్యత్తుకు అటువంటి ధోరణులు ప్రయోజనం చేకూర్చలేవని గ్రహించాలి.

ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం సహకారంతో నేడు విశ్వ కుటుంబ భావన పెరుగుతున్నది. ఐరోపా దేశాలు అన్నీ కలసి ఉమ్మడిగా పరస్పర ప్రయోజనాలు కాపాడుకొంటూనే వ్యవహరించే ప్రయత్నాలు చేస్తున్నాయి. అరవై సంవత్సరాల పాటు ఒక ప్రభుత్వ పాలనలో ఉండటమే కాకుండా, శతాబ్దాల చారిత్రక, సాంస్కృతిక వారసత్వం గల తెలుగు ప్రజల సమష్టి అవగాహనతో పరస్పరం సహకార ధోరణిలో కలసి ప్రయాణం చేయలేరా? రాజకీయ నాయకత్వం ఈ విషయంలో చెప్పుకోదగిన కృషి చేయలేకపోయినా ప్రజల మధ్య మరింత విద్వేషాలు చెలరేగి, వేర్పాటు ధోరణులు పెంపొందే పరిస్థితులకు మాత్రం దోహదకారి కాకూడదు.

**రచయిత స్వతంత్ర పాత్రికేయుడు, ఫోన్ : 09441797650**

– ఓట్ర పురుసోత్తం

# తెక్కణపు తెలుగు వెలుగు తిరుమల నాయకరు

తన ముద్దుబిడ్డయిన కొళ్లిడమ్మ తనను వదిలి వక్కణంగా చీలిపోతుంటే చూసి కళ్లల్లో నీళ్లు పెట్టుకొనింది కావేరమ్మ. కొంచెం వక్కణంగా పోయి అక్కడనుండి తూర్పుగా పారి, పోయిన తావంతా మంది ఆకలి దప్పిక తీర్చి, తిరిగి వచ్చి తనను కలుసుకొంటాది, తన బిడ్డ, అని తెలుసు కావేరమ్మకే. అయినా కన్నకడుపు కదా, అందుకే అంగలార్చింది. 'రంగా నీవే దానికి తోడు ఉండాల' అని మొక్కుకొని శ్రీరంగాన్నీ తిరుచినాపల్లినీ తన అలల చేతులతో కలవతా తూరుపుకేసి గలగలలాడతా పోతావుంది కావేరమ్మ.

కావేరమ్మ కన్నీళ్లను తుడిచేసి వచ్చిన గాలి, ఆ పక్కనే తిరుచి మలకోటలో కుచ్చోనుండే తిరుమల నాయకరు కలతను కూడా తొలగించాలని చూసింది. క్రీ.వె.1584లో పుట్టిన 'తిరుమల శౌరి నాయన అయ్యలు' గారిది ఒక్క రాజతంత్రంలోనే కాదు, పలు విద్దెలలో పేరు గడించిన చేయి. నేటి తెక్కణ తమిళనాడు అంతటికీ ఏలికగా ఉండిన ముద్దుక్రిష్ణప్ప నాయకరుకు రెండవ బిడ్డడిగా పుట్టినాడు. 1609లో గద్దెను ఎక్కిన తన అన్న, మొదటి ముద్దువీరప్ప నాయకరుకు తోడునీడగా ఉండినాడు. బిడ్డలు లేని అన్న 1623లో చనిపోవడంతో ఈయన గద్దెనెక్కినాడు. తన 39వ ఏట 'రాజరాజ తిరుమల శౌరి' అనే పేరుతో ఏలిక అయినాడు.

మొదటి ముద్దువీరప్ప నాయకరు ఏలుతున్నప్పుడే, అంతవరకూ విజయనగర దొరతనానికి కడతా వచ్చిన పన్నును కట్టకుండా నిలిపివేసినారు. దానితో మధుర తావును మళ్లా తమ కిందకు తెచ్చుకోవాలని విజయనగర దొరతనం ముమ్మరపడతా ఉంది. మైసూరు, తిరువిదాంగూరు దొరలు కూడా తాము అదివరకు కోలుపోయిన కొన్ని తావుల కోసం తరచూ పోరుపెడుతున్నారు. రామనాదపురం, శివగంగ తావుల్లోని మరవర్లు అప్పుడప్పుడూ చీకాకు పెడుతున్నారు. బిజాపూరు సుల్తానులూ, దగ్గరలోనే ఉన్న మరికొందరు ముస్లిం రాజులూ కలిసి తెక్కణాన్ని కమ్ముకొనేదానికి కాపుకాచి ఉండారు.

ఇట్ల చుట్టుముట్టూ ఉండే నిలవరాలు ఒకపక్క కలత పెడతా ఉంటే, మరొకపక్క విడవని ఎదపడిసెం తిరుమల నాయకరును పట్టి పీడిస్తా ఉంది. చలిగాలులు తగిలే కావేరమ్మ ఒడ్డునున్న తిరుచిని వదిలి, ఇంకొక తావుకు పోతే ఆయన నొగులు తగ్గవచ్చని వెజ్జుడు చెప్పినాడు. ఆ మాటతో తావుమార్పు కోసం, మీనాక్షమ్మను మొక్కివచ్చినట్లు ఉంటుందని మదురకు బయలుదేరినాడు. అట్ల పోతా ఉన్నప్పుడు దారిలో వచ్చిన దిండుగల్లులో ఒక రెయ్యి విడిది చేసినాడు. ఆ రేయి అతని కలలోకి మీనాక్షీ సుందరేశ్వరులు వచ్చి, మదురను తలనగరంగా చేసికొంటే అతని ఒళ్లు కుదుట పడుతుందని చెప్పినట్లుగానూ, దానికి ఆయన ఒప్పుకొన్నట్లుగానూ, ఆ మాటతో అతను మదురకు చేరుకోనే ముందుగానే ఆ నొగులు అతనిని వదిలేసినట్లుగానూ నోటి కతలు చాటింపులో ఉన్నాయి. ఈ నోటికతలో నెల్లెంతో పొల్లెంతో తెలియదుగానీ, మొత్తానికి తిరుమల నాయకరు 1634లో తన తలనగరాన్ని మదురకు మార్చేసిన మాట మటుకు నిక్కం. తంజావూరు దొరల తాకిడి ఎడంగా ఉండాలనో, లేక తన ఏలుబడి నేలకు నడుమను ఉండాలనో కూడా ఈ మార్పిడి చేసి ఉండవచ్చు.



తిరుమల నాయకర్ 432వ జయంతి సందర్భంగా మదురైలో ఫిబ్రవరి 2న జరిగిన ఉత్సవంలో పదివేల మందికి పైగా తెలుగువారు రాష్ట్రంలోని 15 జిల్లాల నుండి – ముఖ్యంగా కోయంబత్తూరు, తేని, విరుధ్‌నగర్‌ల నుండి పాల్గొన్నారు. ఆ సందర్భంగా నాయకర్ విగ్రహాన్ని గౌరవిస్తున్న దృశ్యం.

తిరుమల నాయకరు ఏలుబడిలో తెక్కణ తమిళనాడు, అంటే మదురతావు, 76 పాళయాలుగా చీలి ఉండేది. వాటి పాళయకారులు, ఆ పాళయాల్లో పన్నులు దండడం, చిన్నచిన్న దండులను పెట్టుకొని, పాళయాలను కాపాడడం వంటి పనులు చేసేవారు. దండిన సొమ్మునుండి కొంతపాలును తిరుమల నాయకరుకు పన్నుగా చెల్లించేవారు. రామనాడుని ఏలిన సేతుపతి, పాళయకారులందరికీ తలవరగా

ఉండినాడు. (ఆ పాళయకారుల కుదురులోనుండి వచ్చినవాడే, ఇప్పుడు కట్టబొమ్మన్, కట్టబ్రహ్మన అని పిలువబడుతున్న, గట్టిబొమ్మ నాయకరు కూడా).

బలమైన బిజాపూరు దండు బారినుండి తప్పించుకోవాలంటే, తెక్కణాన ఉన్న మైసూరు, మదుర, తంజావూరు, సెంజి, విజయనగరం వంటి తెలుగు ఏలుబడులన్నీ ఒక్కతాటిమీదకు రావాలనే తలపును ముందుకు తెచ్చినాడు తిరుమల నాయకరు. అందుకోసం విజయనగరానికి కొంత సొమ్మును కానుకగా ఇచ్చేదానికి కూడా ఆయన ముందుకొచ్చినాడు. విజయనగర రాజు కూడా ఇందుకు ఒప్పుకొన్నాడు. అయినా ఈ ఒప్పందం వలన ఒదవు లేకుండా పోయింది. అందరూ కలిసి రాలేదు. ముస్లిం దండు సెంజి, తంజావూరు ఏలుబడులను గెలుచుకొనింది. చివరకు తిరుమల నాయకరు కొంత సొమ్మును బిజాపూరు సుల్తానుకు ఇచ్చి తన ఏలుబడిని నిలుపుకోవలసి వచ్చింది. ఆ వెనక కర్నాటక పోరులో మైసూరును ఓడించి వెనక్కి తరిమినాడు.

ఇరుగుపొరుగు వారితో చిన్నాచితకా పోరులను వదిలేసి చూస్తే, తిరుమల నాయకుడి ఏలుబడి అమతిగానే సాగింది. దానివల్ల ఆ నాడులో కవరమూ కాపుదనమూ బాగా నడిచినాయి. పెద్ద మొత్తంలోనే పన్నులు వచ్చినాయి. ఆ సొమ్మునంతా గుడులూ గోపురాలూ కట్టడానికీ, పాత గుడులను తీర్చిదిద్దడానికీ, చెరువులూ కుంటలూ తవ్వించడానికీ, దారులూ బాటలూ వేయించడానికీ....ఇట్ల మంది మేలుకోరే పనుల కోసమే చెల్లు చేసినాడు ఆయన.

తిరుమల నాయకరు గురించి చెప్పుకోలసింది ఇంకొకటి ఉంది. అప్పుడు తెక్కణాన శివ, విష్ణు మతాల నడుమ గొడవలు ఉండేవి. ఈ రెండింటి ఒక్కట్టు కోసం ఆయన ఎంతో పాటు పడినాడు. ఒకచోట ఒక మతానికి చెందిన గుడి ఒకటి ఉంటే, దాని పక్కనే అంతే కొలతతో ఇంకొక మతపు గుడిని కట్టించినాడు. ఇట్లా పలుతావుల్లో చేసినాడు. అంతవరకూ శివమతం వాళ్ల మటుకే జరుపుకొంటా ఉండిన మీనాక్షమ్మ తిరునాళ్లను, చిత్తిర నెలకు మార్చి, ఇరు మతాలవారూ కొండాడే పండుగగా మార్చినాడు. అరకొరగా ఆగిపోయి ఉండిన మీనాక్షమ్మ గుడి రాజగోపురాన్ని కట్టించినాడు. పక్కనే తల్లాకుళంలో పెరుమాళు గుడిని కట్టించినాడు.

శ్రీవిల్లిపుత్తూరులోని ఆండాళు గుడిలో పూజ ముగిసినాకనే పగటిపూట కూడు తినేది ఆయన అలవాటు. అందుకోసం శ్రీవిల్లిపుత్తూరు మొదలుకొని మదురవరకూ అయిదుమైళ్లకు ఒకటిగా గంటలూ గోపురాలను కట్టించి, వాటిలో పెద్ద పెద్ద గంటలు పెట్టించినాడు. అవి మోగే దానినిబట్టి పూజ ముగిసిందని తెలుసుకోవచ్చు. చాలావరకూ చివికిపోయి ఈ గోపురాలు ఇప్పటికీ నిలిచి ఉన్నాయి.

జోడించిన చేతులతో, కిందకు జారిన బానకడుపుతో, చెరొకపక్క తన ఇద్దరు రాణులతో నిలబడి ఉండే తిరుమల నాయకుడి రాతిబొమ్మలను, ఆయన కట్టించిన గుడుల్లో ఇప్పటికీ చూడవచ్చు. అన్నట్లు, ఆయన శివ విష్ణు మతాలకు మట్టుకే కాదు, ముస్లిం దర్గాలకూ క్రీస్తు కూటములకు కూడా ఎంతో తోడుపడినాడు.

తిరుమల నాయకరు కట్టించిన గొప్ప కట్టడాల్లో, మదురలోని తిరుమల నాయకరు నగరు కూడా ఒకటి. ఇది తెలుగు – ముస్లిం (ఇండో – సార్సనిక్) కట్టడ తీరులో ఉంటాది. దీనిని ఇటలీ మరవరి

**1940–50ల తరిలో మొదలై ఇంకా కొనసాగుతున్న ఇప్పటి తమిళనాటి మెలన వెతుకులాటలో, తమిళ ఆరయికరులు తెలివిగా తెలుగును తొక్కేసినారు. అందులో వంతుగానే నాయకరాజుల గురించి చాలా చాలా తక్కువ పట్టించుకొన్నారు. గత పదేండ్లుగా అయితే తమిళులు, నాయకరాజుల ఏలుబడిని ఈసడించుకొని మాట్లాడుతున్నారు.**

కట్టినాడని చెపుతారు. సొర్గవిలాసం, రంగవిలాసం రెండు వంచవంతులు ఉంటాయి ఇందులో. తొలి దానిలో తిరుమల నాయకరూ, రెండవదానిలో ఆయన తమ్ముడూ ఉండేవాళ్లు. ఇవేకాక, పద్దెనిమిది తీరుల వాద్దెంలు వినిపించే సడియర, పోటుముట్టర, మ్రొక్కర, పేరోలగం, పల్లకిసాల, నడనసాల, దేవిడి, పూదోట, అడియరులర... ఇట్లా ఎన్నో ఉండేవి అందులో. నాయకరు నగరు ఇప్పుడున్న దానికంటే నాలుగింతలు ఉండేదంట అప్పట్లో.

ఇప్పటి తమిళనాడులోని తెక్కణపు తావయిన పాండెనాడును ఎంతో గొప్పగా ఏలి, తెలుగు వెలుగును ఆ తావంతా నింపిన తిరుమల నాయకరు, 1659లో తన 75వ ఏట కనుమూసినాడు.

1940–50ల తరిలో మొదలై ఇంకా కొనసాగుతున్న ఇప్పటి తమిళనాటి మెలన వెతుకులాటలో, తమిళ ఆరయికరులు తెలివిగా తెలుగును తొక్కేసినారు. అందులో వంతుగానే నాయకరాజుల గురించి చాలా చాలా తక్కువ పట్టించుకొన్నారు. గత పదేండ్లుగా అయితే తమిళులు, నాయకరాజుల ఏలుబడిని ఈసడించుకొని మాట్లాడుతున్నారు. ఈ నేలకు వాళ్లు చేసిన కీడు రవంతయినా లేకపోగా, చేసిన మేలు ఎంతో. 1529 నుండి 1736 వరకూ సాగిన తెలుగు నాయకరాజుల పాలనలో వేల చెరువులు వెలసినాయి. లక్షల కాదులనేల సాగులోకి వచ్చింది. రాయవేలూరు నుండి శుచీంద్రం (కన్నికుమరి దగ్గర) వరకూ లెక్కలేనన్ని గొప్ప కట్టడాలు నిలువెత్తున నిలిచినాయి.

అయితే తెలివిపరులు పక్కన పెట్టినా, ఈ కట్టడాలనూ చెరువులనూ బాటలనూ తలుచుకొంటానే ఉన్నారు పొదుమంది ఇప్పటికీ ఇక్కడ. తరం నుండి తరానికి నోటి నుండి నోటికి సాగిపోతా ఉన్న ఈ తెలుగు మెలనను తొలగించగలిగిన వాళ్లు లేరు, రారు.

**తెలియని మాటలకు అర్థాలు :**

కొళ్లిడం = కావేరి నది పాయ పేరు, వక్కణం = ఉత్తరం, తెక్కణం = దక్షిణం, దొరతనం = ప్రభుత్వం, నిలవరం = పరిస్థితి, ఎదపడిసెం = గుండెపడిశం, నొగులు = జబ్బు, ఒదవు = ప్రయోజనం, అమతి = శాంతం, కవరం = వ్యాపారం, కాపుదనం = వ్యవసాయం, చిత్తిర = చైత్రం, మరవరి = ఇంజనీరు, వంచవంతులు = ప్రధాన భాగాలు, సడియర = సంగీత మండపం, పోటుముట్టర = ఆయుధాగారం, మ్రొక్కర = పూజాగృహం, పేరోలగం = దర్బారు, నడనసాల = నాటకశాల, అడియరురలు = సేవకుల గదులు, మెలన = చరిత్ర, ఆరయికరులు = పరిశోధకులు, పొదుమంది = సామాన్యజనం.

రచయిత ఫోన్ : 09626217868

# దారిదీపం

నేనొక పిండంగా రూపుదిద్దుకుంటున్నప్పుడు
నా ఆకృతి పైపొరల్ని నిమురుతూ
అమ్మ పాడిన ప్రేమపాటని
నేనెలా మర్చిపోతాను !
నా ఆకలి దప్పుల్ని అనుక్షణం గుర్తు చేసుకుంటూ
అమ్మ అందించిన తేనెపలుకుల్ని
నేనెలా మర్చిపోతాను !
పుట్టగానే ఈ ప్రపంచానికి
నేనందించిన ఆహ్వానరోదనం
అమ్మ మాటల ఆరోహణావరోహణాక్రమంలోనేనని
నేనెలా మర్చిపోతాను !
అమ్మ చేయి వదిలి
విశాలవిశ్వంలోకి అడుగులేస్తున్నప్పుడు
అమ్మ పాటనీ మాటనీ కూడా
నానుంచి ఎవరో లాగేసుకుంటున్నట్లు
నేనెలా మర్చిపోతాను !
అశక్తంగా... అయోమయంగా
సందిగ్ధదృక్కులతో సర్వం కోల్పోతున్నట్లు
తన మాటనీ పాటనీ తానే మర్చిపోయి
అమ్మ కూడా వికృత శబ్దాలతోనే మాట్లాడుతోంది
అవే నాకు నేర్పించాలని ఆరాటపడుతోంది.
అమ్మా! నా తెలుగమ్మా!
నీకడుపులో ఉన్నంతకాలం
నువ్వూ నేనూ ఎంత బాగా మాట్లాడుకున్నాం.
పుట్టాక ఇప్పుడింత దగ్గరగా ఉన్నా
మనిద్దరి మాటల్ని ఏ సముద్రపు దొంగలు
దోపిడీ చేశారు?
ఎవరెన్నైనా చెప్పనీయి...
పెద్దయ్యాక నాకేదో అవుతుందనీ
ఇంకేదో ఎత్తులకి ఎదగలేననీ




మన మాధుర్యపు వనాల్ని ధ్వంసం చేయొద్దమ్మా!
ఎంతమంది ఎన్నివిధాల చెలాయించినా
మనిద్దరం మనభాషలోనే మాట్లాడుకుందాం!
అమ్మా! నీ మాటే నా గుండెల్లో వెలిగే దీపం
వెలుగు దారంతా వెలిగించే గమ్యం
బతుకుదారంతా వెలిగించే గమ్యం
అదే నా తోడుగా నడవకపోతే
నా జీవితమంతా కమ్ముకునే చీకటిని
ఏ సూర్యచంద్రులైనా కరిగించలేరు కదమ్మా!

**- డాక్టర్ సి. భవానీదేవి**
హైదరాబాదు, ఫోన్: 09866847000

బళ్ళారి కత

– గుత్తి (జోళదరాశి) చంద్రశేఖరరెడ్డి

# ఆకలికి రుచి తెలుసు

అయ్యలారా, అమ్మలారా నిజం చెప్పల్లంటే ఇది నిజంగా జరిగిన కథ. ఎక్కువ తక్వ నలభై ఏండ్ల పొద్దాయె. ఇంకా చెప్పాలంటే ఇది నా కథే. అట్లా అని చెప్పేదానికి నాకేం భయం లేదు, బెదురులేదు. నిజం చెప్పేదానికి భయమేల? ఒకానొక్క కాలంలో నా యాతనలు చూసి ఒరే నువ్విట్లుంటివా అని ఎవరైనా అడగతారా? ఒక పేద మనిసిలన దాగిండే మంచితనాన్ని ప్రపంచానికి టముకు యేసేటప్పుడు సిగ్గుపడరాదు కద!

మావూరు జోళదరాశి అని బళ్ళారికి దగ్గిరుండది. ఆడ, ఆమీన చాగనూర్లో సదువుకని, బళ్ళారి మునిసిపల్ హైస్కూల్లో చేరుకంటి (ఆ దినాల్లా దాని పేరు బందెలదొడ్డి). పిల్లోడు బాగ సదువుతడని మంచి పేరొచ్చె. అట్లాది, పదోతరగతిలో నాకు చెప్పన్నా చెప్పకుండా నా సంగటికాదు, ఏకపాత్రాభినయ పోటీలకి నా పేరిచ్చి నన్నిరికిచ్చె. పెద్దపెద్దోళ్ళు వచ్చిండిన ఆ పోటీలన పద్నాలుగేండ్లోనికి నాకే మొదటి బహుమతి రావల్నా! అప్పటికీ బాగనే వుంటి. ఎస్.ఎస్.ఎల్.సి.ల గూడ అందర్నీ కాదని నన్నే వరించాల్నా ఆ బహుమతి. పైగా ముఖ్య అతిథిగా వచ్చినాయన నా నటన చూసి నన్ను పైకెత్తి శభాష్ అంటా మెచ్చుకనె. ఇంగ నేనేమై పోవల్ల, రొవంత ఆలోచించండి. నాగేశ్వర్రావుకు బెత్తెడు ఎక్కువ, రామారావుకి జానెడు తక్కువ కదా, ఇంగ రేపో మాపో సిన్మాల్ల చేరేదే, యా పత్రిక జూసినా మన బొమ్మండాల్సిందే అనే వరకూ పిచ్చిపట్టుకనె. వచ్చిన సినిమానల్లా చూసిందే చూసింది. బువ్వకని ఇచ్చిన దుడ్లని కూడా సిన్మాలకే తగలేస్తుంటి. ఎస్.ఎస్.ఎల్.సి. బాగనే దాటేస్తికానీ, పి.యు.సిలో చిక్కొనిపోతి. 'ఊబిల దున్న బండి నాగరాజన్న' కథల అయినట్లయిపోతి. నీకేలరా సదువు ఎద్దు తోకరిసికని బదుకుదువురా అని కొన్నాళ్ళు సేద్యానికి నిలబడితి. జొన్నదంట్లు రెణ్ణాళ్ళు పెరికేతలికి చేతుల్ల కాయలుగాసె. ఎద్దులబండి తోలేదపుడు వాట కిడిపితి. అయ్యయ్యప్పొ ఇది శాతగాదురా తండ్రీ అని యాసరపడి, బళ్ళారిల సూరిబాబు అనే ఒకాయన సాయంతో మలేరియా నిరోధక శాఖలో ఇన్స్పెక్టర్ పని సంపాదించుకంటి.

చెప్రాదుగానీ ఆపని నా పగోనిగ్గూడ వద్దు. అంత పనికిరానిది. దినాము టీముల్ని తీస్కని శాఖవాళ్ళ బస్సుల్లో చెప్పిన పల్లెటూర్లకి పోవల్ల. ఆడ జనానికి చెప్పి డి.డి.టి. కొట్టిపియ్యల్ల. లేకుంటే మలేరియాతో వచ్చే కష్టాలు అర్థమయేదట్ల చెప్పల్ల. ఆవూర్లలో ఎవరన్న దయతలచి ఇంతపెడ్తే తినల్ల. ఏంటికంటే ఆ వూరుల్లన హోటళ్ళుంటాయా, వుణ్యా తినేకొతుందా?

అందరి విషయం పర్వాలేదు గానీ నా విషయమే శానా కష్టమయ్యేది. మనమేమొ కూరాకు తినేవాళ్ళం కాదు. కూరాకు తినే వాళ్ళింట్లో చేతులు కడిగే కతేలేని వాళ్ళం. మిగతావాళ్ళకంతా యాడబడితే ఆడ భోజనాలు



**“లేదన్నో లేదు. తినేసే పోవల్ల. నా బిడ్డమీద ఒట్టు” అంటా నా రెండు చేతుల్నీ పట్టుకనె. ఎట్లా మనిషి ఈయమ్మ! నేనెవరో తానెవరో? అడిగిన వాళ్ళకి ఉన్నంతలనే ఇంత పెట్టాలన్న ఉదాత్తమైన మనసుతో ఈమె రంతిదేవుణ్ణే గెలిచిందే. పైగా ఒట్టు కూడా పెట్కనె. ఏమి చేయల్లని అర్థమే కాలేదు. కానీ ఇంతట్లన నా కడుపుల ఎలకలు ఇంతింతెత్తు ఎగుర్తావుంటే, శోష వస్తావుంటే మెల్లిగా ఓడిపోక తప్పలేదు.**

దొరికేవి. నాదాక వచ్చేతాళకి పూరూర్ల అయిదారిండ్లే వుండేవి. నాకు నేనే అడిగేదానికి రెడ్డిపొగరు అడ్డమొస్తావుండె. ఎవరూ పిలీకుంటే పావలాపెట్టి బొరుగులూ రెండణాల పొప్పులూ కొని బుక్కాల్సి వచ్చేది. ఒకో వూళ్ళో అంగళ్ళ పరిస్థితి చూస్తే అవీ తినబుద్ధయ్యేది కాదు.

ఒగనాడు, ఆవూరిపేరు రారావి అయిండల్ల, ఆవూరికి పోయి వచ్చేదావల బస్సు చెడిపోతే బాగయ్యేదంక వుండి ఎనక్కొచ్చేతలికి రెయ్యి రెండు గంటలాయ. కూడు తినేకి సొందులేక అట్లే పండుకోని పొద్దున్నే ఆరు గంటలకే మళ్ళా బస్సులకెక్కితిమి. పలారమన్నా చేత్తమంటే ఆవూర్ల పోయి చేయండని మా సూపర్ వైజర్ తరిమేసె.

నేను పోయిన వూరిపేరు లోకప్పచేనంట. తుంగభద్ర ఆనకట్ట కింద భూములు మునిగిపోతే వాళ్ళకీడ భూములిచ్చి ఇండ్లు కట్టించిందంట సర్కారు. అంతా కలిసి అరవై ఇండ్లు. వాళ్ళని చూసి కూలిపన్లకోసం వచ్చి గుడిసెండ్లేస్కని ఇంగొక పది. హోటళ్ళు లేవు. ఊర్ల వుండే ఒకేఒక అంగడికూడ, ఆ పొద్దున్న వాళ్ళింట్లొ ఎవరో పోతే మూసేసిండిరి. అప్పుడు జూస్కండి మా తాపత్రయం. అందరమూ 'అన్నమో రామచంద్రా' అయితిమి. ఆవూరంతటికీ కూరాకు తినెనోళ్ళు నలుగురేనంట. అందరూ అంగిడాయనకు చుట్టాలేనంట. అందరిండ్లల్లన ముడిసెట్టంట. మిగతా వాళ్ళందరికీ ఏర్పాటు జరిగి అందరూ తినేదానికిపోతే నేనొక్కడ్నే మిగిలితి.

"మేము కూరాకు తినేవాళ్ళమేగానీ, ఎప్పుడో నెలకొగసారి. రాప్పసారూ ఇంత తినిపో మా యింట్ల" అని వూరి పెద్దాయన బతిమాలె. మనసులనే శానా గుంజాటాయె. కడాకి పొగరే గెలిసె. పండ్ల బిగువున "వద్దప్పా" అంటి.

ఊరంతా డిడిటి కొట్టి ఒకపక్కనుండే గుడిసెండ్లే తాకొస్తిమి. ఎప్పుడు పోయి ముద్దమింగదమా అనే ఆలోచనిడిసి ఇంకేమీ తలకెక్కడంలా. ఇంతలోపల మా టీముల స్ప్రేయరుగా పనిచేసే అంజినప్ప మెల్లగా ఆయింట్లోళ్ళతో మాటలు కలిపె. ఆ గుడిసెల సుమారు ముప్పైయేండ్లాయమ్మ ఒకతె, ఆరేండ్ల పిలగాడు ఒకడు ఉండారు. గూడుల్లన రొవొన్ని పుస్తకాలు.

"నీపేరేమమ్మా?" అడిగె అంజినప్ప.

"సర్వమంగళమ్మప్పా"

"ఇంటిపెద్ద లేడా?"

"ఈపొద్దు ఈవూళ్ళో రెడ్డోళ్ళింట్ల ముడిసెట్లు. పనిలేదు. దానికే పక్కూర్ల పనివుంటే పాపె. వచ్చేకి పొద్దు తడువౌతుంది".

"ఆయప్ప పేరేమమ్మా?"

"మఠం శరభయ్య స్వామప్పా"

ఆయమ్మ నోట ఆపేరు వస్తా ఉండగానే, నీళ్ళల కొట్టుకని పోయేవానికి కట్టెపలక దొరికనట్ల అంజినప్ప కుణుసుకంటా నాతాకొచ్చె.

"రెడ్డిసారూ, వీళ్ళు జంగమోళ్ళు, వీళ్ళింట్ల నువ్వు తినొచ్చు" అని నాతో అని "అమ్మయ్యా మా సారు అందరింట్లా తినేవోడు కాదు. పొద్దున్నించీ ఏమీ తిన్లేదు. ఆకలితన వుండాడు. ఈ పూటకి మీయింట్ల కుదుర్తదా?" అని అంజినప్పే ఆ సర్వమంగళమ్మనడిగె.

''అయ్యయ్యో మీరొచ్చే ముందుగాలనే నేనూ పిల్లోడూ తింటిమప్పా. పొద్దు పొయ్యినంక వచ్చే స్వామికని రెండే రొట్లు మిగిలిండావి. మేమూ ఈ నడుమే ఈటికొస్తిమి. కూలి చిక్తే కూడు, లేకపోతే మాడు అనే బదుకులప్పా మావి. ఇంట్లన ఒక గింజ కూడ లేదు. ఆకల్కొని వస్తే లేదనాల్సొచ్చె కదప్పా" అంటా ఆ తల్లి కండ్ల నిండికి నీళ్ళు తెచ్చుకనె.

'పాపి సముద్రానికి పోయినా అరికాలు తడవలేదంటే ఇదే' అనుకంటా వుంటే నా పొడి పెదాలమింద సన్న నగువొచ్చె. అప్పటి నా అవస్థ చెప్పేదానిక్కాదు. ఇంచుమించు కళ్ళు తేలిపోయే స్థితిలా వుండాను.

"ఎట్లా పనాయె కదన్నా! ఆకలికి ముద్ద పెట్టలేక పోతినే. మా స్వామి పనిజేసి ఆకలి ఆకలి అంటా వస్తాడు. ఎట్ల జేతునప్పా శివ శివా! అడిగినోళ్ళకి లేదంటే పాపమొస్తాదప్పా" అంటా ఆతల్లి కుమిలి కుమిలి ఏడుస్తా వుండాది. ఆడ, పని ముగించి పక్క గుడిసెలికి పోతావుంటే, ఆయమ్మ మనసులనే ఏమో తీర్మానానికి వచ్చినట్ల "వుండండన్నా" అంటా మాకడ్డం కట్టె.

"అన్నా, ఆకలి మీదుండాదు, తేలిపోతుండావు, రా అన్నారా, నామొగునికోసం పెట్టింది నీకే పెడ్తానన్నా. నా మొగునికి అతను కూలి గింజలు తెస్తే వండి పెడతాను" అంటా మొనగాని మాదిర అనింది.

నేను మాటలు కూడబలుక్కోని "గింజలు తేకపోతే ఎట్లమ్మా" అంటి.

"ఫర్వాలేదులేన్నా నామొగుడొకనాడు వుపవాసం ఓర్సుగంటాడ్లే మాకలవాటే" అనింది.

"వద్దమ్మావద్దు. నీమొగున్ని వుపవాసం పెట్టి నేను మాత్రం ఎట్లమ్మా తినేది. నేనూ ఈపొద్దొకనాడు వుపాసముంటే సావన్లే" అంటి.

"లేదన్నో లేదు. తినేసే పోవల్ల. నా బిడ్డమీద ఒట్టు" అంటా నా రెండు చేతుల్నీ పట్టుకనె. ఎట్లా మనిషి ఈయమ్మ! నేనెవరో తానెవరో? అడిగిన వాళ్ళకి ఉన్నంతలనే ఇంత పెట్టాలన్న ఉదాత్తమైన మనసుతో ఈమె రంతిదేవుణ్ణే గెలిచిందే. పైగా ఒట్టు కూడా పెట్కనె. ఏమి చేయల్లని అర్థమే కాలేదు. కానీ ఇంతట్లన నా కడుపుల ఎలకలు ఇంతింతెత్తు ఎగుర్తావుంటే, శోష వస్తావుంటే మెల్లిగా ఓడిపోక తప్పలేదు. బానల నీళ్లతో చేతులు కడుక్కని ఆయమ్మ చూపినతాన కుసంటి.

"అన్నా రెండే రొట్లు వుండావి. అవుట్ల మిందికి ఉల్లిగడ్డ పూరిమిండీ చింతొక్కు, ఇంకేమీలేదన్నా పేదోళ్ళమన్నా" అని ఆయమ్మ అంటుంటే నాకండ్లనించి నీళ్ళుకారేకి సురువాయె. ఆమె, సన్నతట్టల రొట్టెలూ పూర్మిండీ చింతొక్కువేసి నాముందర పెట్టింది.

"నీవు పేదరాలివా తల్లీ. నీయంత వున్నోళ్ళు ఎవరూ వుండరు తల్లీ. ఈపొద్దు నువ్వు చూపించిన మంచితనాన్ని మరవలేనమ్మా. అయితే ఒక్కమాట" అంటా ఆగితిని.

"అయినంక మాట్లాడువులే అన్నా ముందరతిను. ఎంతాకలి మిందుండవో?" అంటా ఆయమ్మ తట్టను ఇంకింత నాముందుకు జరిపె.

"లేదమ్మా నన్ను చెప్పనీ. నీమంచితనమే నాకడుపు నింపెనమ్మా. నువ్వేమో పిల్లోనిమింద ఒట్టుపెట్టుకంటివి. తినక తప్పదంటివి. మరి నేనూ నామిందే ఒట్టేసకని చెబుతుండను. అది ఇది చెప్పద్దు. నాకొక రొట్టె సాలు, స్వామికి ఆకలిగా వచ్చినపుడు ఒక రొట్టె పెట్టు. అప్పుడు ఇద్దరమూ తిన్నట్లయితది" అంటి.

"అదెట్లన్నా అర్థము కడుపుతో పంపుదునా"

సమీక్ష

# కృష్ణశాస్త్రి సాహిత్య సౌరభాలు




భావకవిత్వమనగానే మన మనసులో మెదిలే కవి కృష్ణశాస్త్రి. ప్రబంధ యుగంలో స్త్రీలను కేవలం శృంగార మూర్తులుగా అంగాంగ వర్ణన చేశారు. ఆ తర్వాత స్త్రీలను ప్రణయ మూర్తులుగా ఆరాధించారు భావకవులు. సుందరమైన పదాలతో, సుకుమారమైన శైలితో, మృదుమధుర భావాల రచనలతో సంతకం అక్కర్లేని కవి కృష్ణశాస్త్రి.

స్త్రీని ప్రేయసిగా, ఊర్వశిగా ఆరాధించిన కవి కృష్ణశాస్త్రి. ఆమె ప్రణయంలో పరవశించి, ఆమెనే ఊహించి, ప్రణయభావ ప్రసూనాలతో అర్చించాడు. ఆమె వియోగంతో వేగిపోయాడు. వేదనతో కుంగిపోయాడు. ఏదో తెలియని విచారంతో తనలో తనే బాధపడుతూ "నా కుగాదులు లేవు / నా కుషస్సులు లేవు / నేను హేమంత కృష్ణానంత శార్వరిని" అని దు:ఖించాడు.

పద్యం రాసినా, గద్యం రాసినా, సినిమా పాట రాసినా, లలితగీతం రాసినా, దేశభక్తి గీతం రాసినా, మనసుపై ప్రగాఢ ముద్ర కలిగిస్తుంది కృష్ణశాస్త్రి కవిత్వం. అలాంటి కృష్ణశాస్త్రి సాహిత్యం గురించి డా॥ నోరి రాజేశ్వరరావు గారు రచించిన కృష్ణశాస్త్రి సాహిత్య వైభవంలో సాహిత్య ప్రియులు తెలుసుకోదగిన అనేక విషయాలున్నాయి. పది అధ్యాయాలుగా విభజించిన ఈ పుస్తకంలో కృష్ణశాస్త్రి జీవితం గురించి, చిత్రసీమలో ఆయన పాత్ర గురించి, ఆకాశవాణికి 14 ఏళ్ళపాటు ఆయన చేసిన సేవగురించి, ఆనాటి ఉద్యమాల గురించి, ఎన్నో ఆసక్తికర విషయాలున్నాయి. ముఖ్యంగా కృష్ణశాస్త్రిగారి చమత్కారాలు మన హృదయానికి గిలిగింతలు పెడతాయి. చలం, ఆరుద్ర మొ॥ ప్రముఖ రచయితల అభిప్రాయాలు, కృష్ణశాస్త్రి కవితాశిల్పం, ఆయన మరణానంతరం స్నేహితులు, అభిమానులు ప్రకటించిన నివాళులతో కృష్ణశాస్త్రి కవిత్వాభిమానులకు కరదీపికలాంటిది ఈ పుస్తకం. 1980లో మద్రాసు రాజాలక్ష్మి ఫౌండేషన్ వారు కృష్ణశాస్త్రి "జీవితం – సాహిత్యం" పై గ్రంథరచనల పోటీ నిర్వహించినపుడు రాసిన పుస్తక మిది.

ఆకాశవాణి కోసం రాసిన శర్మిష్ఠ, వేణుకుంజం, గేయ నాటికల గురించి, ధనుర్దాసు, గుహుడు మొదలగు సంగీత రూపకాల గురించి, అపురూపమైన లలితగీతాల గురించి, అద్భుతమైన దేశభక్తి గీతాల గురించి విపులంగా ప్రస్తావిస్తారు. "ఒదిగిన మనసున పొదిగిన భావము" లాంటి లలిత గీతాలు "జయ జయ జయ ప్రియభారత జనయిత్రీ దివ్యధాత్రి "లాంటి దేశభక్తి గీతాలు "కైలాసగిరి నుండి కాశికై" లాంటి భక్తిగీతాలు ఆనాటి ఆకాశవాణిలో ప్రసారమై శ్రోతలను అలరించిన సందర్భాలు ఆసక్తికరంగా వుంటాయి.

'కృష్ణశాస్త్రి కవితాప్రభావబంధం నుంచి బయటపడడానికి చాలా బాధపడ్డాను" అన్న శ్రీశ్రీ అభిప్రాయం చదివినపుడు కృష్ణశాస్త్రి ప్రభావం ఎంత తీవ్రమైనదో అర్థమౌతుంది. శ్రీశ్రీ మహాప్రస్థానం గీతాలు కంఠస్థం చేసినట్లే కృష్ణశాస్త్రి పద్యాలు కంఠస్థం చేసే అభిమానులు చాలామంది వున్నారు. అందుకే తిలక్ "కవిత్వం ఒక ఆల్కెమీ, / అది కృష్ణశాస్త్రికి తెలుసు, / శ్రీశ్రీ కి తెలుసు, విశ్వనాథకు తెలుసు" అంటాడు. కృష్ణశాస్త్రి సమయస్ఫూర్తి గురించి సున్నిత హాస్యంగురించిన వివరాలు కుతూహలంతో చదివిస్తాయి. బ్రాహ్మణ్యంపై ఆయన వ్యంగ్యంగా రాసిన వేముకన్నా విషము వెలనాటి వైదికి పాము కన్నా విషము ప్రథమశాఖ అంతకన్నా విషము ఆరువేలన్నియోగి" వంటి హాస్యస్ఫోరక పద్యాలు చక్కిలిగింతలు పెడ్తాయి.

**- మందరపు హైమవతి**

**కృష్ణశాస్త్రి సాహిత్య వైభవం**

రచన : **డా॥ నోరి రాజేశ్వరరావు** (ఫోన్ : 9700926332)

100 పుటలు వెల రు. 125లు

ప్రతులకు : నవోదయ బుక్‌హౌస్, కాచిగూడ, హైదరాబాదు

(48 వ పుట తరువాయి)

"లేదు తల్లీ లేదు. నీలాంటి వాళ్ళుండగనే వానలు పడి పంటలు పండుతుండాయి. ఒగరొట్టికంటే తిన్లేనమ్మా" అంటా సగం ఊర్మిండీ చింతొక్కులను ఒక రొట్టెమింద పెట్టుకని తట్టను దూరంగా జరిపి రొట్టిని తుంచుకని ఊర్మిండీ చింతొక్కూ కలుపుకని నోట్ల పెట్టుకంటి.

ఆకలి నాలుక్కి రుచి తెలీదు, నిదరకంటికి సుఖం తెలీదని సద్దిమూటలాంటి పెద్దల మాట వుందిగానీ, నిజంగా ఆనాటి ఆ రుచిని మరవడమనేది నాకు సాధ్యంకానిది. (ఆతరువాతి బతుకుల పంతంపట్టి ఇంజినీరునై ఎన్నో మెట్లెక్కి ఎన్నో పెద్ద పదవులు చేరుకని, దేశదేశాలు తిరిగి ఎంతెంత ఖరీదైన భోజనాలు చేసినా, ఇల్లాలు సునీతమ్మ చేసే 'జొన్నరొట్టె నూనెంకాయలు' వేసుకంటా తినినా, ఆ సర్వమంగళమ్మ ఇంటిరుచి మరుపుకు రాదంటే మరుపుకు రాదు. ఆ ఒక్క తునకతోనే కడుపంతా నెమ్మది ఆవరించుకని ఎంత సుఖంగా వుణ్ణిందో చెప్పేదానికి నా భాషా పరిజ్ఞానం చాలదుగాక చాలదు.)

కడుపునిండి ఆనందంతో లేచి చేయి కడుక్కని "అన్నదాతా సుఖీభవ" అని మంచి మాట చెప్పితి. బయట కుసొనుండిన పిలగాణ్ణి "నీపేరేమి స్వామీ" అని అడిగితే, పాపోడు ఒళ్ళంతా తిప్పుకంటా బోసిగ్గుపడతా "ఈశ్వరయ్య" అని చెప్పినాడు. ఆ పిలగాడి చేతిలా రూపాయిబిళ్ళ పెట్టేదానికి పోతే ఆయమ్మ సరక్కన అడ్డుకట్టి "అదేమన్నా దుడ్డియొద్దన్నా మేము అన్నం అమ్ముకోలేదన్నా" అనింది.

కానీ నేనుకూడ గట్టిగా "నా మేనల్లునికి ఇచ్చే అధికారం నాకుందమ్మా" అంటా వాణ్ణెత్తు కని డబ్బులివ్వబోతిని. ఆ పాపోడు వద్దని ఒకటే పట్టు. అప్పుడు జేబులనించి అర్థరూపాయి కాసును తీసి "ఇంక వద్దనద్దమ్మా పిల్లోనికి పొప్పెరమెంట్లుకు" అంటా వాని జేబులకి జార విడిచి బిరబిరీన ఆడనించి వచ్చేస్తి. "చెప్తే వినవు కదన్నా" అంటా ఆతల్లి అంటుండే మాటలు చెవిల పడతుండినా నా నడక నిలపలేదు.

1. వాట కిడపడం : పడిపోవడం,
2. సంగటికాడు : స్నేహితుడు,
3. కూరాకు : మాంసం,
4. ముడిసెట్లు : మైల,
5. కుణుసు : చిందేయ / కులుకు

***(రచయిత ఫోన్ : 09177945559)***



# శ్రీ జి.శ్రీరామమూర్తి గారికి తాపీ ధర్మారావు పురస్కారం

హైదరాబాదులో 2015 జనవరి 17 శనివారం సా॥ గం. 5 లకు ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మేనేజ్‌మెంట్ అండ్ కామర్స్ కాలేజిలో జరిగింది. డా॥ సామల రమేష్‌బాబు అధ్యక్షత వహించారు. హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ ఎ.రామలింగేశ్వరరావు ముఖ్య అతిథిగా, ప్రెస్ అకాడెమి పూర్వాధ్యక్షులు శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావు విశిష్ట అతిథిగా, తెలంగాణ రచయితల వేదిక అధ్యక్షులు శ్రీ జయధీర్ తిరుమలరావు ఆత్మీయ అతిథిగా విచ్చేశారు. తాపీ ధర్మారావుగారి సహచరులు శ్రీ పరుచూరి హనుమంతరావు, శ్రీ నర్రా కోటయ్య గార్లు, తాపీ గారి మనుమరాలు శ్రీమతి సుజాతాషా, తాపీ వారి మనుమడు, సినీ దర్శకుడు కీ.శే. తాపీ చాణక్య కొడుకు డాక్టర్ తాపీ ధర్మారావు (అమెరికా) ఆత్మీయ అతిథులుగా పాల్గొన్నారు. ప్రముఖ పాత్రికేయుడు, పత్రికా సంపాదకుడు శ్రీ జి.శ్రీరామమూర్తి గారికి తాపీ ధర్మారావు పురస్కారాన్ని యిచ్చి సత్కరించారు. ఆ సందర్భంగా ఆయన తాపీ ధర్మారావు స్మారక ప్రసంగం చేశారు. ఆ ప్రసంగం పూర్తి పాఠాన్ని ఈ దిగువ యిస్తున్నాం.

# ప్రకృతిధర్మశోధకుడు.... స్వేచ్ఛాసమాజ దార్శనికుడు ఆకాశమంత వెలుగు **తాపీ ధర్మారావు**

**దే**వుడు, పాపపుణ్యాలు, ఇహపరాలు, వ్రతాలు, పూజలు, ముడుపులు వగైరా ఆధ్యాత్మిక దళారీ పన్నాగాలతో నిమిత్తం లేనిది మానవజీవితం అని స్పష్టం చేసి అష్టాంగమార్గ శాస్త్రీయ నిస్వార్థ నిరపకార జీవనవిధానాన్ని చాటిన గౌతమబుద్ధుడు మానవాళికంతటికీ చిరస్మరణీయుడు. ఆది మార్క్స్. ఎల్లవేళలా అనుసరణీయుడు. అలాగే మహాత్మా జ్యోతీరావు పూలే, బాబాసాహెబ్ అంబేద్కర్, పెరియార్ రామస్వామి- మానవుల మధ్య అసమానతలకు, మెజారిటీ ప్రజల బాధలకు కారణం సమాజం అవలంబిస్తున్న అమానవీయ పద్ధతులలోనే ఉన్నదని, సర్వమానవ సమానత్వ సాధనకు వాటిపై రాజీలేని పోరాటమే శరణ్యమని చాటిన మహానుభావులు వీరంతా. వారందరి హేతునేత్రాన్నీ మరింత సునిశితం చేశారు తాపీ. మానవ సమాజ మూలంలో ఇమిడి ఉన్న స్త్రీ పురుష సమానత్వ సూత్రాన్ని కనుగొని కనువిప్పు కలిగించిన అరుదైన ఆలోచనాపరుడు తాపీ ధర్మారావు. అందుకే యావత్తు భారతావని మాత్రమే కాదు స్త్రీ పురుష ప్రపంచమంతా గర్వించదగిన మహోదయుడాయన. ఆయనను కేవలం గిడుగు శిష్యుడుగానో, బూతుబొమ్మల పరిశోధకుడుగానో ఎవరైనా పరిమితం చేయదలిస్తే అది మానవాళి ప్రగతి పట్ల మహాపచారమే అవుతుంది.



శ్రీరామమూర్తి గారిని సత్కరించి, తాపీధర్మారావుగారి పురస్కార ప్రదానం చేసిన దృశ్యం. (కుడి నుంచి ఎడమకు) శ్రీయుతులు పొత్తూరి వెంకటేశ్వరరావు, నర్రా కోటయ్య, నాగసూరి వేణుగోపాల్, పరుచూరి హనుమంతరావు, జయధీర్ తిరుమలరావు, జస్టిస్ ఎ.రామలింగేశ్వరరావు, తాపీ ధర్మారావు (మనుమడు), సామల రమేష్‌బాబు, తాపీ సుజాతాషా (మనుమరాలు)

ధర్మారావుగారిపై మంచి పరిశోధన జరిపి ఆయన కృషికి సంబంధించిన అనర్ఘరత్నాల వంటి సత్యాలను వెలికితీసి అందించారు ప్రముఖ అభ్యుదయ రచయిత ఏటుకూరి ప్రసాద్. తాపీ పాతపాళీ స్పష్టి 'విలాసార్జునము' (నాటకం) గ్రంధానికి రాసిన ముందు మాటలో "నిజమే, గిడుగు శిష్యుడైన తరువాత మారందెవరు" అని ఆయన అన్నారు. అయితే తాను బడిలో గిడుగు శిష్యుడుగా ఉన్నప్పుడే ఆయనను ఎదిరించి గెలిచిన సందర్భాన్ని తాపీవారే ఆత్మకథ 'రాలూ-రప్పలూ' లో వివరించారు. ఒకనాడు ధర్మారావును చూసి ముఖాన బొట్టు లేదేం? అని గిడుగు అడిగారు. ఆ ప్రశ్నకు ధర్మారావు ఆశ్చర్యపోయారు. ఏం చెప్పాలో తోచలేదు. చివరకు తాను బ్రాహ్మణుడ్ని కానని (నాన్-బ్రాహ్మిన్) జవాబు చెప్పారు. అయితే బొట్టు అక్కర్లేదా! అని గద్దించి ధర్మారావు ముఖం

తనకి కనపడకుండా ఉండే లాగ తన కుర్చీ తిప్పేసుకుని గిడుగు పాఠం చెప్పుకు పోయారు. అయినా ధర్మారావు గారు గిడుగు బొట్టు నియమానికి లొంగ కుండా చరిత్ర పాఠ్యాంశంలో అనితరమైన ప్రతిభతో అప్పటివరకు విముఖుడైన ఆయనను సుముఖం చేసుకోగలిగారు. కాని బొట్టు ఎన్నడూ పెట్టుకోలేదు. ఈ ఒక్క ఘట్టమే చాలు ధర్మారావుగారి లోని హేతుదాహం గురువులోని సంప్రదాయం దృష్టిని కూడా ఎదిరించి ఎలా నిలిచి గెలిచిందో చెప్పడానికి. ధర్మారావుగారిది కేవలం మానవాభ్యుదయ దృష్టి, ప్రకృతి ధర్మశోధన తృష్ణే, హేతువు లోతులు చూపి అమానవీయతను పార ద్రోలాలన్న కాంక్షే. ఇందులో బ్రాహ్మణ – బ్రాహ్మణేతర దృష్టికికాక మానవతా చైతన్యానికే ఆయన ప్రాధాన్యం ఇచ్చారు. ఆచార్యులవారి దుర్బోధలతో పుచ్చిపోయి కుళ్ళిపోయిన అసమ, అమానుష సమాజం కృత్రిమ విలువల వలువలను నిలువునా ఊడ్చి నగ్నంగా నిలబెట్టడం ద్వారా పురుషాధిపత్య దుర్మార్గాన్ని చీల్చిచెండాడమే లక్ష్యంగా రచన చేశారు. సమాజ సమానత్వ సిద్ధాంతం పునాదిగా, ప్రకృతిధర్మ భావన పతాకంగా "పెళ్ళి–దాని పుట్టు పూర్వోత్తరాలు", "ఇనుప కచ్చడాలు", "దేవాలయాలమీద బూతుబొమ్మ లెందుకు?" వంటి అపూర్వ సత్యశోధన రచనలు ఆయన బుర్రనుండి జాలువారాయి. సృజనకు జనహిత శోధనను జోడించి విలక్షణ, విశేష సాహిత్య సంపదను సృష్టించిన మహనీయుడు తాపీ.



చెరగని స్ఫూర్తి తాపీ ధర్మారావు పుస్తకావిష్కరణ

శ్రీకాకుళంలో మొదటి తరగతులు చదువుకుంటున్న రోజులలోనే నిర్హేతుకమైన, నిరర్థకమైన. ప్రగతి నిరోధకమైన సంప్రదాయ పద్ధతులను ఎదిరించి నిలిచే బుద్ధి ధర్మారావుగారిలో అంకురించింది. నూనె కావడి ఎదురురావడం అశుభమనే మూఢనమ్మకాన్ని ఆనాడే ఆయన ఎదిరించారు. పనికట్టుకుని, ఎదురుగా వస్తున్న నూనెకావడిని దాటి ముందుకు వెళ్లారు. వెనుదిరగకుండా, అదురుబెదురు లేకుండా దానికి ఎదురుగా సాగిపోయారు. అప్పుడాయనకు, ఒకనాడు పంచెకట్టుకొని బడికి వెళ్ళాలనిపించింది. ఒక పంచెను కుడిచేతివైపు గోచీ పెట్టి కట్టుకుని బడికి వెళ్ళారు. దానిని గమనించిన మాస్టారు అదేమిటి అందరూ ఎడమగోచీ పెడుతుంటే నువ్వు అలా కట్టావేమిటి అని అడిగారు. అందరూ నవ్వారు. ఎందుకో తెలియక ధర్మారావు మొదట్లో బిత్తరపోయారు. తరువాత అర్థమయింది. కోపం వచ్చింది. "ఏం, ఇలా కట్టుకోకూడదా?" అని మాస్టారుని ఎదురు ప్రశ్నించారు. నలుగురూ నవ్వుతారని మాస్టారు అన్నారు. బడికి వచ్చినప్పుడు దారిలో ఎవ్వరూ నవ్వలేదే అని ఎదురు వాదించారు తాపీ. అయితే అలాగే కడతావా అని అడగగా అలాగే కడతానని జవాబు ఇచ్చారు. పంచె కట్టినంతకాలం తాపీ అలాగే కుడివైపు గోచీనే పెట్టి కట్టారు. (ఆధారం – తాపీ ధర్మారావు జీవితసంగ్రహం పేజీ 7–8)

ఒకప్పటి ఉత్తరాంధ్ర, కళింగాంధ్ర పొలం పనుల స్త్రీల చీరకట్టుకి ఇతర కోస్తాంధ్ర మహిళల కట్టుకి మధ్య ఉండిన తేడా తెలిసిందే. ఒక కట్టుగొప్ప, ఇంకోకట్టు తీసికట్టు అనడంలోని అనౌచిత్యమే గమనించ దగినది. శ్రామిక స్త్రీల కాయకష్టానికి చీర అడ్డుకాకూడదన్న స్పృహను అర్థం చేసుకోకుండా వారిది తలుపుల కట్టు అని అవహేళన చేసిన వారున్నారు. శరీరాన్ని కప్పుకోవడమే వస్త్రధారణ పరమోద్దేశం గాని ఏ తీరున కట్టారన్నది కాదు. పాశ్చాత్య ఆహార్యాన్ని అనుసరించిన మగవాడు స్త్రీని మాత్రం చాపచుట్టలోని మనిషిలా తెల్లతాను కట్టుకే పరిమితం చేయడానికి తాపత్రయ పడిన రోజులున్నాయి. ఇప్పుడామె జీన్స్ ధరిస్తే, చుడీదార్ వేస్తే స్త్రీల పాశ్చాత్య ఆధునిక వస్త్రధారణ వల్లనే రేప్‌లు ముమ్మరిస్తున్నాయంటూ మృగాళ్ళ దుర్మార్గాన్ని పరోక్షంగా సమర్థించే అత్యాచార్యులు సూటు బూటు వేసుకుంటూ అధికార శ్రేణుల్లో వెలిగి పోతున్నారు.

"ఆ విధంగా చిన్నతనంలోనే అలవరచుకున్న సంస్కరణ భావాలకు తన 17వ ఏటనే తన కుటుంబంలోనే ఆచరణరూపమివ్వనారంభించారు. (జీవిత సంగ్రహం పేజి 12)

తాపీ ధర్మారావుగారిలోని సంస్కరణాభిలాష, "అలాగే ఎందుకు, ఇలా ఎందుకు కాకూడదు" అని నాణేనికి రెండోవైపును కూడా చూసి తెలుసుకునే తత్వం, గిడుగు శిష్యుడు కావడానికి ముందే ఆయనలో అంకురించిందని చెప్పడానికే ఇదంతా.

గ్రాంధిక భాషా రచనలో విశేష ప్రతిభ చాటుకొని అనంతరం దాని నిరుపయోగితను, దానిలోని జన వ్యతిరేక లక్షణాన్ని తెలుసుకొని స్వచ్ఛమైన వాడుకభాషా రచనవైపు మళ్ళి, పాత పాళీ విడిచి కొత్తపాళీ చేపట్టడానికి దోహదం చేసిన మహోన్నతత్వం ధర్మారావుగారిలోని హేతుజిజ్ఞాస నుంచి ఉత్పన్నమైనదే కాని కేవలం గిడుగుపంతులుగారి శిష్యుడైనందువల్లనే సంక్రమించినదికాదు.

అలాగని గిడుగు రామ్మూర్తిపంతులు గారు వ్యావహారిక తెలుగుభాషకు చేసిన గొప్ప కృషిని, సేవను తక్కువ చేయడం నా ఉద్దేశం కాదు. గిడుగు గురించి తాపీ స్వయంగా చెప్పిన మాటలు ఇక్కడ ప్రస్తావించవలసి ఉన్నది. "గ్రాంధికాన్ని, గ్రాంధికవాదులను జలగడిగారు. పండితులకు పిడుగయ్యారు. వ్యావహారానికి ముఖ్య గురువయ్యారు"



జస్టిస్ ఎ.రామలింగేశ్వరరావు
ముఖ్య అతిథి

అని గిడుగును తాపీ కొనియాడారు. ('రాలూ–రప్పలూ – పేజి 56) తాపీ ధర్మారావు కూడా అసమాన భాషా సంస్కర్త. ప్రతిభను సొంతం చేసుకోవడంలో, సులభసాధ్యంకాని ప్రజ్ఞను పొదిలో అమ్ముగా ధరించడంలో ఆయన బ్రాహ్మణులతో పోటీపడి ముందు పీటీన నిలిచారు. అదే సమయంలో బ్రాహ్మణీయ మతం సమాజంపై రుద్దిన స్త్రీ పురుష అసమాన భావజాలాన్ని కూకటి వేళ్ళతో పెకలించడానికి నడుం కట్టి దానిని సాధించి చూపారు. ఆయన మూడవ క్లాసు చదువుతుండగా బడి నుంచి ఇంటికి దర్జాగా చేతులూపుకుంటూ వచ్చారట. అప్పుడాయన తండ్రి ఎదురై స్కూల్లో ఆయనకు ఏ ర్యాంకు వచ్చిందని వాకబు చేశారట. మొదటి, రెండవ ర్యాంకుల వారు బ్రాహ్మణులే అని తెలుసుకుని "చదువు బ్రాహ్మణులకేగాని మన పిల్లలకు అబ్బుతుందా" అని భార్యతో అన్నారట. ఆ మాట చెవిన పడిన క్షణం నుంచి పట్టుదలతో చదివి అన్ని సబ్జెక్టులలోను ఫస్ట్ మార్కు తెచ్చుకుని ధర్మారావు తన చాటుకున్నారు.

*మురుగులుంగరములు / ముత్యంపు సరులును /*
*పురుషుని గైసేయ భూషణములె / అరనిమేషమునకు అన్నియు*
*నశియించు / విద్యయొక్కటి ఎపుడు ఎడని తొడవు* – అని తనను, తన వేషాన్ని గేలిచేస్తూ పద్యం చదివిన ఉపాధ్యాయుడికి తన ప్రతిభతో సమాధానం చెప్పారు.

తాపీ సమకాలికులైన నార్ల వెంకటేశ్వరరావు వంటి వారు కూడా హేతువాదానికి, బ్రాహ్మణీయ (బ్రాహ్మణ వ్యతిరేకత కాదు) వ్యతిరేక భావజాలానికి పెద్ద పీట వేసి విశేష కృషి సాగించారు. అయితే ధర్మారావుగారు ఈ విషయంలో అత్యంత మౌలికమైన పునాది కృషి చేశారు. మానవసమాజ ఆవిర్భావదశలో, అనంతరం చాలాకాలం పాటు స్త్రీ పురుషుల మధ్య సాగిన సమతూక స్థితిని చాటడానికి ఆ తరువాత పురుష నిరంకుశత్వాన్ని స్థాపించడం కోసం పుట్టిన దుష్ట ఆచార సంప్రదాయాల వికృత రూపాన్ని ఎండగట్టడానికి సాగరమథనమంతటి శోధనను విజయవంతంగా నిర్వహించారు. సృష్టిలో సగమైన స్త్రీజాతి తరతరాలుగా అనుభవిస్తున్న పీడిన మూలాలను తవ్వి చూపించారు.

పద్యరచనలో ఎంతో సారళ్యాన్ని, ప్రతిభను కనపరచిన ధర్మారావు తరువాత కాలంలో నవనవ్య మానవీయ దృష్టితో అమోఘమైన పరిశోధనలు సాగించి సరళ సుందరమైన వాడుకభాషలో విశిష్ట రచనలు చేశారు. ఆయన సొంత చరిత్ర "రాలూ–రప్పలూ" ఇందుకు ప్రత్యేక ఉదాహరణ. "ఎంత ఆచార్యుడనండి, పురోహితుడనండి, ప్రీస్టు అనండి – ఏమన్నాసరే ఈ వ్యక్తి అసాధ్యుడు. ఏకై వచ్చాడు సంఘంలోనికి. మేకై కూర్చున్నాడు." ('పెళ్ళి – దాని పుట్టుపూర్వోత్తరాలు' పేజి 111). ఈ ఒక్క మచ్చు చాలు తాపీవారి సులభశైలికి. 'జనవాణి'లో తాను ప్రవేశపెట్టిన జనభాషను గురించి ధర్మారావుగారే 1969లో తెలుగు అకాడెమీకిచ్చిన ఇంటర్వ్యూలో ఇలా అన్నారు. "తక్కువ పదాలతో వాక్యాలు రాసేవాణ్ణి. సుమారు మూడే పదాలుంటాయి వాక్యంలో. అందువల్ల వ్యావహారిక మనిపిస్తుంది. క్రియా పదాలను వ్యావహారికం చేయడవే వ్యావహారికం కాదు. అదో టెక్నిక్ కనిపెట్టాను. గ్రాంధిక భాషావాదులకు కూడా ఆ రోజుల్లో దాన్ని కాదనగల ధైర్యం ఉండేది కాదు. నా శత్రువర్గం వాళ్ల పత్రికకు (ఆంధ్రప్రభ) సంపాదకుడుగా న్యాపతి నారాయణమూర్తి ఉండేవారు. అతడొచ్చి నా టెక్నిక్‌ని బాగా ప్రశంసించాడు".



డాక్టర్ పొత్తూరి వెంకటేశ్వరరావు
విశిష్ట అతిథి

మూఢనమ్మకాలను స్వార్థపర వర్గాల పన్నాగాలను చీల్చిచెండాడి మానవీయ ప్రాంగణాన మంగళధ్వానంగా భాసించారు తాపీ. అందుకే ధర్మారావుగారిని కేవలం విమర్శకుడు, రచయిత, కవిగానేగాక మార్క్స్ వంటి మహానుభావుల కోవలోని సామాజిక సత్యశోధకుడుగా పరిగణించవలసి ఉన్నది. ఇలా అంటే గాంధీ జయంతినాడు కోడికూర తిన్నావని బ్రాహ్మణీయ మీడియా ఎద్దేవా చేయగానే తొంభై శాతం జనం, ముఖ్యంగా శ్రామిక జనం ముఖ్య ఆహారమైన మాంసాన్ని ఏడాదిపాటు ముట్టకుండా చాంద్రాయణ వ్రతం వంటి శాకాహార దీక్ష పూనిన కమ్యూనిస్టు నాయకులు అభ్యంతరం చెప్పవచ్చు. బయటకు కనిపించని పిలకలు తలలో ధరించి లెఫ్టిస్టు మీడియాను ఏలుతున్న బ్రాహ్మణీయ మార్క్సిస్టులకు రుచించకపోవచ్చు. ఎర్ర 'దళితగోవింద' దాశరథుల తలకు ఎక్కకపోవచ్చు. కాని ఇది కాదనలేని వాస్తవం. నికార్సయిన నిజం. సామాజిక శోధనలో తాపీ మార్క్స్‌ను తలపించేవారే.

స్త్రీ పురుష నిజస్థితిపై, వారిద్దరి సంబంధాల మూలాలపై గాఢమైన పరిశోధన చేసి ఆధ్యాత్మిక ఐతిహాసిక జీవనం ముసుగులో ఇప్పటికీ బలవంతంగా అమలుచేస్తున్న పెడతోవలపై, దోపిడి 'దారుల'పై పిడుగులు కురిపించిన ధర్మారావు మానవీయమూర్తి.

"సరిసమానంగా ఉండే ఆడదానిని స్వాధీనం చేసుకొని బానిసగా చేశాడు మగవాడు. ఆడదాని అధికారాన్ని అంతటినీ తనది చేసుకున్నాడు. ఆడదానికి అధికారం ఉండకూడదని శాసనాలు చెక్కించాడు మగవాడు. ఆ దోషానికి ఫలితమా అన్నట్లు జరిగింది – ఆ మగవాడికి మగడుగా వచ్చాడు మన పురోహితుడు. టట్! పనికిరాదు. నేను చెప్పినట్టంతా నువ్వు చేయాలి! లేకపోతే శపిస్తానవి గుడ్లురిమాడు. పనికిమాలిన కోతిలాగా అనుకరణ చేష్టలన్నిటినీ చేయించాడు. అప్పటకీ ఇప్పటికీ నేను అధికారిని అని దబ్బా వాయించాడు. కాదు అన్నవాడిని కడజాతి వాడన్నాడు. అవును అన్నవాడిని అందలం ఎక్కించాడు". ('పెళ్లి – దాని పుట్టుపూర్వోత్తరాలు' పేజి 109) తాపీవారి ఈ శోధనను బట్టి బ్రాహ్మణీయ నిరంకుశత్వాన్ని ఎదిరించి వెలికి గురిఅయిన సామాజిక పోరాట యోధులే మన దళితులని అర్థమవుతుంది. ధర్మారావుగారిది Anti - Priestism మూఢాచారాల కర్మసిద్ధాంతయుతమైన ఆధ్యాత్మిక



డాక్టర్ జయధీర్ తిరుమలరావు
ఆత్మీయ అతిథి

దళారీతనం ముసుగు తొలగించడమే. దీనికి ఈ మతం ఆ మతం ఈ దేశం ఆ దేశం అనే ఎల్లలు లేవు.

హింసాహింసల చర్చలో గాంధీజీని అహింసామూర్తిగా కీర్తిస్తారు, ఆంగ్లేయ వలస పాలకులతో పోరాటంలో హింసాయుత ప్రతిఘటనను ఎంచుకోనందుకు కావచ్చు. కాని వాస్తవంలో హింస, అణచివేతలను అస్త్రాలుగా చేసుకుని నేటి ప్రజాస్వామ్య రాజ్యాంగపాలిత భారతావని లోనూ విర్రవీగుతున్న కుల వ్యవస్థను, పురుష నిరంకుశాధిపత్యాన్ని చూసీ చూడనట్టు వదిలివేశాడేగాని వాటి కొమ్ములు విరిచి రొమ్ము చీల్చి, వీధి, వాడ కలిసి జీవిచే సమ సామాజిక నవభారతాన్ని నిర్మించేందుకు చేయదగినంత కృషి గాంధీ చేయలేదు. మూలంలో హింస ముమ్మరించిన అగ్రవర్ణ నిరంకుశ, పురుష దురహంకార అసమ పల్లె సమాజానికి 'గ్రామస్వరాజ్యం' ప్రసాదించాలనడం ద్వారా అక్కడి దుర్నీతులకు అండ నిలిచి వాస్తవ సామాజిక జీవనంలో హింసామార్గాన్నే గాంధీ సమర్థించారు. దళితవాడలను దర్శించి ఓదార్చడమనే పనికిరాని పసలేని అత్యంత మితవాద సంస్కరణ దృష్టితో పీడితులను కంటితుడుపుగా సంతృప్తపరచ చూశారు. వైరుధ్యాలను తొలగించి సమత్వాన్ని సాధించ డమే నిజమైన అహింస. పులి, మేక కలిసి శాంతియుతంగా బతకాలని బోధించడం ఎంతమాత్రం అహింస కాదు.

కేవలం జంతు హింసను వ్యతిరేకించడం, శాకాహార భోజనం చేయడం అహింస కానేకాదు. మనిషి జీవన విధానంలో సాటి మనిషిపై స్వారీచేసి హింసించే అమానుషత్వాన్ని పరిహరించడమే నిజమైన అహింస. అది గౌతమబుద్ధునిలో, మహాత్మాపూలేలో, బాబాసాహెబ్ అంబేడ్కర్‌లో ఉన్నది. మరో కోణంలో – అంటే స్త్రీ పురుష సంబంధాల పరంగా మళ్లీ తాపీవారే నిజమైన అహింసా మార్గాన్ని చూపించారు. మగ ఆడ మధ్య అసమానత, ఘర్షణ, దోపిడీ కొంచెమైనా ఉండని స్థితే ప్రకృతి సిద్ధమైన సహజ సామాజిక స్థితి అని పరిశోధనాత్మకంగా రుజువు చేశారు. "ఆడది నాసొత్తు అన్న బుద్ధి పుట్టింది. మగవాడు మర్కటం అయిపోయాడు. ఎన్ని అనర్థాలకు పాలుపడ్డాడో ఎంత తెలివిమాలిన తనం ప్రదర్శించాడో చెప్పలేము. ఆలోచనా పాలోచనా లేని వట్టి శుంఠ అయిపోయాడు. తన అక్క ఆడది, తల్లి ఆడది, భార్య ఆడది వీరందరి వల్ల భవాన్ని అనుభవాన్ని పొందుతున్నాడు. అయినా మగవాడు స్త్రీని తిట్టిన తిట్లు ప్రపంచంలో ఎవరూ ఏ వస్తువునీ తిట్టలేదు. స్త్రీ అంటే యమదూత అన్నారు. కఠోర విష సర్పం అన్నారు. మృత్యుదేవతకు దగ్గర చుట్టం అన్నారు. నమ్మకూడదన్నారు. నారీ పిశాచం అన్నారు. గ్రంధాల నిండా ఈ తిట్లే, పుస్తకాలన్నింటిలోనూ ఈ ఉపన్యాసాలే. ఆడది అంటే అసహ్యం వేసేటట్టు చేయడానికి ఎన్ని ఉపాయా లున్నాయో అన్నిటినీ ఉపయోగించారు. ఎంత అన్యాయానికి ఒడిగట్టడానికి వీలుందో అంతా చేశారు. ఇంకా తనివి తీరక ఈ కచ్చడాల వంటి క్రూర పరికరాలకు కూడా దిగారు. ఇంతకన్నా మగవారి తెలివి తక్కువతనానికి నిదర్శనం ఏమి కావాలి. ఇంతకన్నా అసూయ, చూపోపమి ఇంకేమి ఉంటుంది. అయినా పెద్దవార మని తట్టపాగాలు పెట్టుకుని మాట్లాడతారు. గంటాలు, కలాలు పట్టుకుని రాస్తారు. స్త్రీ బుద్ధి: ప్రళయాంతక:'' అని ధర్మారావుగారు తన 'ఇనుప కచ్చడాలు' (పేజీ 52) పరిశోధన గ్రంధంలో తేటపరిచిన పండితమ్మన్యుల స్త్రీ వ్యతిరేక దృష్టిని గురించిన అభిప్రాయమే ఆయనలోని మానవీయ మహోన్నతికి, బాధిత స్త్రీజాతి పక్షపాతానికి తిరుగులేని ఉదాహరణ. ఆయన మౌలిక సామాజిక విప్లవకారుడు. బహుశ అందుకేనేమో బుధలోకం అనే స్వార్థపరుల మూక ఆయనను తగినంతగా గుర్తించలేదు.



డాక్టర్ తాపీ ధర్మారావు (మనుమడు)
ఆత్మీయ అతిథి

"ఎన్ని పూవులన్ వాలదు తేటి, అట్ల మగవాడనువానికి దోషమేమున్నది? ఇలాంటి సూత్రాలతో ఆడవారిని వలలో వేశాం" ('ఇనుపకచ్చడాలు – పేజీ 53) అని ధర్మారావుగారు పురుషపక్షపాత, స్త్రీ వ్యతిరేక సాహిత్యాన్ని ఎండగట్టారు. పూవు మకరందాన్ని దాల్చడం తుమ్మెద కోసమేనంటూ ఆ రెంటిని లైంగిక భాగస్వాములుగా చూడడంలోని అత్యుత్సాహం అంతా ఇంతా కాదు. పూవు పిందై కాయై ఫలదీకరణం చెందడానికి పరాగసంపర్కమే కారణమవుతుంది, కాని పువ్వుల తుమ్మెదల మకరందసంగమం కాదు. తుమ్మెదసాగించే పూదేనె వేట వల్ల పరపరాగసంపర్కం చోటు చేసుకోవడం వాస్తవం. అయితే అది కాకతాళీయమే. తుమ్మెద పరాగ వాహనం మాత్రమే. ఇతర దారుల్లోనూ మొక్క నుంచి మొక్కకు, పూవు నుంచి పూవుకు పరాంగం చేరవేత జరుగుతుంది.

తాపీ ప్రకృతి ధర్మశోధన మానవాళి ముంగిట వాలిన స్వేచ్ఛా విహంగం వంటిది. పురుష బానిసత్వం నుంచి స్త్రీ పరిపూర్ణ విమోచన పొందినప్పుడే మానవ ప్రపంచానికి నిజమైన స్వేచ్ఛ అని, అందుకు పెళ్లి అనే నిర్బంధ తంతును విడనాడవలసి ఉన్నది అని ఆయన సమూల పరిశోధనతో చేసిన నిర్ధారణే ఇందుకు తార్కాణం. "రంకున పుట్టినవాడూ కొడుకే, దంపతులకు పుట్టినవాడూ కొడుకే, వ్యత్యాసం రవంతైనా లేదు. అంత సులభంగా సంతృప్తిపడే సృష్టికి పెళ్లి నిబంధన అక్కర్లేదు – తాపీ ఇంత నగ్నంగా 'కటువు'గా చేసిన సృష్టీకరణ వెనక ఉన్నది స్త్రీ పురుషులు సమాన స్వేచ్ఛతో సమ భాగస్వామ్యంతో సరిసమాన బాధ్యతతో ఒక బండికి పూన్చిన రెండు ఎద్దుల మాదిరిగా ప్రకృతిని ముందుకు తీసుకు పోవలసి ఉన్నదని చెప్పడమే. అందుకు పెళ్లి అనే ప్రత్యేక వ్యవస్థ, దానిమాటున గల పౌరోహిత్య దోపిడీ అనవసరమని వివరించడమే.

తాపీ ఇంకా ఏమన్నారో చూడండి. "ఈ విషయంలో ఒక్క సత్యం గ్రహించాలి. ఏమిటంటే, పెళ్ళి అన్నది సృష్టికి కావలసిన ఆవశ్యకత



డాక్టర్ సామల రమేష్‌బాబు
అధ్యక్షులు

కాదు. సృష్టి అవిచ్ఛిన్నంగా కొనసాగడానికి జతకట్టడం ఉంటే చాలును. పెళ్ళి అనే పత్రాకులు పడనక్కరలేదు. (పెళ్లి - దాని పుట్టు పూర్వోత్తరాలు 85వ పేజీ) "ఎలాంటి పెళ్లయినా సరే, దానిలో శాశ్వతగుణం ఏదీ లేదు అన్నమాట ముఖ్యంగా జ్ఞాపకం ఉంచుకోవాలి. అటువంటి స్థితిలో నుంచి ఇప్పటి పెళ్లిళ్ల అభిప్రాయాలను పుట్టించారు– నీటిలో అగ్గి పుట్టించినట్లు. కన్యాత్వం, పాతివ్రత్యం, మతం, జన్మజన్మాలకు శాశ్వతత్వం - ఇలాంటివన్నీ దీనిలో ప్రవేశ పెట్టారు. అది చిత్ర చరిత్ర" (పేజీ86). అలాగని స్త్రీ పురుషులు విచ్చలవిడి శృంగారానికి మాత్రమే పాల్పడి బాధ్యతారాహిత్యంతో మెలగాలన్నది ఆయన అభిప్రాయం ఎంతమాత్రం కాదు. పెళ్లి లేకుండా ఉభయుల ఇష్టాయిష్టాలకు లోబడి బాధ్యతాయుతంగా సహజీవనం సాగిస్తున్న స్త్రీ పురుషులు నేడు ఎంతమంది లేరు! వారివల్ల వ్యభిచారం, అసభ్యత, విచ్చలవిడి శృంగారం ప్రబలుతున్నదని చెప్పగల ధైర్యం ఎవరికి ఉంటుంది? అలా జీవించడం వల్ల స్త్రీ బానిస సంకెళ్లు బదాబదలవుతున్నాయి. అసమ సంసార బంధనాలు తెగిపడుతున్నాయి. "గర్భం వల్ల పనిపాటులకు ఆటంకం కలగడం ఇప్పటిలాగా నెలలతరబడిని కాదు. ఆ రోజులలో చాలా స్వల్పకాలం మాత్రమే అన్నమాట మరిచిపోనక్కర్లేదు. ఇప్పటికీ పాటక జనాలలో కడుపుతో ఉండటం వల్ల పనికి నాగా కలగడం చాలా తక్కువ రోజులు. అయినా, ఆడదానికి అది ఒక అవసరమే. పెద్ద అవసరం. దానిని చేసుకునే సంఘ జీవితంలో మగవాడు ఏకు–మేకైపోయాడు. ఆడదానిని పనిగొడ్డుగాను, బానిసగాను చేసిపారవేశాడు. అధికారాలన్నీ మగవారివని అరవ చాకిరీ అంతా ఆడదానిదనీ నీతులు చెప్పాడు.... ఈ అవసరం అన్నదే ఆడదానికి లేకపోతే, ఆడదాని జీవనం ఇంత అధ్వాన్నంగా మారి ఉండదు. సృష్టికి, స్థితికి ముఖ్యకారణమైన ఈ గుణం ఎంతో గౌరవించవలసింది. ఎంతో పెద్ద స్థానం దీనివల్ల ఆడవాళ్లకు ఇవ్వవలసింది. అదంతా పోయింది. మగవాడు దీనిని సాకుగా చేసుకుని అధికారం అంతా ఆడదాని దగ్గర నుంచి గుంజుకున్నాడు. ('పెళ్లి - దాని పుట్టుపూర్వోత్తరాలు పేజీ 56). "ఈ అబలలను తయారుచేసినవారము మనమే. అసలు లోకంలో స్త్రీలందరికీ కచ్చడాలు బిగించినా వ్యభిచారం ఆగదు. అలాగే లోకంలో ఉన్న స్త్రీలందరినీ విచ్చలవిడిగా, స్వేచ్ఛగా విడిచిపెట్టినా అందరూ వ్యభిచరించరు" ('ఇనుపకచ్చడాలు' - పేజీ 54) "సృష్టిలో తయారైన ఆడది అబలకాదు. మగవాడితో అన్ని విధాలా సరిసమానంగా ఉండేది. వ్యత్యాసమన్నది ఏదీలేదు" ('పెళ్లి - దాని పుట్టుపూర్వోత్తరాలు' పేజీ - 56) ఇక్కడ ఇంకొక విషయం గమనార్హం. స్త్రీని బందీగా చేసుకున్న మగవాడు ఆమె మరో మగవాడి ఆధీనం కాకుండా చూసుకోవడమే అనునిత్య విధిగా చేసుకొని ఆత్మవంచనకు పాల్పడుతున్నాడు. దీనిని వివరిస్తూ తాపీ ఇలా అన్నారు. "ఆడదానిలో తాను కోరిక మంచితనం తనలో లేదని గ్రహించడానికి జ్ఞానం చాలింది కాదు. తన స్త్రీకి ఒక్క కచ్చడం బిగించి తాను మరొక ఇంటికి కచ్చడం భేదించడానికి బయలు దేరుతాడు ('ఇనుప కచ్చడాలు' - పేజీ 56) "ఆడదిగూడా ఒక ఆస్తి అన్న అభిప్రాయమే అప్పుడు ఇప్పుడు గూడాను. నా ఆస్తి ఇంకొకడు అనుభవించడమా అన్న ఈసే మగవాడికి" ('పెళ్లి–దాని పుట్టుపూర్వోత్తరాలు–పేజీ 104).



శ్రీ పరుచూరి హనుమంతరావు
ఆత్మీయ అతిథి

మోసకారి పవిత్రతను ప్రయోగించి గుడిని పురోహిత వర్గ బందీగా చేసి సృష్టికార్యాన్ని బూతుగా ప్రచారం చేసిన హైందవ సామాజిక దొరతనం కుట్రను 'దేవాలయాల మీద బూతుబొమ్మలెందుకు' అన్న అపూర్వ అసాధారణ పరిశోధనా వ్యాసంతో దునుమాడిన తాపీ, మానవతా తాత్విక పతాకగా రెపరెపలాడారు. ఇంత చక్కని సామాజిక చైతన్యాన్ని అక్షరీకరించి అందించిన తాపీని అధ్యయనం చేసి ఆ వెలుగులో తనను తాను సంస్కరించుకొనని సమాజానికి భవిష్యత్తు ఉండదు.

పాత్రికేయ వృత్తి ఎంతటి అసిధారవ్రతమో తెలిసిందే. ఆ అగ్నిపరీక్షలో నెగ్గి జనహిత జర్నలిస్టుగా నిరూపించుకున్న అరుదైన అక్షరసేనాని తాపీ ధర్మారావు. ప్రజాస్వామ్య వ్యవస్థలో మీడియాకు పెట్టుబడి శరీరమైతే ప్రజాహిత లక్షణం ప్రాణం కావాలి. కాని దురదృష్టవశాత్తు నేటి మీడియా తనకు నిజమైన యజమాని అయిన ప్రజాస్వామిని పూర్తిగా నిర్లక్ష్యం చేసే పెట్టుబడి యజమాని దాస్యంలో తలమునకలవుతున్నది. Noam Chomsky చెప్పినట్లు Manufacturing Consent ప్రాధాన్యమిచ్చి ప్రజల కళ్ళకు గంతలు కడుతున్నది. అందుచేతనే ప్రజలను మెప్పించడం కంటె మీడియా చేత మెప్పులు పొందడమే లక్ష్యంగా పాలించే దుర్విధానాన్ని నేటి పాలకులు పాటిస్తున్నారు. మీడియాను జేబులో బొమ్మగా చేసుకునేందుకే ప్రాధాన్యం ఇస్తున్నారు. ఇందుకోసం కార్పోరేట్‌ల చేత మీడియా సంస్థలు నెలకొల్పింపచేసి వాటి ప్రచార సమాచార గారడీతో ఎన్నికలలో విజయాలు సాధించి అధికారంలోకి వచ్చిన తరువాత బడా పెట్టుబడిదారీ సంస్థల ప్రయోజనాలకు పల్లకీ మోస్తున్నారు. ఇక్కడే ధర్మారావుగారి పాత్రికేయ నిబద్ధతను గురించి చెప్పుకోవలసి ఉన్నది. ఇప్పటిమాదిరిగానే అప్పుడు కూడా రాజకీయపార్టీలు స్వీయప్రచారం కోసం పత్రికలు నెలకొల్పడం లేదా పత్రికలకు దన్నుగా ఉండటం ఉండిందని 'జనవాణి' దినపత్రిక చరిత్రే చెబుతుంది. అప్పటికి 'ప్రజామిత్ర' పత్రిక ('దేవాలయాల మీద బూతుబొమ్మలెందుకు?', 'కొత్తపాళీ' వ్యాసాలను 1936వ సంవత్సరంలో 'ప్రజామిత్ర' ధారావాహికంగా ప్రచురించింది)తో ధర్మారావుగారికి సన్నిహిత సంబంధాలుండేవి. ఆ రోజుల్లో 1937 ఎన్నికలు దగ్గరపడ్డాయి. అప్పుడు మద్రాసు రాష్ట్ర జస్టిస్‌పార్టీ అధికారంలో ఉంది. ముఖ్యమంత్రి



డాక్టర్ ఏటుకూరి ప్రసాద్
తాపీ జీవితం, రచనలు గ్రంథకర్త

బొబ్బిలిరాజా. పలు విషయాలలో ఆయనతో విభేదించిన పిఠాపురం రాజా ఎన్నికల ప్రచారం కోసం 1936లో ఇంగ్లీషు, తమిళం, తెలుగు భాషల్లో దినపత్రికలను ప్రారంభించారు.

తెలుగు పత్రికకు 'జనవాణి' అని పేరుపెట్టారు. అంతకుముందు 'సమదర్శిని'కి సంపాదకులుగా పనిచేసిన అనుభవాన్ని, ఆయన సాహితీ ప్రతిభను దృష్టిలో పెట్టుకుని ధర్మారావుగారినే ఆ పత్రికకు సంపాదకులుగా ఎంపిక చేశారు. (ఆధారం – తాపీ ధర్మారావు జీవిత సంగ్రహం, పేజీ 39) "ధర్మారావుగారికీ ఆనాడు ఆ పత్రికలో పనిచేసిన వారెవరికీ పీపుల్స్‌పార్టీ రాజకీయాలుండేవి కావు. అందరివీ జాతీయవాద భావాలే" అని బోయి భీమన్న తెలిపారు. సుప్రసిద్ధ కవి, రచయిత బోయి భీమన్న అప్పటికి 'జనవాణి' పత్రికలో సంపాదకేతర విభాగంలో గుమాస్తాగా పనిచేస్తూ ఉన్నారు. భీమన్న ప్రతిభను గుర్తించి తాపీ ఆయనను సంపాదక వర్గంలో చేర్చుకున్నారు. జానపదుడు అనే కలం పేరుతో తన చేత పత్రికలో రాయించింది ధర్మారావుగారేనని భీమన్న చెప్పుకున్నారు. 'జనవాణి'లో ధర్మారావుగారి సంపాదకత్వంలో నార్ల వెంకటేశ్వరరావు, పి. శ్రీరాములు, పండితారాధ్యుల నాగేశ్వరరావు వంటి ప్రతిభావంతులు పనిచేశారు. సాధారణ పాఠకలోకం చదివి సులభంగా అర్థం చేసుకోవాలంటే 'జనవాణి'లోని వార్తలు, వ్యాఖ్యలు వాడుకభాషలోనే ఉండాలన్న నిబంధనను తాపీ కచ్చితంగా అమలు జరిపారు. జనవాణి సంపాదకీయాలు పీడిత జనపక్షపాత మందుపాతరలు. యలమర్రు, కాటూరు గ్రామాల్లో 1949 జూలై 14,15 తేదీలలో పోలీసులు సాగించిన అమానుషాన్ని, దారుణ దురాగతాన్ని ఖండిస్తూ "జలియన్‌వాలాబాగ్‌ను దిగదుడిచిన ఘట్టంగా పేర్కొన్నారు. ఆ ఒడ్వయర్, ఆ జనరల్ డయ్యర్ మేకపిల్లలైపోయారే వీరిముందు" అని సునిశితంగా ఖండించారు. 'కాగడా' పత్రికలో ఆనాటి అజ్ఞాతంలోని కమ్యూనిస్టు వీరుల క్షేమ సమాచారాలందించి. వారే కుటుంబాల, అభిమానుల ఆందోళనను చల్లార్చిన నిజమైన జనమానస మిత్రుడు తాపీ. ఈ విషయంలో తాపీది నార్లకు భిన్నమైన దారి. అందుకే ఆనాటి ఘనమైన ప్రజాపోరాట చరిత్ర కలిగిన కమ్యూనిస్టులు ఇప్పటికీ తాపీని స్మరించుకుంటారు.

"సమాజంలో కొత్త జీవకళను ప్రకాశింపచేసేందుకు పత్రికాముఖంగా సాయపడడమూ, సమాజంలోని వివిధ అంశాలను, దానిలోని వివిధ పరిణామాలనూ సహేతుకంగా విశదీకరించి పత్రికా ప్రపంచంలో ఒక కొత్తయుగాన్ని స్థాపించడమూ" 'కాగడా' పత్రిక ఆశయాలుగా ధర్మారావుగారు ప్రకటించారు.

నార్లను నార్లవారు అని సంబోధించేవారు ధర్మారావుగారిని తాపీవారు అని ఎందుకు అనలేదు అనే ప్రశ్న ఉదయించక తప్పదు. అయితే అలా అని ఉంటే తాపీ దానిని వ్యతిరేకించి ఉండేవారు. ఎందుకంటే ఆయన మహానుభావుడుగా కాక సామాన్యుడుగా గుర్తింపు పొందడమే ఇష్టపడేవారు. "మా వంశంలో ఇప్పుడుగాని, ఇకముందుగాని, ఎవ్వరెంత ఐశ్వర్యంలో ఉన్నా దీనికంతటికీ మూలం తాపీ పని అని మరిచిపోరు. మాదీ ఒక కార్మిక వంశమన్నమాట జ్ఞాపకముంచుకుంటారు. ఎప్పుడైనా ఒళ్లువంచి కష్టపడవలసి వచ్చినప్పుడు అది ఒక చిన్నతనంగా భావించడానికి జంకుతారు" అని ధర్మారావు తన ఆత్మకథ పుస్తకంలో రాసుకున్నారు.

డ్రెడ్జర్‌కి తవ్వోడ అని, అటువంటి ఇతర మంచి తెలుగుపదాలను ఉపయోగించినందుకు నార్లను ఇప్పటికీ, ఎప్పటికీ ప్రగతిశీల పాత్రికేయుడుగా, తెలుగు పత్రికాభాషలో కొత్తపద సృష్టికర్తగా చెప్పుకుంటాము. అందులో అతిశయోక్తి లేదు. అలాగే ఎ బర్డ్స్ ఐ వ్యూ – ఖగేక్షణానికి -- పిట్టచూపు అని అచ్చతెలుగు చేసిన తాపీ ధర్మారావుగారిని పత్రికాభాష కంఠాన ఆణిముత్యాలవంటి తెలుగు పదాలను అలంకరించినవారుగా చెప్పుకోవలసి ఉన్నది. పొల్లు–నెల్లు, కర్ణపిశాచం, పేలుడు గాయాలు అనే తలపేరులను తన సొంత యాజమాన్యంలో నడిచిన 'జనవాణి' మాసపత్రికలో తాపీ ప్రయోగించారు. నెల్లు అంటే ధాన్యమని ఆయన 'జనవాణి' తొలిసంచికలోనే తెలియచేశారు. 'జనవాణి'ని ఆయన స్వయంగా నడిపినపుడు నాటి 'జనవాణి' పరతంత్ర, నేటి 'జనవాణి' స్వతంత్ర అని చెప్పుకొన్నారు. ప్రజా ఉద్యమాల వార్తలకు 'కదలిక' అని పేరుపెట్టడంలోనే ఆయన చైతన్యం వెల్లడవుతున్నది. తడాకా అన్నది. మరొక జనభాషా ప్రయోగం. ఇప్పుడు అత్యధిక సర్క్యులేషన్ గల తెలుగు దినపత్రికలే పిల్లిని మార్జాలం అని పేర్కొన్న మాదిరిగా సంస్కృతాంధ్ర పదాలతో కూడిన మర తర్జుమాలతో పత్రికాభాషను భ్రష్టుపట్టిస్తున్న తీరు తాపీ, నార్ల వారి జనభాషా స్ఫూర్తికి కళంకం తెస్తున్నది. "తొలి నుంచీ .... కొత్తదారుల కోసం నెమకినవారు. అటు పాశ్చాత్య సాహితీసంస్కృతులను, ఇటు జాతీయ సారస్వత సభ్యతలను చక్కగా జీర్ణించుకొని ఆధునిక దృక్పథంతో అపూర్వ రచనా సంవిధానంతో తన తావు తాను చూసుకొని తన గొంతు తాను వినిపిస్తూ విశిష్ట వ్యక్తిత్వం వెలార్చిన మనిషి ఆయన. నవ్యాతి నవ్య దృష్టితో సమాలోచించగల ధీశాలి. తెలుగు దినపత్రికలలో తొలిసారిగా వ్యావహారిక భాషను ప్రవేశపెట్టిన సాహసి కూడా ఆయన" అని తాపీ ధర్మారావు చనిపోయినపుడు విద్వాన్‌విశ్వం 'ఆంధ్రప్రభ'లో సంపాదకీయ నివాళి అర్పించారు. అలాగే "మన తెలుగు సినిమాలలో వ్యావహారిక భాష ఆయన పెట్టిన భిక్షే" అని ఆరుద్ర 'వనిత' మాసపత్రికలో కొనియాడారు. ఇటు పత్రికలలో అటు చలనచిత్రాలలో ఒకేసారి వాడుక తెలుగుకు పట్టంకట్టిన అసాధారణ జనాక్షరమూర్తి తాపీ. "మనకున్న ఉద్దేశాన్ని ఎలాగ చెప్పితే సులభంగా అవతలి వాళ్లకు బోధపడుతుందో అలాగ చెప్పేదే భాష. ఆ బోధపడటం ఎంత చక్కగా ఉంటే అంత చక్కని భాష అనాలి" అని తాపీ తన 'కొత్తపాళీ'కి ఇచ్చిన నిర్వచనమే జనభావ పరిపుష్టం. విశాఖపట్టణం అనే దీపం కింద నీడలా ఇప్పటికీ అనామకంగా మిగిలిపోయిన శ్రీకాకుళం తాపీవారి స్వస్థలం కావడం నాబోటి ఆ జిల్లావారికి గర్వకారణం.

పాత్రికేయుడుగా, పత్రికా సంపాదకుడుగా మానవాళి ప్రగతికి తోడుపడడమే పరమావధిగా తాపీవారు కృషిచేశారు. చామకూర



శ్రీ నర్రా కోటయ్య
ఆత్మీయ అతిథి

వేంకటకవి 'విజయ విలాసా'నికి ధర్మారావుగారు రాసిన హృదయోల్లాస వ్యాఖ్యకు 1971 సంవత్సరం కేంద్ర సాహిత్య అకాడెమీ అవార్డు లభించింది. ఆ సందర్భంగా ఆయనను సన్మానించిన సభలో నార్ల వెంకటేశ్వరరావుగారు ప్రసంగిస్తూ "భౌతికంగా 85 సంవత్సరాలు వచ్చినా, మానసికంగా నిత్య నూతనత్వం తొణికిసలాడుతున్న సాహితీకారుడు ధర్మారావు" అని పేర్కొన్నారు. గ్రాంధిక భాషావాది అయిన డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డిగారే తనతో 'జనవాణి'ని గురించి మాట్లాడుతూ "తాపీ ధర్మారావుగారు పసగల మంచి భాష వాడుతున్నార"ని మెచ్చుకున్నట్టు నార్ల ఏటుకూరి ప్రసాద్‌తో అన్నారట. ఎలా రాయాలో తాపీ నుంచి నేర్చుకున్నానని కూడా నార్ల ఒక సందర్భంలో అనడం గమనార్హం. విచిత్రమేమిటంటే బుద్ధుడిని అవతారాలలో చేర్చి ఆయనలోని బ్రాహ్మణీయ వ్యతిరేక మానవీయ చైతన్యాగ్నిగోళంపై చన్నీళ్లు చల్లడానికి దుస్సాహసించిన స్వార్ధపరవర్గమే తాపీధర్మారావు జరిపిన హేతుశోధనను, ముఖ్యంగా పురుషాధిపత్య సమాజ నిరంకుశ దుర్నీతిని ఎండగట్టిన ఆయనలోని మౌలిక సామాజిక విప్లవమూర్తిని కప్పిపుచ్చి ఆయనను కేవలం వాడుక భాషావాదిగా, అభ్యుదయ రచయితగా మాత్రమే చూపించడానికి పాల్పడింది. అంతమాత్రాన తాపీ తన పరిశోధనా గ్రంథాల ద్వారా కుండబద్దలు కొట్టినట్టు తేటతెల్లంచేసిన సామాజిక చేదుసత్యాలు మూఢాచారయుత భ్రష్ట సమాజాన్ని మేలుకొల్పకుండా ఉండవు. వర్తమాన, ఆసహజ దోపిడీ సమాజం పురోగామి పరిణామం చెందుతూ స్త్రీ జాతి తాను పోగొట్టుకొన్న తన వెన్నెముకను వెతుక్కొని తిరిగి తొడుక్కొని నిటారుగా నిలుచున్న క్షణాన తాపీ ధర్మారావుగారు లోకైక ప్రకాశకుడుగా విలసిల్లుతారు. ఆకాశమంత వెలుగయిన ఆయన ప్రకృతి సమధర్మ శోధన ప్రపంచానికి దారిదీపంగా వెలుగొందుతుంది. అ

---



---

గోదావరి లోయలో
కొండరెడ్లు

– పల్లాల బొర్రంరెడ్డి

# తెలుగు సంస్కృతీపునాది శిలలు

నేటి తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాల్లో విస్తరించిన పాపికొండలు, ఉప్పనపల్లి, కూటూరుగల్లు, వాలి సుగ్రీవ పర్వతాలు గుర్రపు జర్రి ఘాటీ (మారేడుమిల్లి – చింతూరు మార్గం), జంపరాతి కొండ, కాటమరాజు కొండ, దారలదుమ్మ కొండ, బాస దుమ్మకొండ నుండి నాదుల కొండదాకా విస్తరించిన మన్యంలో తెలుగు దొరలు నేటి కొండ రెడ్లు. రాజమహేంద్రవరాన్ని పాలించిన రెడ్డిపరివారంలో కొందరు రెడ్డి పోలవరం – (పాపి) కొండ మొదలు మీదగా ఆశ్రయం కోసం ఈ కారవుడలలోకి చొచ్చుకుపోయి స్థానికులైన ఈ తెలుంగు దొరలతో సంబంధాలు కలుపుకున్నందువల్ల, మనం, వారందరినీ 'కొండ రెడ్లు'గా పిలువసాగాము. ప్రాజ్నన్నయ యుగం శాసనాలలో కనిపించే తెఅంగు, కోంతి, తాణ్డేపల్లి, నయ్యది, మియ్యది మొదలైన భాషావిశేషాలు వారి మాటలలో తొణికిసలాడుతుంటాయి. కొత్త భాషలు కనుక్కోవడంలో మునిగిపోయిన మన భాషాశాస్త్రవేత్తలు, ఈ తెలుగు మాతృభాషగాగల కొండరెడ్లు, గూడెం, పాడేరు అడవులలో గల కొండ దొరలు, బగతలు, వాల్మీకులు, నల్లమలలో చెంచులు, నెల్లూరు, ప్రకాశం జిల్లాలలో గల యానాదుల భాషావిశేషాలను పట్టించుకోలేదు గాని, ఆచార్య బిరుదురాజు రామరాజు సంకల్పంతో ఈ జాతుల వాఙ్మయ అధ్యయనం మొదలైంది. పరిశోధనతో పాటు ఈ తెగల అభివృద్ధికి కృషి చేస్తున్న 'శక్తి' శివరామకృష్ణ ఆ తెగలలో చదువుకున్నవారి చేత తమ సంస్కృతిని గూర్చి వ్రాయించసాగారు. చెంచులు తమ బతుకుల గూర్చి వ్రాసియిచ్చిన వ్యాసాలను 'నల్లమలలో చెంచు ప్రపంచం' గా 'నడుస్తున్న చరిత్ర' ధారావాహికంగా ప్రచురించింది. శివరామకృష్ణగారి ప్రోత్సాహంతోనే కొండరెడ్డి తెగకు చెందిన పల్లాల బొర్రం రెడ్డి వ్రాసియిచ్చిన తమవారి బ్రతుకుదెరువు గాధలను ఈ సంచికలో ప్రారంభిస్తున్నాము. ఋతువులు – బతుకులు అడవులు, వనరులు, ఆలుమగలు, ఆటపాటలు, వేటలు, వంటలు – ఇలా వారి సంస్కృతిలో పలుకుబడులను చదవడమేగాక– మారేడుమిల్లి, దేవీపట్నం, యార్లగడ్డ రామవరం, వరరామచంద్రపురం, పోలవరం మండలాల లోపల ఈ తెగలను సందర్శించవలసిందగా చదువరులను కోరుతున్నాం.

ఈవ్యాసాల రచయిత పాఠశాలలో చదువుకున్నవాడు కనుక అతడు వ్రాసిన తీరు, వాడినభాష కలగాపులగమైపోయింది. అయినా, ఆధునికత ప్రభావం లేని వారి భాష వారి బతుకుల్లో ఇంకా మిగిలేవుంది. పై మండలాల్లోని కొండరెడ్ల పల్లెలకు వెళ్లి వారిని కలిసి వారిని వింటేనే అదంతా మనం తెలుసుకోగలుగుతాం. అందుకే ఆ తెగలను దగ్గరగా చూడమని చదవరులను ముఖ్యంగా తెలుగు భాషా పరిశోధకులను కోరుతున్నాం. వారి బాధ్యత ఇది. –సంపాదకుడు

## ఋతువులు – బతుకులు

కొండరెడ్లు వ్యవసాయదార్లు. వీరు పనిచేసుకొని బతుకుతరు. వీరిది ప్రధానవృత్తి పోడువ్యవసాయం. ఈ పోడుపని కొండలలోను, గొందులలోను, లంకలలోను అధికంగ ఉంటది. ఇది ఎడ్లతో దుక్కి దున్ని పండించునది కాదు. వెదురు మొదలునరికి మొదలులో డొళ్ళగొట్టి (కన్నం), దానిలో ఇనుపముక్కతో చేసిన గచ్చెలితో మునుములుపట్టి (హద్దులు) తువ్వుతారు. మునుములు అంటే ఇంతవరకు ఈకాలములో చేయగలమని అర్థం. ఈపని పూర్తిఅయిన తర్వాత రొడ్డకోత – అంటే తుప్పలు కొట్టడం. దీనికి కులానికి ఒకపూట భోజనంపెట్టి పొగరేకు, కూలీ 12 నయాపైసలు ఇచ్చేవారు.

**వెన్నుకోత :** పండిన పంట కోత. చోళ్ళు అయితే ప్రతి వెన్ను ఒక్కింటికి ఊసికత్తితో కోస్తరు. గడ్డితో తరిగే పద్ధతి లేదు. కోసిన ఎన్నులు కర్రలతో కట్టిన చోడిబడ్డిలో పోస్తరు.

**సామలకోత :** ఇది చిన్న ఊసికత్తితో ప్రతిఎన్ను కోస్తరు. చేయిపిడికి నిండేవరకు కోస్తరు. చేతిలో ఎన్నులు నిండినతర్వాత ఒక సామఎన్నుకర్ర కోసి దానితో కట్టకడతరు. కోసిన సామకట్టలు రైతుసందిటిలోవేసి, ఒకచోట చేనులోనే కట్టలబడ్డి వేసేవరకు ఓంవేసి ఉంచుతడు. ఓం అంటె సామకట్టలు వరుసగా వేసిన వరుస. సామకుప్పకు– నాలుగుమూలలలో కొట్లు(రాటలు) వేసి ఆ రాటలమీద కర్రలు పేర్చి(పరిచి) ఆ బడ్డి(అడప)మీద సామకట్టలు ఉంచుతరు. జనవరినెలలో పొలిచేస్తరు.

**సామలపొలి :** బడ్డినుండి కట్టలు కల్లంలో పడవేస్తరు. కట్టలకి కట్టిన ముడులను విప్పుతరు. ఆ వెన్నులమీద మనుషులు పరిగెడుతరు. వారే ఎద్దులు ఎడ్లను కట్టి తొక్కించే అలవాటు లేదు. రాత్రి కుప్ప కల్లంలో విడదీసినప్పుడు పొలి బూతుపాటలు పాడుతరు. తెల్లవారి గాలికి పోస్తరు. పొలికి ఎందరు వస్తే అందరికి పొల్లావు ఇస్తరు. పొల్లావుఅనగా రోజు కూలీగింజలు. చేటతో చేటెడినాల్లి పోస్తరు. చేటెడు గింజలు–కుంచెడుపైన

ఉంటది. కుంచం అనగా 4 మానికెలు, ఎనిమిది సేర్లు. పొలి మొదలురోజునుండి పొలి తీరేవరకు భోజనాలు పెట్టవలసినదే. నూర్చిన పొలిచేసిన గింజలు ఒలసాలులో (గుడ్డను గోనెసంచి రూపంలో చుట్టుతరు) గింజలు పోసి, మూతికట్టి, రైతు ఇంటికి తీసుకొనివెళ్ళి, వెదురుతో అల్లిన గంపబుట్టిలో పోస్తరు.

**చోళ్ళపోలి :** ఇది ఎన్ను కల్లంలో చేర్చి ఎంతమంది ఎంత కొట్టగలరో ఉజ్జ(అంచనా) వేసి కల్లంలో ఎన్ను వదిపోసుకుంటరు. వది అనగా ఇంత అని అర్థం. ఆ ఎన్నుచుట్టు పొలికి పోయినవారందరు చుట్టుకుగిడిమరి (కూర్చుని) పడివంపు అంటే గొడుగుచుట్టల రూపం కర్రలు చెయ్యియింత సామల పొలికి, ఇస్తరు. సామలు జొన్నలు, గంటెలు, కొర్రలు, కందులు, మినుములు, అలుసందలు, నువ్వులు, అనుములు, గుమ్మడికాయలు, ఒర్రకాయలు అన్ని ఇదేవిధంగ పొలులు చేసుకొని చేనుపాకనుండి ఊరికి అనగా సొంతగ్రామంలో ఇంటికి వస్తరు. చేనుపనులు వచ్చేవరకు ఊరిలో ఉంటరు.

**దుంపలు :** ఆడవారు జనవరి, ఫిబ్రవరి నెలలో అడవికిపోయి పిడిదుంపలు, గింటుగు, తేగలు, వైయిములు, చవిడెలు, సింగరం దుంప, చేదుదుంప, కాలువలకిపోయి ఎండ్రికలు తీసుకొనివస్తరు. చేనుకుపోయి కర్రలు, కాలువనుండి నీళ్ళుతెచ్చి అవి వండిపెడతరు.

ఒకరోజు దుంపలు, ఒకరోజు సామన్నం, ఒకరోజు గంటిఅన్నం, ఒకరోజు కొర్రఅన్నం, ఒకరోజు జొన్నఅన్నం, ఒకరోజు పొట్టజొన్నఅన్నం(మొక్క), ఒకరోజు బొంత, ఒకరోజు చోడిఅంబలి తింటరు, త్రాగుతరు. మగవారు శికారికి (అక్టోబరు) దసరానెల; (నవంబరు) చవితినెల పంటచేన్లు తినుటకు అలవాటుపడ్డ పందులు, గొర్రెలు, కణుసుల వేటకి వెళతరు.

మగవారు అడవినుండి పక్షులమాంసం, జంతువుల మాంసం, తేనె, అడ్డాకులు, అగ్గికొరకు కర్రలు తీసుకొని వస్తరు. జీలిగకల్లుఉన్న చెట్టుగీతరి జీలిగకల్లు ఇంటికి తీసుకొని వస్తడు. నవంబరు– చవితినెల, డిశంబరు–పల్కంనెల ఈ రెండునెలలు రద్దీగ పని ఉంటది. ఆడుతుపాడుతు మగవారు పనిచేస్తరు. సొర్రలకి కూలిచ్చి కోయించుతరు.

జనవరి– దేశవిడి; ఫిబ్రవరి– శివరాత్రి; మార్చి– బార్థం/ బాడితచెట్టుమీద వచ్చినపేరు.

ఏప్రిల్– కోరుకొండ, కొత్తఅమావాస; మే– గందామావాస.

**ఋతువులు – ఆహారం :** దేశవిడి (జనవరి) 'సంక్రాంతి' – పంచలో ముండబుడ్డికికూడ కర్వులేదు. కల్లు, కూడు, మాంసం, నచ్చినకూరలు, చిళ్ళిపువ్వు లభించుతవి. పిండిపండుగ జరిగినాక చోడిఅంబలి.

శివరాత్రి (ఫిబ్రవరి, మార్చి) – దుంపలు అధికం. మాంసం, కల్లు, గంటిజొన్న, సామ, కొర్రజావలు, కొందరు అన్నాలు, కొందరు చోడిఅంబలి తింటారు, తాగుతరు.

కోరుకొండ (ఏప్రిల్, మే) – అడవిగొడ్డుకూర, పర్మిపండ్లు, తుమ్మికెపండ్లు, మొళ్ళికెపండ్లు, పనసపండ్లు, మాంసం, కాలువలో పీతలు, ఎండ్రికలు, దుంపలు, ఈతపండ్లు, చిట్టిపోలపండ్లు, అరటికాయలు, చేపలు, ఇంటిలో తిండ్లు.

దూలవిడి (మే, జూన్, జూలై) – మామిడి, పోల, మారోడి, పనస, అనాస, పనస, మామిడికాయలు, కొండఈతమొవ్వులు,

4 మానికెలు 1 కుంచం 

2 మానికెలు 1 అడ్డ 

2 సోళలు 1 తవ్వ 

2 పాసెర్లు 1 సోళ 

1 పాసెరి 2 పిడుకులు 

జీలికెచెట్టు మొగజీరికెచెట్టు గున్నమొవ్వులు తింటరు. ఇంటిలోని తిండ్లు మామూలే. 'దూలవిడికి మామిడి దులదుల రాలుతుంది'.

మునుకోలు, పెద్దవిడి (జూలై, ఆగష్టు) – మామిడిటెంకలు బద్దలుకొట్టి, పప్పుతీసి పప్పు చితకదంచి, కాలువలో ఊరవేసి, అంబలిపెట్టి రొట్టెలుచేసి తింటరు. ఈ అంబలికి ఎండిమిర్చి కాల్చి, వెల్లుల్లివేసి వెదురుబొంగు(పిడప) కొమ్ములు గరగగూర, కొండ్లెపు కూరలు కారంతో కలిపి అంబలితో నంజుకం. పిట్టిచుర్వులు, కాలువలోని ఎండ్రికలు, రొయ్యలు, కొక్కులు పుట్టవి, చిరిపుట్టవి, వేనపుపిల్లెండ్లు, డొక్కికొక్కులు, వేపిచెవులు, పందిమూతులు, గొర్రెదెక్కకూర నంజుకాలు. 'పెద్దవిడికి మామిడి పేరు లేకుండ పోతుంది'.

మునుకోలు(ఆగష్టు ); కన్నెలు(సెప్టెంబరు) – ఇవి 'పిట్టకి బొట్టకి దీముమెర్రని కాలం' – కరువుకాలం. 'కర్వుకు దరబొక్క' అట అంటె ఆకలికి ఏదీ అడ్డులేదని. కాలువఒడ్డులో భూమిఅంచులో ఏ కర్రైనా, పామైనా, పిట్టయిన కాలువ వచ్చినపుడు దూరవచ్చు. అడ్డులేదు. ఆకలికి మంచి, చెడు, రుచి అనిలేదు అని అర్థం. పండించిన పంటలు అన్నీ వ్యవసాయంకు ఖర్చయిపోతవి. అప్పులుచేయుట, మేక, కోడి అమ్ముట; చింతలు, తనఖాలు పెట్టుట, చికాకులు.

దసరా (అక్టోబరు) – 1. బుడమవడ్లు, 2. కన్నెసామలు, 3. మొక్కజొన్న కాయలు, 4. గుమ్మడి కాయలు, కూరకొనలు, లేతదుంపలు, కప్పదుంపలు (చిలకడదుంపలు). ఇవిలేనివారు జీరికచెట్టు పడగొట్టి దానిని బద్దలుకొట్టి, ఆ బద్దలు ఎండబెట్టి, ఆ బద్దలను చితక్కొట్టి దుళ్ళిన దూళిని(పిండి) రొట్టెలు కాల్చుకొని పిట్టు వండుకొని, చుర్వులుపిట్టి, ముద్దచుర్వులు ఉండలు చేసుకొని వేపుకొని, కొన్ని దాచుకొని, వండుకొని తింటరు.

చవితి (నవంబరు) – 'చలికూటికి బాల ఏడ్వని కాలం'; పల్కం (డిశంబరు).

అడవికిపోయి తేగదుంపలు, కొమ్ములు అంటె వెదురుకొమ్ములు, టంకఅంబలి నంజుకం. ఈ సీజనులో షావుకార్లు పెట్టుబడిపెట్టి బాగుపడతరు. ఊరి ఊరని అడవి తేగదుంపలు, గుమ్మడికాయ జోళికెలు, గుమ్మడికూర, జీరికెపిండి, టెంకంబలి, గుమ్మడి ఆకుకూరలు, దబ్బసారికూరలు తిని, అన్నంలేక దసరానెల ఎప్పుడెప్పుడని రోజులు లెక్కపెడతరు. దసరానుండి పర్వాలేదు. ఇవి 40 సంవత్సరాలక్రితం విషయాలు. ప్రభుత్వంవారి సరఫరాలేక, ప్రభుత్వం అందుబాటులోలేక రహదారి సౌకర్యాలు లేక, పండిన ముడిసరుకులకి ధరలులేక, సంతలు

దగ్గరలేక, మనుష్యులు, జంతువులు హోరాహోరిగా బతుకుపోరాటం చేసేవారు. మనుషులతోపాటు జంతువులుకూడ మనుషులు పండించిన పంటలు, మామిడిటెంకలుకూడ తినేవి.

### వానల్లో రకాలు

1. కందిపొట్టు వర్షం – జనవరి (పోడులో మిగిలిన కందిగింజలు మొలుస్తవి)
2. పొగసూరి వర్షం – ఏప్రియల్ (అగ్గిమంటలపొగతో వచ్చు వర్షం)
3. తొలకరి జల్లులు – మే
4. దూలవేటుముసాబు(ముసురు) – ముత్యంలాగ చిన్నవర్షం దూలిఆకారంతో ఉండును (దులదుల పడును)
5. పెద్దివిడిముసాబు – జూలై
6. మునుకోలుముసాబు – ఆగష్టు
7. కన్నెముసాబు – ఒక్కసారిగా పడినవర్షం దారిలో ఉన్న తుప్పలు, ఆకులు కదిలి శబ్దంతో బయ్యమని నీరు పోవును.
8. దసర – అక్టోబరు వేంగిసవరదలు, అడవిలో వేగిసెచెట్లు విరజల్లి పూయును. ఆ పువ్వు రాలినట్లు కుండపోతలాగున వర్షం. ధారమీద పెద్దపెద్ద కాలువలు పొర్లి పొంగుతుంటవి. బూరల వాన.
9. దీపావళి ముసురు
10. నవంబరులో గాలివానలు – వరదలు

**చాంద్రమానం** (చంద్రుని బట్టి లెక్క)

- నెల మబ్బులకు వస్తామయ్య; బాలనెలకు వస్తాం
- తేరునెల – వచ్చేనెల
- పొగసూరిమబ్బు – ఏప్రిల్‌నెలలో కొండలు నిప్పు అంటును. ఆ పొగ ఆకాశంలో ఉండును.
- గాంటం – వరుసగ ఆగిఆగి వస్తూ ఉంటది వాన.
- బరవడి ఎన్నిసార్లు కీరితే అన్ని వర్షాలు
- లంజెటి (లంజఅవిటి) – పిట్టపిల్లల ముసురు. తొలకరి (చింత) చిగురాకు ముసురు.
- పిగినిపిట్ట – మందగోరపిట్టలు, పిట్టలపిల్లలు.
- ఎర్రగాయ రొండి – మామిడిపండ్లు తొల్మ తొలిపండ్లు, మామిడి ఎర్రగాయలు ఉండి ఎండలు అధికంగ ఉండును.
- దబ్బపువ్వుల రొండి – దబ్బగడ్డి పువ్వులు గాలికి ఎగిరి ఎండ అధికం ఉండును.
- రావడి + వస్కపండ్ల రొండి – ఈ పండ్లు పండినప్పుడు అధిక ఎండ, పచ్చగడ్డి ఎండిపోవును.

### గోదావరిమన్యం ఋతుచక్రం

జనవరి – దేశవిడి : సంక్రాంతి – దేశమంతా పండుగవిడిపోతుంది.

ఫిబ్రరి – బాడ్దం : పప్పులపండుగ, పిండిపండుగ, రాజులపండుగ – శివరాత్రి.
'రండో చేరి పాండవులారా భోంచేయరండో'; 'లేలేలమ్మారో ఓలే లేలా లేలా'



పోడుకాపలాకు అంబలిమోత

మార్చి – కొత్తమాస : భూదేవిపండుగ, విత్తనాలపండుగ. 'పుట్టినదాట భూమి దేవుడు పూరడి పిట్టలవన్నె'

ఏప్రిల్ – కోరుకొండ : కోరుకొండకొలువు (రథోత్సవం). 'కోరుకొండకు మామిళ్ళు కోడిగుడ్డంత' మామిడిపండుగ, భద్రాచలంలో దేవుడి పెళ్ళి.

మే – గంగాలమ్మపండుగ : ఎర్రగాయరొండి – కణుసుమొరకలఎండ
*పండుగ పదాలు :*
'ఆడవాలె పాడవాలె – వేడుకాలు చెయ్యవాలెయా' అమ్మవారు ఉండే టప్పుడు ఆడేపాడే బాలలము.
*పెళ్ళి పదాలు :*
అచ్చుకోడ లయ్యోకోడ లాలచ్చీరి బాలకోడలా – లిల్లిబూచో లిల్లేలేవో లల్లవారు బాలకోడలా.

జూన్ – దూలవిడి : దూలవిడికి మామిడి దులదుల రాలుతుంది

జూలై – పెద్దవిడి : పెద్దవిడికి మామిడి పేరులేకుండా పోతుంది

అగష్టు–కొత్తలుకలపడం : మునుకోలుకు ముద్ద(బొంత) తొలిపంట

సెప్టెంబరు – కన్నె : 'కన్నె పిట్ట దిగిందోయ్ పప్పులు చల్లాలి'

అక్టోబరు – దసరా : బరువడి (గండుపిల్లి). 'దశమి పోతులు కొరకవాలె' అనుకుంటుంది.
'దసరాకు కొత్తపాతల ఎడం – డాకు డాకు ఇబ్బందులు'

నవంబరు–సవితి, పలకం : 'చలికూటికి బాల ఏడ్వని కాలం'

డిసెంబరు–సవితి, పలకం : 'సవితి పలకానికి జల్లున పంట'

(తరువాయి వచ్చే సంచికలో...)

# ఈ తెలుగు మాటల్ని వాడుకలోకి తెద్దాం

**మనం** వాడకుండా ఉండటం వల్లనే మన మేనుగాయల్లో (అవయవాల్లో) ఒకటైన తోక మాయమైపోయిందట. అట్లాగే ఇప్పుడు మనం అన్నింటికీ మరలపై, తొలపులపై ఆనుపడుతూ, కదలకుండా, కొన్ని మేనుగాయల్ని వాడకుండా ఉండటం వలన మెల్లగా ఆ మేనుగాయలు కనుమరుగు అవుతాయట.

అట్లాగే మనం మాట్లాడే నుడిలో కూడా మనకు కొన్ని మాటలను వాడకుండా పోతే అవి కనుమరుగు అవుతాయి. మన నానాటి వాడుకలో ఎన్నో పెరనుడి మాటలు వచ్చేస్తున్నాయి. వాటిలో చాలావరకు మనకు తెలిసిన తెలుగుమాటలు ఉన్నవే. వాటిని వాడకపోతే ఆ మాటలు ఉనికిని కోలుపోతాయి. అట్లాగే కొత్త కొత్త అక్కరల కోసం కొత్త మాటలెన్నో ఆంగ్లం గుండా తెలుగులోకి వస్తున్నాయి. వాటికి తేటతెలుగులో తేలికమాటల్ని పుట్టించగలిగితేనే మంది నోటిలో నిలబడగలవు. ఒక పెరనుడి మాటకు మారుగా తెలుగుకాక మరొక నుడి మాటను పుట్టిస్తే వాడుకలోకి తేలేము. అలతి అలతి మాటలతో చిన్నవిగా తేలికగా ఉండటం తెలుగు మాటల తీరు.

తిరుపతిలోని 'ప్రేరణ' అనే మహిళావేదిక వారు, ఇట్లాంటి తేలిక తెలుగు మాటలను ఆంగ్లం బడిలో చదివే పిల్లలకు తెలియచేయాలని నడుంకట్టినారు. కొన్ని బడులను ఎంపికచేసి, ఆ బడులలోని పిల్లలకు ఈ మాటలను నెళవుచేసి, వారిచేత చదివించి, వారికి పోటీలు పెట్టి నేర్చుకొనేటట్లు చేస్తున్నారు. భవానిగారు, భువనేశ్వరిగారు అనే ఇద్దరు తెలుగు అనుగరులు ఈ పనిని తలకెత్తుకుని చేస్తున్నారు. వీరు చేస్తున్న ఈ పని మరింతమందికి పురిగొలుపు కావాలని కోరుకొందాం.

1. Admission : తూరిక, వేంచేపు
2. Agenda : పన్నిక
3. Airport : గాలిరేవు
4. Alternative : మారు, వేరొండు
5. Apartment : దొంతిమేడ
6. Application : విన్నపం
7. Artificial : ఏలి
8. Attender : అడియం
9. Auto : తానేగి
10. Award : పోణిమి
11. Bank : అడకిలు
12. Banner : కొడి, కొడితెర
13. Bat : బొప్పె
14. Beauty Parlour : చెలువిలు
15. Belt : ఇక్కువారు
16. Bi-cycle : ఇగ్గాను
17. Black Board : నల్లబల్ల
18. Bracelet : చిరుకడియం
19. Breakfast : తొలితిండి
20. Bulb : బుడ్డి, వెలుగ్గాయ
21. Bus : పేరేగి
22. Bus Stand : పేరేగిలు
23. Cake : అడ
24. Calculator : ఎంచిక
25. Cartoon : నగుబొమ్మ
26. Chocolate : కమ్మరకట్టు
27. Club : గమిలు
28. Coaching : కరపు
29. Collector : అనుపరి
30. Comfort : హాయి, నిమ్మళం
31. Computer : ఎనికెన
32. Communication: కలగోలుతనం
33. Consolation : ఊరడింపు
34. CupBoard : అరలగూడు
35. Customer : వాడుకరి
36. Daily : నానాడు
37. Demand : నిక్కచ్చు
38. Depression : కుంగుదల
39. DishWasher : తోమెన
40. Design : పుంజ
41. Desk : వాలుబల్ల
42. Development : పెనుపు
43. Dialogue : పానలు
44. Discussion : పెనగువ
45. District : పెనువంటెం, పెవ్వంటెం
46. Drawing Room : పడసాల
47. E-mail : మినుగమ్మ, మిన్నంచె
48. Entry Form : ఒలయిక
49. Extrovert : వెలిమోము
50. Face Pack : మోముపట్టి
51. Face Powder : మోముపొడి
52. Facial : మోమునలుగు
53. Fan : వీవెన
54. Fast food : వడితిండి
55. Fast food Centre : వడితిండ్లు
56. Flats : దొంతిల్లు
57. Fridge : చలివెన
58. Gas cylinder : ఈదబండ
59. Hording : చాటుపలక
60. Insurance : అచ్చుబాటు
61. Internet : కలుపెన
62. Introvert : లోమోము
63. Land Phone : పాదుపలుకి
64. Layout : వెలినెలవు
65. Leggins : కాలుడువు
66. Logo : చిరువాలు
67. Machine : మర
68. Mobile Phone : చే పలుకి
69. Momento : తలపిక
70. Motivate : పురిగొల్పు
71. Motor Bike : మరఇగ్గాను
72. Necklace : పట్టెడ
73. Network : అగవల్లిక
74. News : సోద
75. Participation : పాలుగోలు
76. Pamphlet : ఉల్లాకు
77. Permission : ఒప్పుకోలు
78. Pilgrims : తెరువరులు
79. Pizza : పిడకట్టు

80. Plots : మెనలు
81. postman : అంచెరి
82. Post Office : అంచిలు
83. Printer : అచ్చెన
84. Program : ఒంజలి
85. Railway Station : పట్టేగిలు
86. Remote : తొలపు
87. Ribbon : జడాలు
88. Scanner : ఒరయెన
89. Sentence : నుడుగు
90. Serial : తొడరిక
91. Shopping : సంతెన
92. ShoppingMall : సంతమేడ
93. Show Case : కోపర
94. Sick : నలత
95. Shipping : దాటాట
96. Sponsor : ఇడుకోలు
97. Stage : అరుగు
98. Suitcase : ఉడుపర
99. Supermarket : సంతకొట్టు
100. Switch off : మీటతీయు
101. Switch on : మీట వేయు
102. Talent : నేరిమి
103. Teasing : నరుము
104. Technology : ఆనిమి
105. Television (T.V.) : తొలపారవ (తొ.పా)
106. Temperature : వేడిమి
107. Thank You : మప్పిదాలు
108. Tights : బిగుతులు
109. Tops : ఎగువలు
110. Tourist : త్రోవరి
111. Travelling : వెడలిక
112. Treatment : విరుగము
113. Venue : నెలకువ
114. Wall Poster : గోడంటు
115. Washing Machine : ఉతుకెన

---

**కవిత**

# చదువుల చందమామ




చెరువులోని అలలను చెదరగొట్టినపుడు
చేతికి అందుతాడు అందాల జాబిలి అందరికీ
ఆడపిల్లలకు మాత్రమే
అందరాని స్వప్నమా
చదువుల చందమామ?!

అరుణగ్రహంపై అడుగు మోపిన ఈ కాలంలోనూ
వివక్షల ఉరితాళ్ళను బాలికల గొంతులకు బిగిస్తారెందుకు
కనిపించని ఆచారాల సంకెళ్ళతో బంధిస్తారెందుకు
విద్యాకిరణ మాలలను ధరించకూడదని
ముద్దుల ముఖపద్మాలను
బురఖాలోనే బంధించాలని
నిషేధాల ఖడ్గచాలనాలు
నియమాల బంధనాలు
ఇంకా ఎంతకాలం?

మేడలడిగానా మిద్దెలడిగానా
మెడలో మెరిసే వజ్రాల నగలడిగానా
బాలికలందరూ
క్షరాల నక్షత్రాలను అందుకోవాలి
చదువుల వెన్నెలమ్మ ఒడిలో సేదతీరతామని
చిరుకోరిక వెల్లడించినందుకే
నాపై తుపాకీ తూటా ఎక్కుపెట్టినపుడు
మరణం అంచులదాకా పయనించినా
గొడ్డలితో నరికిన మోడు

ఎట్టని చిగురుల చిరునవ్వు చిలకరించినట్లు
మఊల జీవించాను మృత్యుంజయగీతాన్నై
ఎప్పుడైనా ఎవరైనా
ఛిద్రం చేయగలరు దేహాన్ని
కానొక జీవనలక్ష్యంతో
జ్వలించే హృదయాన్ని
ధ్వంసించే ఆయుధాన్ని
శాస్త్రవేత్తా కనుక్కోలేదు
ఇంతవరకూ.

గుంపులు గుంపులుగా ఎగిరే తూనీగల్లా
ఆకాశంలో పక్షుల్లా స్వేచ్ఛా గీతాలై
చదువుల ఉద్యాన వనంలో
ఆంక్షలు లేకుండా ఎగిరేవరకు
నా దేహానికి మరణం లేదు
మలాలా యూసఫ్ జాయ్‌ను నేను
మడమ తిప్పని యోధురాలిని నేను.


**– మందరపు హైమవతి**

ఫోన్ : 09441062732




# తెలుగు నేర్చుకొంటున్న శ్రీలంక తెలుగువారు

**ఈ** వార్త మిమ్మల్ని వింతగొలుపుతున్నదా?! మీరు ఇంతకుముందు 'నడుస్తున్నచరిత్ర' చదువరులై వుంటే మీకిదేమీ కొత్త మందల (సమాచారం) కాదు. కొన్నేళ్ల క్రిందటే తెలుగువారి కార్యకర్తలు శ్రీలంకలో తెలుగువారిని కలిసి, ఆవివరాలను 'నడుస్తున్నచరిత్ర'లో వ్రాశారు. 2014 ఏప్రిల్‌లో తెలుగువాణి, తెలుగు భాషోద్యమ సమాఖ్య కార్యకర్తలు స.వెం.రమేశ్, అడపాల సుబ్బారెడ్డి శ్రీలంక వెళ్లి మరింత కృషిచేశారు. అక్కడి పాములు పట్టే జాతి (అహికుంటికలు) ఎక్కువగా వున్న 2 పల్లెల్లో తెలుగు అక్షరాన్ని పరిచయం చేశారు. దేవరగమ, కుడాగమ, అంతరపెద్ద అనే గ్రామాలను స్థానిక తెలుగువారు చేపలచెరువు, పెద్దచెరువు, చీకుముల్లి అడివి అని పిలుస్తారు. అక్కడ వున్న తెలుగువారిలో వడ్డెరలు, మాదిగలు, కంబళ నాయకర్లు (తెలుగు గొల్లలు) పెద్దసంఖ్యలో ఉన్నారు. 'ఆల్ శ్రీలంక తెలుగు కాంగ్రెస్', 'తెలుగు నాయకర్ కాంగ్రెస్' అనే రెండు రాజకీయపార్టీలున్నాయి. ఈ సమాచారంతో వెనుకకు వచ్చిన తర్వాత సింహళ లిపి ద్వారా తెలుగు నేర్పించే పుస్తకాన్ని 'సింహల-తెలుగువాచకం'ను 'తెలుగువాణి' కోసం స.వెం.రమేశ్ తయారుచేశారు. మళ్లీ ఇటీవలే ఆ పుస్తకాలతోను, అక్షరమాల పటంతోను వారు శ్రీలంక వెళ్లి వాటిని అక్కడి వారికిచ్చి, నేర్చుకొనే పద్ధతిని వారికి నేర్పి వచ్చారు. వారితోపాటు ఆంధ్రజ్యోతి దినపత్రిక తరఫున శ్రీ ఆర్.ఎం.ఉమామహేశ్వరరావు బృందం కూడా వెళ్లి వచ్చి ఒక సమగ్ర కథనాన్ని ఆంధ్రజ్యోతి దినపత్రికలో ఒక పూర్తి పుటలో ఇవ్వడంతోపాటు వారి టి.వి.ఛానెల్ ఎ.బి.ఎన్‌లో కూడా వివరంగా ప్రసారం చేశారు. ముమ్ముందు అక్కడి తెలుగువారందరికీ తెలుగు పరిచయ పాఠాలు నేర్పించటానికి తెలుగువాణి తలపెట్టింది. శ్రీలంకలో మొత్తం తెలుగువారు 8 లక్షలకు పైబడి మూలవాసులున్నారని, ఈ శతాబ్దంలో వ్యాపారాల నిమిత్తం వెళ్లినవారు ఇంకొందరున్నారని ఇప్పటికి తెలిసిన సమాచారం. ఇంకా లోతుగా పరిశోధన చేస్తే ఇంకొన్ని వివరాలు బయటకు రావచ్చు.

ఇక్కడ మరొక సంగతి చెప్పుకోవాలి. శ్రీలంకను ఏలిన చివరి తెలుగునాయకరాజు శ్రీ విక్రమరాజసింగ గురించిన సమాచారం లోగడే నడుస్తున్నచరిత్ర ప్రచురించింది. 'కండి' ముఖ్య పట్టణంగా శ్రీలంకను పరిపాలించిన ఆయనను బ్రిటీష్‌వారు నిర్బంధించి, రాయవేలూరు కోటలో నిర్బంధించిన సమాచారాన్ని శ్రీమతి డి.పి.అనూరాధ వ్రాసిన కథనాన్ని కూడా లోగడ నడుస్తున్నచరిత్ర ప్రచురించింది.

ఇప్పుడు-జనవరి 30న-విక్రమరాజసింగ 183వ తిథిని గురుపూజగా రాయవేలూరులో పెద్ద ఎత్తున అక్కడి తెలుగువారు జరిపారు. చెల్లియమ్మ గుడి దగ్గర నుండి వారి సమాధి వున్న ముత్తు మండపం వరకు ఊరేగింపు జరిపారు. అన్నినాయుడు సంఘాల కూటమికి చెందిన సదా గోపరామానుజం, మనోహరన్, కవి మురళీకృష్ణ, రాధాకృష్ణ విక్రమరాజుగారి వారసులు, యువకార్యకర్తలు పాల్గొన్నారు.

ఇప్పటికి శ్రీలంక సంగతులు ఇవి.

**- అడపాల సుబ్బారెడ్డి**

# తమిళనాడులో 'తెలుగువాణి' పాఠాలు

**త**మిళనాడులో తెలుగు భాషోద్యమ చైతన్యం వెల్లివిరుస్తున్నది. 'తెలుగువాణి' ట్రస్టు పూనికతో ఉడుమలపేట తాలూకాలో తెలుగు తరగతులు నడుస్తున్నాయి. మార్టూరు వసంతనాయుడు చొరవతో కొన్ని వూళ్లలో తరగతులు నడుస్తున్నాయి. తమిళనాట ద్రవిడపార్టీల రాజకీయాలకు విసిగిపోయిన తెలుగువారు కొత్తచైతన్యంతో, కొత్త కార్యక్రమాలతో ముందుకు వస్తున్నారు. కట్టబొమ్మన, తిరుమలనాయకర్ వంటి వీరులను తమ ప్రతీకలుగా నిలబెట్టుకొని కదులుతున్నారు.

Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL 14381/7/1/2015 TC

AMMANUDI (Telugu Monthly)
March 2015, Vol.1, Issue : 1

RNI-APTEL 14381/7/1/2015 TC
Postal Reg. No.

